## తిరుపతి వేంకటకవులొనర్చిన తెనుఁగు గ్రంథములు

### నాటకములు

| | | | |
|---|---|---|---|
| 1 | పాండవజననము | 1 | 4 |
| 2 | పాండవ ప్రవాసము | 1 | 8 |
| 3 | పాండవోద్యోగము | 1 | 12 |
| 4 | పాండవ విజయము | 1 | 12 |
| 5 | పాండవాశ్వమేధము | 1 | 8 |
| 6 | పాండవ రాజసూయము | 0 | 8 |
| 7 | అనర్ఘనారదము | 0 | 10 |
| 8 | దంభవామనము | 0 | 10 |
| 9 | సుకన్య | 0 | 10 |
| 10 | పండిత రాజము | 1 | 0 |
| 11 | ప్రభావతీ ప్రద్యుమ్నము | 1 | 0 |
| 12 | మృచ్ఛకటికము | 2 | 0 |
| 13 | ముద్రారాక్షసము | 1 | 8 |
| 14 | బాలరామాయణము | 4 | 0 |
| 15 | ఎడ్వర్డు పట్టాభిషేకము | 0 | 12 |
| 16 | వ్యసన విజయము | 0 | 12 |
| 17 | సౌవర్ణపాత్రికము | 0 | 8 |

### ప్రహసనములు

| | | | |
|---|---|---|---|
| 18 | రసాభాసము | 0 | 8 |
| 19 | త్రిలోకీ విజయము | 0 | 12 |
| 20 | పల్లెటూళ్ల పట్టుదలలు | 0 | 12 |
| 21 | అపూర్వ కవితావివేచనము | 0 | 8 |
| 22 | కవి సింహగర్జితములు | 0 | 6 |

### ప్రబంధములు

| | | |
|---|---|---|
| 23 | శ్రవణానందము | 1 |
| 24 | పాణిగృహీత | 1 |
| 25 | లక్షణా పరిణయము | 1 |
| 26 | బుద్ధచరిత్రము | 2 |
| 27 | శ్రీనివాస విలాసము | 2 |
| 28 | ఏలామాహాత్మ్యము | 0 |
| 29 | బొబ్బిలి పట్టాభిషేకము | 1 |
| 30 | పూర్వహరిశ్చంద్ర చరిత్ర | 1 |
| 31 | శివభక్తి | 2 |
| 32 | సుశీల | 2 |
| 33 | పతివ్రత | 1 |
| 34 | గోదేవి | 1 |

### పురాణములు

| | | |
|---|---|---|
| 35 | దేవీభాగవతము | 13 |
| 36 | శివలీలలు | 10 |

### వెం॥ శా॥ చరిత్రలు

| | | |
|---|---|---|
| 37 | జాతకచర్య | 1 |
| 38 | ఇటీవలిచర్య | 2 |

### వివాదగ్రంథములు

| | | |
|---|---|---|
| 39 | గీరతము (4 భాగములు) | 6 |
| 40 | గుంటూరుసీమ (2 రంగములు) | 5 |
| 41 | వేమవరాగ్రహార శతావధానము | 1 |
| 42 | చెళ్ళపిళ్ళ జయంతి | 1 |
| 43 | మల్లేశ్వర విజ్ఞప్తి | 1 |

వలయువారు

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం P. O. తూ॥ గో॥ జిల్లా

శ్రీమత్పరదేవతాయైనమః

# చంద్రప్రభ చరిత్రము

[ వీరనందికవి కృతికి తెనుఁగు. ]




తిరుపతి వేంకటేశ్వరకవి

ప్రణీతము

పరిష్కర్త:

చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి

వెల:
1-8-0

సంవత్సరం
1954


ప్రకాశకులు:
చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు
వేంకటేశ్వర పబ్లికేషన్సు
కడియం P. O
తూ॥గో॥ జిల్లా.

ముద్రణ:
వేంకటేశ్వర ప్రింటింగు ప్రెస్
ఆలమూరు.

1000 ప్రతులు
మూడవకూర్పు

ఓం

శ్రీ మత్పరదేవతాయైనమః

# చంద్రప్రభ చరిత్రము

## ప్రథమ సర్గము

శ్లో. శారదా వసతు మద్రసనాయాం నారదాదిసురమౌని కుమారా
పారదామృతపటీరమరాళీశారదాంబుదసమానశరీరా.

సురలోకమునం దేదేవుని రత్నమయంబగు పేరోలగం బెసర నృత్యముచేయు దేవేంద్రుని వేయికన్నులచేఁ బ్రతిబింబితంబై నల్ల గల్వలచే నలంకరింపఁబడినట్లు ప్రకాశించెనో యట్టి వృషభదేవుఁ డను పేరుగల ప్రథమజినుఁడు మాకైశ్వర్య మొసఁగుగాత! స్ఫటికములవలె స్వచ్ఛమైన యే దేవుని శరీరమందు నమస్కరించుటకు వచ్చిన జైనులు, పాల్కడలియందు దేవతలవలెఁ బ్రతిఫలించిరో యట్టి చంద్రప్రభుఁడనుపేరు గలయష్టమతీర్థకరుఁడు మముఁ బ్రోచుఁగాత! అనంత విజ్ఞానంబును, ననంత వీర్యంబును, ననంతసౌఖ్యంబును, ననంత దర్శనంబును నను నీయనంత చతుష్టయముచే సర్వవ్యాపకుండై యున్న శాంతియను పదియాఱవ తీర్థ కరుఁడు మా సంసారదుఃఖములను దొలఁగించుఁగాత! ముదిమియను ముసలిదానిచేస్మరణీయుఁడై, యనశ్వరమగు నిర్వాణలక్ష్మికి స్వయంవర పతియై. నిరామయుండై, సంసారమును జయించి సురాసురులచేఁ గొని యాడఁబడిన వీరుఁడను నంతిమతీర్థకరునిఁ గొనియాడెదను. హితమై పర స్పర భేదములు లేక యితరమతస్థులచే జయింపఁబడక మోక్షప్రదమయి జైనులకందఱకు శరణమైన జినసిద్ధాంతమే నాకును శరణమగుఁగాత! గుండ్రని మంచి ముత్తెములుగల యేకావళి యెవరికో రాజులకుఁగాని దొర

కనిపగిది సమంతభద్రుఁడు మొదలగు జైనమతస్థాపకుల చరిత్రములు బుద్ధిమంతులకుఁ గాని దొరకవు. పూర్వజన్మ సంస్కార విశేషంబున సుజనులు ప్రబంధమునందలి గుణము గ్రహించినదాఁక సంతోషింపరు. దుర్జనులో, దోషము కనఁబడినదాఁక వదలరు. ప్రశంస చేయుచు నాప్రబంధమునందలి గుణములు కనఁబఱచిన సుజనులకు గురువులని నమస్కరించెదను. నిందసేయుచు దోషములు కనఁబఱచిన దుర్జనులకుఁ గూడ నంజలిబంధించెదను. ఏచరిత్రమును వర్ణించుట కీశ్వరుఁడు భయపడునో, సరస్వతియు భారముగాఁ దలఁచునో దానిని మందమతి నగు నేను వర్ణింపఁ దలఁచినను నది జైనమత స్థాపకుల చరిత్రము గనుక హాస్యపాత్రుఁడను గాను. ప్రవేశింప శక్యముగాని మహారణ్యమందు యూథపతి నడచిన దారివెంబడిఁ బిల్లయేనుఁగు నడచినట్లు వర్ణింప శక్యముగాని మహాత్ముల చరిత్రమందుఁ బూర్వులు నడచిన దారిఁబట్టి నేనును వర్ణించుచున్నాఁడను.

ఎత్తైన శిఖరములచే నొరయఁబడుచున్న యాకాశమందు వరిపొట్టలంబోలు తన కాంతులచే మెఱుపులు పుట్టించుచు సమస్త ఫలవృక్షముల కాలవాలమయి పూర్వమందర మను పర్వతమొకటి ద్వితీయ ద్వీపమునందుఁ గలదు. దానిం జుట్టువాఱి చిలుక ఱెక్కలవంటి రంగులు గల సస్యములచే నిండి సర్వదా మరకత మయములో యనఁ దనరారు భూములచేఁ గన్నులకుఁ బండువొనరించుచు సమస్త సౌఖ్యములకుఁ ద్రిదివంబును బోలు మంగళావతి యను సార్థకనామము గల యొక దేశము పూర్వ విదేహ భూములయందుఁ గలదు. నిరాలంబంబు లగు తారాపథఖండములు భూమిమీఁదఁ బడినవో యనినట్లు నల్లగల్వల కాంతిచే రంగు వేయఁబడిన తెల్లని నీరుగల చెఱువులును, జంద్రకాంత శిలామయంబు లగు పర్వతంబులనుండి చంద్రోదయ కాలములయం దెడతెగక పాఱు నీటిచే వేసవికాలముల యందును నద్దరికిద్దరికిని దాసి ప్రవహించు నదులను గలిగియున్న యాదేశమువంకఁ దనకు బ్రతికూలమగు భవ

ధాన్య సంపద నివసించుచున్న దను నసూయచేఁ గాఁబోలు నెన్నఁడును విపత్తు కన్నెత్తి చూడదు. వికసించిన మెట్టతామర పూవులు రాజ చిహ్నంబులగు తెల్ల గొడుగులవలెఁ బ్రకాశింప సర్వ దేశాధిపత్యము తనకుఁగలదని సూచించుచున్న యానాడునఁ గల నవరత్నాకరంబులగు గనులచేతనే భూమికి వసుమతియను పేరు గలిగినది. మిన్నంటు ధాన్య రాసు లచట సర్వదా సంతోషముచే దేశమును జూడవచ్చిన కులపర్వత ములవలెఁ బ్రకాశించు చుండును. పల్లెటూళ్ళ శోభను బట్టణంబులును బట్టణంబులు శోభను బల్లెటూళ్ళను జూడబోయినవో యనునట్టు లాదేశము నందలి గ్రామపురంబు లుభయ సౌఖ్యములచేఁ జెలువారుచుండును. అందు రత్న సంచయ మను నొక రాజధాని కలదు. కట్టుఁగట్టులకుఁ గట్టిన యేనుఁగులతోడను గృహ ద్వారములయందుఁ జెక్కఁబడిన గజా కారములైన బొమ్మలచేతను గంపులు మినుములు మొదలయిన వాని వలెఁ బోగులు పోయఁబడిన నవరత్న రాసులచేతను నావీటి వీధులు కల కల లాడుచుండును. దానిఁ జుట్టువాఱియున్న యగడ్తయందుఁ గల నిర్మలోదకములలోఁ బ్రతిఫలించిన మేఘములు నీటియేనుఁగు లను భ్రాంతిఁ గలుగఁ జేయుచుండును. రాత్రులయందుఁ గోటబురుజులను దాసియున్న నక్షత్రములు పెట్టని దీపములవలెఁ గన్పట్టు చుండును. చంద్రునియందలి నలుపా పట్టణమునందలి గృహముల రాపిడిచేతనే కలి గినదని నేను దలఁచెదను. ఆపట్టణపు మేడలయం దున్నవారికిఁ గ్రింది భాగములయందుఁ దిరుగు జలదములు మదము స్రవించు మత్తగజ ములను భ్రాంతిని బుట్టించుచున్నవి సుగంధములు వెలిజిమ్ము విశ్వాస ముచే మనోహరమగు కాంతా ముఖములందు మూఁగిన తుమ్మెదలు చంద్రభ్రాంతిచే వచ్చిన రాహువను సంశయము గల్గించు చుండును. పడుకటిండ్లలోని గోడలపైఁ జిత్రములగు బొమ్మలను జంచలదృష్టు లతోఁ జూచు ముగ్ధాంగన లితరు లెవ్వరో యుండి రనుకొని నాథులను గౌఁగిలించుటకు సిగ్గుపడుచుందురు. ప్రతి చంద్రోదయ కాలమందును జంద్రకాంతపు జాతిమేడలనుండి స్రవించు జలధారలను వర్షమనుకొని

నెమి శ్శకాంచతాండవ మొనరించుచుండును, జంద్రునియందుఁ గళంకమే లేకపోయినఁ దత్పుర సౌధములయందుఁ జరించు కాంతాజనంబుల గండ మండనములలో గుర్తుపట్టనే లేకపోదురు. దారి నడచి నడచి యాయాసపడి చెమ్మటచేఁ దడిసిన తనవేయి చేతులు గల చొక్కాను సహస్రకరుఁడగు సూర్యుఁడా గృహ తోరణములయం దాఱఁగట్టుకొనెనో యనునట్లు శరదభ్రశుభ్రంబులగు జెండాలు వ్రేలాడుచుండును. విశాలము లగు చావళ్ళను. బెక్కు పుష్పలతలును గల యుద్యాన వనములు చుట్టును బ్రకాశింప సూర్యమండలము నంటుచున్న శిఖరములతోఁ బర్వత ముల వలెనుండు స్ఫటిక శిలానిర్మితంబులగు జినాలయంబులందు వేన వేలు గలవు. ఏనుఁగులయందు మదమును, ధాతువులయందు సోపసర్గ తయు, శబ్దములయందు నిపాతన క్రియలును, గుచములందుఁ గరపీడ నంబును, బాములయందు ద్విజిహ్వాత్వంబును, దపసుల చిత్తమునందుఁ జింతయు, స్త్రీల నడుములయందు దారిద్ర్యంబును, వారి యోష్ఠంబుల యందధరత్వమును దప్ప నితర స్థలములయందుఁ గానరావు. అచటి గృహంబులు సూర్య సంతాపమునకు జడిసి నిగనిగని తమ గోడలయందే దాఁగి యున్నవో యనునట్లెటు జూచినను విశాలములుగాఁ గనఁబడు చుండును. జనసంకులంబులు గాని ప్రదేశములును, డబ్బులేని గృహస్థు లును, భోగమునకుఁగాని ధనమును నన్యాయమగు, భోగంబును నాపట్ట ణమునఁ గానరాదు. అచటి సుందరుల నేత్రములచే జయింపఁబడి నల్ల గల్వలన్నియుఁ దాపము బాపుకొనుట కుద్యాన వనములలోని దిగుడుబావు లలోఁ బడి తరంగములచే నట్టిటుఁ గదలుచు మునుఁగుచుఁ దేలుచు నుండును. మదములేనివారయ్యుఁ బ్రమదము గలవారును, బరలోకము నకు జడియనివారయ్యును, బరలోకమునకు జడియువారును, మహాగుణము గలవారయ్యు మహాగుణము లేనివారును నగు గృహస్థులందుఁ గలరు. అచ్చటి కాంతలకు మేడమీఁద గూళ్ళలోఁ గూయు పావురము మొదలగు గృహపక్షులు కలకలధ్వని వినినంతనే ప్రణయ కలహమునువిడిచి భర్త లను బ్రతిమాలుకొనుచుందురను దోషము తప్ప నితరదోషములు లేవు

ఇట్టిపురంబు రాజధానిఁగాఁ గనకప్రభుఁడను రాజు మంగళావతీ దేశమును బాలించుచుండును. బంగారముకంటె మిన్నయగు రంగుగల యాభూపతి కాకనకప్రభ నామము రూఢముగాని యౌగికముగాదు. జైత్ర యాత్రలయం దీనృపాలునికీర్తులు ముందు నడచుచు సర్వదేశము లాక్రమింప వెనుకవచ్చు ప్రతాపము కాలూఁదుటకు జోటే లేకపోవుచుండెను. ఒకరాజు భుజమునుండి మఱియొక రాజు భుజమును వాని భుజమునుండి యింకొకరాజు భుజమును జేరుచు నెచ్చటను నిలుకడలేక యెప్పుడుఁ దిమ్మరియై యాయాస పడుచున్న జయలక్ష్మి యీతని భుజమును బట్టుకొని మరలఁ గదలదయ్యెను. అచింత్య మాహాత్మ్య గుణుండును, జనాశ్రయుఁడును, విక్రమాక్రాంత విష్టపత్రయుండును, లక్ష్మీసనాథుఁడును నగు పురుషోత్తముఁడయ్యు నతఁ డెన్నఁడును వృషోచ్ఛేదమునకు సాహసింపలేదు. ఈభూపాలుని సహజమగు దానగుణముచేత జయింపఁబడిన నాటనుండియుఁ గల్పవృక్షములు జడములయ్యెను. కళలు గలవాఁడయ్యును బదిమందిని రంజింపఁజేసి వశపరచుకోఁగలవాఁ డయ్యును జంద్రుఁడు దిక్కుమాలిన ప్రదోష సంబంధముచే నారాజేంద్రునకు సాటి కాలేకపోయెను. జగత్తిలక మగు నీపుడమిఱేఁడు విశుద్ధ చరిత్రచేతఁ గులంబునకును, నిష్కలంకమగు కీర్తిచే దిక్కులకును, సద్గుణములచే శరీరమునకును, శాస్త్రములచే బుద్ధికిని వన్నె వెట్టెను. భూరిదానము గలిగియు మదములేక, యహీన సాంగత్యము గలిగియు ద్విజిహ్వాత్వము లేక, తనగుణములచేతనే సమస్త మండలాధిపతులును గైవశము చేసికొని గోవును గరిణిగాఁజేసిన యీనృపుని చిత్రచరిత్ర వర్ణింప నెవ్వరితరము ముసలివాఁడును, గఠిన చిత్తుండును నీతిశాలియునగు నంతఃపురము కావలి బంటు చపలచిత్తలగు నంతఃపుర స్త్రీలకుఁగూడఁ జాపల్యము మాన్పినగతి నితాంత వృద్ధము, కఠోర వృత్తియు, సునీతియు నగు తన తేజస్సుచే నీభూపుఁడు చపలచిత్తయగు సిరికిఁ గల చాంచల్యమును మాన్పివైచెను. ధరాశ్రయత్వము, భూతిమత్వము, శశాంక కాంతత్వము, ధృతనాగనాయకత్వము మొదలగు గుణము లన్నిటియందును నీశ్వర సమానుఁడగు నీ

నికి విషమదృష్టి మాత్రము లేదు. ఈతని గాంభీర్యముచే జయింపఁబడిన సముద్రుఁ డిప్పటికిని దరంగములను చేతులతో ఱొమ్ము బాఁదుకొనుచు మొత్తుపెట్టుచునే యున్నాఁడు. శత్రుసంహారము చేసినను గ్రూరుఁడుగాక, చనవుచేఁ బ్రజల నంతఃపుర స్త్రీలవలె లాలించుచు. గుణంబులచే దశదిక్కులను బరిమళింపఁజేసిన యీ కనక ప్రభ నరేంద్రునకుసౌందర్యమను నుదకముచేఁ గడగఁబడుచున్నదో యన సర్వదా నిర్మలమగు స్వభావముగల సువర్ణమాల యను కాంత పట్టమహిషి యయ్యెను. మొగమను చంద్రునకును, నధరమను నమృత కుంభమునకు, నవ్వనునురఁగునకును, నివాసమగు తదీయ శరీరలావణ్య సముద్రము లక్ష్మి కునికిపట్టన్నచో నబ్బురమేమి?

ఆదంపతులకుఁ బద్మనాభుఁడను కుమారుఁడుదయించెను. బాల్యమంద సమస్తవిద్యలనభ్యసించి చంద్రునిఁబోలి నానాఁట వృద్ధిఁజెందుచున్న యాపద్మనాభునిచర్యలు జగదాశ్చర్యకరములై ప్రకాశింపసాగెను. తలయందు నరపును, శరీరమునపళులును. జేతిలో దండమును లేక సమస్త విధములను వృద్ధుడనిపించుకొను నాబాలకలభమునకుఁ గనకప్రభుఁ డంకుశమయి సన్మార్గములయందు నడిపింపఁదొడఁగెను. సప్తవ్యసనములను బుట్టింపఁజాలు యౌవనంబును సుందరవిగ్రహంబును గలిగియు నంతశ్శత్రువులను జయించిన యీబాలభూపతి మనమింద్రియములవలలోఁ బడకుండుట చిత్రముగాదు. కనకప్రభుండును బెక్కుమంది సంతానముఁగలవాఁడయ్యుఁ బద్మనాభునిచేతనే విఖ్యాతికెక్కెను. ఎన్నిపక్షులున్ననేమి, రాజహంసము లేని తటాకమునకు శోభవచ్చునా!

ఇట్లుండ నొక్కనాఁ డాకనకప్రభుఁడు మేడమీఁదఁ గూర్చుండి నిజపట్టణసౌభాగ్యంబునకు సంతసించుచుఁ జూచుచుండ నావులమంద యొకటివీథ్యుతాగుటకై యొక చెఱువులోనికి దిగుటయు నందొక ముసలి యావుబురదలోదిగఁబడి లేవలేక చచ్చిపోవుటయుఁ గనుఁగొని మనంబున

నొకవిధమయిన నిర్వేదముజనింప నిట్లని వితర్కించెను. 'ప్రతిజంతువు జీవితమును క్షణభంగురమనుట కొవంతయు సందియము లేదని యెఱిఁగి యు మహాపండితులుఁగూడసంసారమను చీఁకటినూతిలోఁబడి మోహపడు చున్నారు. నిమిషకాలమయిన నిలువని విషయసుఖంబులచే జనులందఱు వంచింపఁబడుచుండియు వానిపైస్థిరభావనచేసి తగుల్కొనుచున్నారు. చీ! యీలోకుల తెలివితక్కువ! ముదిమిచే మరణము సమీపించినప్పుడును దాము యౌవనవంతుల మనియేతలంచుచు మందమతులక్కటా! తమకుఁ దరణోపాయంబు లాలోచింప కున్నారు! గతకాలముకంటె వచ్చుకాలము మంచి దనుకొనుచున్నారు. సుఖమేవచ్చునని యెవ్వఁడు చెప్పగలఁడు? తత్కాలసుఖము నపేక్షించి యెంతశ్రమయైనఁ బడుచున్నారు గాని పరిణామ కాలమునకు సుఖప్రదమగు మార్గమున నడువఁజాలకున్నారు. జ్వరము వచ్చిననాడైనఁ బథ్యముచేయనిపగిది ముదిమివచ్చునాఁడైన శివచింతాను సంధానము చేయక కామసుఖంబులకై యాసగొలుపు లోకుల "కర్మగతి బలవంతమనకతీరదు. ఆయువు మూడినచో నంతశ్శరీరముగూడ విడిచి పోవుచుండ ధనము,మిత్రులు, బంధువులు విడుచుటయం దబ్బురమేమున్న ది? కోరిక నమకూరినప్పుడు సుఖమెట్లువచ్చునో సమకూరనినాఁడు దుఃఖ ము నట్లెవచ్చును. కనుకయే పండితులైనవా రేకోరుకులుఁగోరక నిస్పృహు లై కాలముఁగడపెదరు. తనజీవితకాలమంతయు సుఖమేవచ్చు ననుకొను వాఁడొకఁడు, దుఃఖముగూడ వచ్చునేమోయని సందేహపడువాఁ డింకొ కఁడు, సుఖదుఃఖము లనుమాటయే యెఱుగనివాఁడు మఱియొకఁడు. ఇట్లీ మూఁడువిధములగు నజ్ఞానములచే జగము మునిఁగి యున్నది. శరీరవంతు లకు జినవాక్యమువదలినచోఁ బరిణామసుఖమే కలుగదు. రోగులకుఁ బథ్య ము రుచింపనిపగిదిఁ దెలివితక్కువవారి కా జినవాక్యములు రుచింపవు యథావిధిగ శాస్త్రములుచదువుకొని సజ్జనసాంగత్య మేమఱక సంసార మసారమని తెలిసికొనియు నావలెఁబ్రమాదముం జెందువాఁడుండునా? తుదకు దుఃఖముఁ దెచ్చిపెట్టునింద్రియసుఖములందు మందమతులుగాని బుద్ధిమంతులు ప్రవేశింపరు. తేనెపూసినకత్తి నాకువారెవ్వరు? ప్రేమ

మయంబగు చిపురుమీఁదఁ గాచిన దుఃఖమను ఫలంబు నెవ్వఁడు పాఱ వేయక తినునో వాఁడు శ్రేయస్సులకు దూరమైనవాఁడే' అని పెక్కు విధముల నాలోచించి మోక్షదూతిక చెవియొద్దకు వచ్చిస్వయముగా నుప దేశము చేసెనో యనునట్లు విరాగమునుజెంది మనసార మునిమార్గమందు బ్రవేశింపఁదలఁచెను. బుద్ధిమంతుల కేదియో యొక లాభమునుగలుగఁ జేయక కాలమువ్యర్థముగాదు. తరువాత మేడదిగి మఱునాఁడు కొదు కుతో వృత్తాంతమంతయుఁ జెప్పి బోరుననేడ్చు కుమారుని కన్నీరు చేతితోఁ దుడుచుచు శ్రీధరమునీంద్రునకు నమస్కరించి పుత్రులయందు రాజ్యభారముంచి తపమాచరింపఁ బోయిన మహారాజులుండు ప్రదేశము నకుఁ దానునుబోయెను. పద్మనాభుఁడును గొన్నినాళ్ళవఱకుఁ దండ్రివిర హము సహింపఁజాలక క్లేశపడెను. ఎంతయైశ్వర్యము కలిగినను బంధు వియోగము మాత్రము దుఃఖప్రదము కాకపోదు. పిమ్మట బుద్ధిమంతు లగు మంత్రుల యాలోచనలఁ దిరస్కరింపక తనయాలోచనలగూడఁ గలు పుచుఁ బితృ వియోగదుఃఖమును మఱచి ప్రజలపై నపారమగు కరుణ గలవాఁడై రాజ్య మేలుచుండెను. కుటిలుఁడైన యొక్క యష్టమినాఁటి చంద్రుఁడే సింహాసనాసీనుండగు పద్మనాభనృపాలుని వికటలలాట పట్టముచే శిక్షింపఁదగిన వాడయ్యెఁగాని తక్కినరాజు లందఱుఁ దలలు వంచి కౌటిల్యములేకయే వశమైరి. సోమప్రభ యను భార్యతో, బద్మనాభుఁడును సువర్ణనాభుఁడను పేరుగల కుమారునకు యౌవరాజ్యమిచ్చి సమస్తభోగము లనుభవించుచు నిష్కంటకముగ రత్నసంచయ పురంబుం బాలించు చుండెను.

ఇది ప్రథమ సర్గము సమాప్తము

## ద్వితీయ సర్గము

*

ఒకనాఁడు పద్మనాభ నృపాలుఁడు నిండోలగం బున్నపుడు తోట కాపరివచ్చి "దేవా! పిల్లవాయువులచేఁ బరిమళమును నాల్గుదిక్కులకు

వెదఁజల్లుచు వికసించిన పువ్వులతో నిండియున్న పూవుఁదీఁగలచే మనోహరంబగు మన పూలతోఁట కెచ్చటినుండియో యొక మునీంద్రుఁడు వచ్చినాఁడు. ఆయన మేనికాంతులవంటి కాంతులు సూర్యభగవానునకైనను లేవు. పేరు శ్రీధరుఁడఁట. భయంకరమైన తేజస్సును, జనవిచ్చు చూపులును విచారింప సూర్యచంద్రు లిద్దఱు నేకీభావమును బొంది వచ్చినట్లున్నాఁడు. అతనిం జూచిన సర్వ భూతములకును ధనుర్ధరుండగు రాజును జూచినపగిది భయంబును, దపస్సుచేయు మునీశ్వరులఁ జూచినవిధమున భక్తియును గలుగుచున్నది. అద్దములోఁ బ్రతిబింబము కాన్పించిన వడువున నయ్యనఘుని మాటలయందుఁ బ్రపంచ మంతయుఁ గనఁబడుచున్నది. ముక్తాభిరామంబులును సువర్ణబద్ధంబులును నగు నా మహామహుని కథలు పండితులకుఁ గర్ణాలంకారములు కాకపోవు. నిశ్చలములయ్యును జగమంతయుఁ దిరుగుచున్న యామౌని గుణములు లెక్కింప రానివయ్యును నందఱచే గణనీయము లగుచున్నవి. వేయేల ! అతని పాదధూళి యొకసారి శిరసా వహించినవా రామీదటఁ దలవెంట్రుకలకు సుగంధ ద్రవ్యమును రాచికొనక విరాగులగుదురు. సూర్యుని మట్టమధ్యాహ్నమంచలి యెండయును నతనికి వెన్నెలవలె నున్నది. ఆజడదారి మన తోఁటలోఁ గాలిడినంతలో మావిగున్నలకు దోహదము లేకయే మొగ్గలు పొడమినవి. ముని సాంగత్యంబున విరాగమును వహించినదో యన నశోకవృక్షము స్త్రీల కాలితాఁపు లక్కఱలేకయే పుష్పించినది. పొగడలను మగువల పుక్కిటి నీరు కోరకయే కోరకితమైనవి. తిలక మా ముని తిలకునిఁ జూచినవెంటనే వికసించినది. బంధుగులను గాంచినపు డెవ్వరికి వికాసము కలుగదు ! సంపెంగలా నిరాహారి ధర్మము నాశ్రయించినవో యనఁ దుమ్మెదలను నెపంబున నజ్ఞానమును దరికిఁ జేరనీయవయ్యెను. మోదుగులన్నియుఁ జిలుకముక్కులవంటి మొగ్గలచేఁ గన్నులకింపొనర్చుచున్నవి. నేరేటిపండ్లకై మంచిచిలుకలు చేరినవి. 'శుచిసమావేశముచేతఁగదా యేను బుష్పించుచుందును. ఈమునికంటె శుచియెవ'రని తలంచి కాఁభోలును; నవమల్లికాలత పూచెను. మహారాజా ! కడిమి

చెట్టులు సంతసముచేఁ బులకరించినవో యన మొదటినుండి చివరదాఁక నేకాకారముగ మొగ్గదొడిగినవి. పరస్పర విరోధము గలుఁగు పక్షులును మృగములును బాంధవ్యము గలవానివలె సంచరించుచున్నవి."

అని విన్నవింప నివ్వెఱఁగుపడి యా నరపతి యా వనపాలునకుఁ దనమేని నగలన్నియుఁ గానుకగా నిచ్చి వానితోడను మఱికొందఱు మిత్రులతోడను గలసి యుపవనంబునకు 'నేమహాత్ముని దర్శనమునకై నేను బోవలయునో యతఁడు మన యింటి కతిథియై వచ్చినాఁ' డని తన పుణ్యమును బ్రశంసించుకొనుచుఁ బోయి యారామమునందుఁ బద్మాసనము బంధించి కూర్చుండియున్న యాముని పరమేశ్వరుం గని పాదపీఠము నకు మ్రొక్కి మరలివచ్చి పట్టణమం దంతట సాటింపఁజేసి పౌరవృద్ధుల తోడను, మిత్రులతోడను. భార్యలతోడను, బంధువులతోడను, గుమారుల తోడను, సామంత రాజులతోడను మరలఁ బుష్పవనముం బ్రవేశించి దాని సౌందర్యమునకు సంతసించుచు నెడనెడఁ బూఁబొదరిండ్ల విశ్రమించుచు నడచి, యామునీంద్రున కనతిదూరమునఁ దనతోడివా రందఱిని నిలిపి, తన రాజువేషమును బరిత్యజించి, వినయవేషముతో డగ్గఱి శరత్కాల మునం దాకాశముపైఁ సున్న చంద్రునివలె నల్లరాతి పలకపైఁ దపముచేయుచున్న యా శ్రీధరమునికి మూఁడుసారులు వలగొని, ముమ్మాఱు జయశబ్దం బుచ్చరించి మూఁడుతడవలు నమస్కరించి యెదుటఁ గూరుచుండెను. ఆనరేంద్ర మునీంద్రుల సంగమము తొల్లి జినేంద్ర దేవేంద్రు లిరువురు స్వర్గమునం గలసిన చందంబున నుండెను.

జయకోలాహలము చల్లాఱినపిదప మునిచే దీవింపఁబడిన యాపద్మ నాభనృపాలుఁడు 'దేవా ! జ్ఞానశూన్యమగు నీప్రపంచమునందు మంచి నడత నడపి ప్రజలను బాగుచేయుటకై దేవరవా రుదయించిరి. ఈలో కంబున దేవరదివ్యదృష్టికి గోచరములుకానివి కుందేటికొమ్ము, గగన కుసుమముఁదప్ప వేఱుపదార్థములులేవు. కావున మీవలన నాసంశయము

లను నివారించుకొనఁ దలఁచితిని. నాకు మిడిమిడి జ్ఞానముకలదుగాని సంపూర్ణజ్ఞానములేదు. చార్వాకమతస్థులు జీవుఁడనుపదార్థము లేదని చెప్పుచున్నారు. జీవుఁడను పదార్థమునే యెఱుఁగనిచో జీవుఁడులేఁడని యెట్లు చెప్పఁగలరు! తానెఱింగినపదార్థమును గాని లేదని చెప్పుటకు వలను పడదుగదా! స్థూలమైన వస్తువు, సూక్ష్మమైనవస్తువని రెండుగలవు అందు సూక్ష్మవస్తువు నెఱుఁగనివాఁడు స్థూలమని యెట్లు చెప్పఁగలఁడు, స్థూలవస్తువు నెఱుఁగనివాఁడు సూక్ష్మము నెట్లు చెప్పఁగలఁడు. అట్టే జీవుండు జీవాభావము నను రెండుపదములును బరస్పరసంబంధము కలయవి. జీవుఁడేలేనిచో బంధము మోక్షము మొదలగునవి జీవధర్మము లెట్లగును? ధర్మము లుండి యెచ్చటనైన ధర్మిలేకుండునా? ఇది జీవాత్మ లేదను చార్వాకుల సిద్ధాంతముమీఁది పూర్వపక్షము. ఇది యటుండనిండు. జీవాత్మకలదని యొప్పుకొను మతములలోనే పెక్కుభేదములు కలవు. సాంఖ్యులు కూటస్థుఁడు నిత్యుఁ డందురు. మీమాంసకులు కర్త గాడందురు, తార్కికులు శుద్ధజడుఁడందురు, బౌద్ధులు చిత్తపరిణామమే జీవాత్మకాని వేఱుకాదందురు. పెక్కుసిద్ధాంతములచేతఁ బ్రవేశింపరాని యీమతారణ్యమందు దిగ్భ్రమకలవాఁ 'డేదిక్కునకును బోలేనిపగిది నేమతము నవలంబింపలేకున్నాము.' అని యడిగిన పద్మనాభ నృపాలునిఁ జూచి గంభీరమగు వాక్కులతో నా మునిపరమేశ్వరుండు "రాజా! నీవడిగిన దంతయు సత్యము, లోకమునం దొకరికంటె నొకరు బుద్ధిమంతులు కలరు. అయినను నీయడిగిన విషయములలో, నా తెలిసి నంత యితరమతములను దూషింపకుండ నుపదేశించెదను. జీవుఁడు లేఁ డను వాదము ప్రత్యక్షమునకు విరుద్ధము. లేదనుటకుఁ గారణము చెప్పఁబూనువాఁడు పరిహాసపాత్రుఁడు కాకమానఁడు. ఏలన:—ఉన్న వస్తువునకుఁ గదా లేదని చెప్పుట తటస్థించును. జీవుఁడే లేనిచో "జీవుఁడులేఁ" డనుమాట యెట్లుపుట్టును? కావునఁ బ్రతిజంతువునందును సుఖదుఃఖములచేత జీవాత్మయున్నట్లుగా నెవనియంతట వాఁడు తెలిసి కొనఁగలఁడు. పరులకుఁ దెలియదు. పరులకుఁ దెలియని వస్తువులే

దని చెప్పుటయే న్యాయమని శంకింపఁ గూడదు. దీపమువలనఁ బుట్టిన కాంతి ముందు దీపమును గనఁబఱచి పిదప నితరవస్తువులను గనఁబఱచు పగిది నాత్మవలనఁ బుట్టినజ్ఞానము ఆత్మము దెలిసికొని పిమ్మట నితర జీవాత్మలను దెలిసికోఁగలదు."

అని మునీశ్వరుఁడు చెప్పినమాటలు విని రాజు తనపూర్వజన్మ వృత్తాంతముం జెప్పుమనియడుగ, నతం "డోరాజా! తృతీయద్వీపమునఁ బూర్వమందర మను నొక పర్వతముగలదు. దాని యపరవిదేహమున శీతోదానది కుత్తరతటమున సుగంధి యను నొకదేశము కలదు. పోఁక చెట్లచేతను గొబ్బరిచెట్లచేతను నిండి మంచితావులు గల పెక్కు పూల చెట్లచే నాదేశము తనపేరును సార్థకపఱచు కొనుచుండును. అందీతి బాధలు లేవు. భూములన్నియు దున్నకయే పండును. మోక్షమును బొం దినవారివలె నచ్చటి ప్రజలు సర్వదా సంపూర్ణానందము నొందుచుండుదు. వ్యసనములచేఁ బీడింపఁబడువారును బరలోకమునకు జంకెనవారునులేరు. దగ్గఱదగ్గఱగానున్న గ్రామములచేతను వికసించిన పూవులుగల చెఱువుల చేతను, సస్యసంపన్నములగు పొలములచేతను, నిర్బాధకములగు పొలి మేరలచేతను బ్రకాశమానమగు నాసుగంధిదేశమునఁ బ్రజలు ధర్మము కొఱకు ద్రవ్యము నార్జించుచుందురు. సంతానముకొఱకుఁ గామసుఖము లనుభవింతురు. తెరువరులు దారినిండ దట్టములగు తోఁటలలో నడచి పోవుచు గృహప్రాంగణములందువలె సుఖింతురు. అచ్చటివారి సంపదలు మెఱుపువలెఁ జంచలములైనవికావు. చరిత్రములు వర్షాకాల మేఘముల వలె మలినములైనవికావు. హుంకారమొనర్చు నావులచేతను గిరకిర మను చెఱకుగానుఁగలచేతను, గేకలిడు నెమిళులచేతను, సంకులమగు నచ్చటి ప్రదేశములన్నియు సుందరములైనవి. నదులన్నియు స్నానముచేయుచున్న స్త్రీలకుచకుంకములతోఁ గలసి యెఱ్ఱబట్టలు కప్పుకొనినట్లుండును. అందు మిక్కిలి సంపదచేఁ జెలువారు 'శ్రీపుర' మను నొకపట్టణముగలదు. అది భూలోకమునందలి ప్రజలు చేసుకొన్న పుణ్యములచేత నవతరించిన

రెండవ యమరావతియే. అచట మేడమీఁది రత్నకాంతులచేతఁ గప్పఁబడి యాకాశమునఁగల గ్రహము లెప్పుడును గనుపించవు. అందలివారు చంద్రకాంతమణులనుండి స్రవించు నీటిచేతను సూర్యకాంతమణులనుండి మండు నిప్పులచేతను సూర్యచంద్రుల యుదయాస్తమయములను దెలిసి కొందురు. రత్నమయములగు మేడ లసమయమందుఁగూడ సంధ్యాకాల భ్రాంతినిఁ గలుగఁజేయుచుండును. సూర్యుఁడు పూర్వాహ్ణమందచటి చంద్రశాలాశిఖరములమీఁదఁ బూర్ణకుంభము వలెఁ గన్పట్టుచుండును. ప్రాకారము మీఁద నడచు నక్షత్రము లచ్చటఁ బెట్టినదీపములవలెఁ దేజ రిల్లుచుండును. మానోన్నతంబులును మహాభోగంబులును మత్తవారణ శాలలును బహుభూములునునగు నందలి మేడ లన్నియు మహారాజు లతోఁ బోల్పఁదగియుండును. తమ్మిపుప్పొడిచే నిండియున్న యచ్చోటి సరోవరజలంబులు బంగారుపూసిన భూమివలెఁ గన్నుల కింపుగొల్పుచుం డును. ఆసరస్సులయందుఁ బ్రతిఫలించిన తీరవృక్షములు పక్షులకుఁ బాతాళలోకము నందలి యుద్యానవన మను భ్రాంతినిఁ గలుగఁజేయు చుండును. తెల్లుపూవులవంటి ఱెక్కలతో నట్టిటుఁ దిరుగు హంసలచే నిండియున్న కొన్నిచెఱువులు గాలిచేఁ గదలు నురుఁగు కలవిగాఁ దోఁచు చుండును. ఒడ్డున దట్టముగానున్న చెట్లచేగాలి చొరకుండుటవలన నలలు లేక నిశ్చలమగు తెల్లనినీరుగల మఱికొన్ని చెఱువులు ముద్దరాండ్రకు స్ఫటికమయములగు భూములను బుద్ధిని బుట్టించు చుండును. స్నానము చేయుచున్న యువిదల కొప్పులనుఁడి జాఱిన మల్లెపూవులచే నిండిన మఱికొన్ని చెఱువు లమవసనాఁటి యాకసమువలెఁ దోఁచుచుండును. అచ్చోటిమనుజులకుఁ దీక్షత్వ ముపదేశములయందుఁగాని మాటలయందుఁ గానరాదు. కాఠిన్యము స్త్రీలకుచద్వంద్వమునందకాని వారి మానసముల యందు లేదు. భంగము కాంతల కచములయందుఁ గాని పురుషుల వ్రత ములయందు గనుపింపదు. విరసత్వముకుకావ్యములయందుఁగాని దంపతుల యందుఁ గనఁబడదు. నిరోధము పంజరములందు గాని మహాత్ముల మానసములందు లేదు. నైచ్యము నాభియందెకాని కుటుంబినుల యాచా

రములయందుఁ గానము. ప్రాకారము, అగడ్త, వప్రమునను మూఁటిచేఁ జుట్టువారియున్న యాశ్రీపురము మూఁడు పరివేషములు గట్టిన చంద్రుని వలె హృదయరంజకముగా నుండును. ప్రత్యక్షానుమానోపమానశబ్దము లను నాల్గు ప్రమాణములచేతను నచటి కోమటులును దార్కికులును సమస్థ పదార్థ సిద్ధియు నిశ్చయింపఁ జేయుచుందురు. ఇట్లు మంచి దిగుడు బావులు, పూఁదోఁటలు, గృహములు, సౌధములు, సరస్సులు మొదలయిన వానిచే రమ్యమై స్వర్గమునుగూఁడ దిరస్కరింపఁజాలు సంపదతో నున్న యా శ్రీపురమును నల్పమతియగు నావంటివాఁడు వర్ణింపలేఁడు.

ఇది ద్వితీయ సర్గము సమాప్తము.

---

## తృతీయ సర్గము

★

నిజవసు ప్రదానముచే బంధుపద్మములను వికసింపఁ జేయుచు న్యాయకిరణ ప్రసారమున నన్యాయాంధకారము నడంచుచు శత్రువనితా ముఖ చంద్రులను గాంతిహీనులనుగాఁ జేయు శ్రీషేణుండను నొక రాజ భాస్కరుఁ డా శ్రీపురము నేలుచుండెను. అతని ప్రతాపముచే జడిపింపఁ బడిన శత్రురాజవర్గ మంతయు గుడ్లగూబలవలె నేదిక్కునకును బోలేక గిరిగుహలయందు డాఁగెను. అనురాగ ప్రదంబులగు నీ శ్రీషేణుని కీర్తులు సమస్త దిగంతము లలంకరించుచుండఁ జంద్రుఁ డొనరించు పని లేకపోవుటంజేసి ప్రజలతని యుదయమును గోరుటయేలేదు. పోషించుట వలన స్వామియై, శిక్షించుటవలన గురుఁడై, వ్యసనములు పోనడంచుట వలన మిత్రుఁడై, సమస్తప్రజలను బరిపాలించుచున్న యితని కీర్తి శర త్కాల పూర్ణిమా చంద్ర చంద్రికామూర్తియై దిగంతములు నిండెను. సహజమగు ప్రజ్ఞాతిశయము కలిగి ప్రజ్ఞచే సప్తవ్యసనముల నిరాక రించిన యీతని యందుఁగాక సత్పురుషాశ్రయమును గోరు విద్యలిం

కెవ్వనియందు నివాసము చేయును ? పర్వతమువంటి యౌన్నత్యమును, నీశ్వరునివంటి యైశ్వర్యంబును, చందురునివంటి సౌభాగ్యంబును, మునీంద్రులవంటి మనోనిగ్రహంబును, సింగమువంటి శౌర్యమును, గురునివంటి బుద్ధియు, సముద్రమువంటి గాంభీర్యమునుగల యాతనికి నేనుఁగులు, వృషభములు, గుఱ్ఱములు, వాహనములు, కాల్బలమును రాజ్యశోభానిమిత్తమర్పించి పుడమియే యేకచ్ఛత్రాధిపత్య మాతని కొసఁగెను. 'సమస్త గుణంబులు గల యీధరాపాలునకు నాయందు ద్వేష మెక్కువయయ్యె, శమదమాదులయం దనుగ్రహ మెక్కుడయ్యె, నేనుమాత్రమితనినేల యాశ్రయింపవలయు' నను కోపముచేఁ గాఁబోలును మదమాతని వదలివైచెను. ఈతఁడు వక్షస్థలంబు శ్రీకిని, భుజయుగము వీరలక్ష్మికిని, శరీరము కాంతికిని, హృదయము శాంతికెని, మొగము సరస్వతికి నిచ్చివేసెను. సత్పురుషు లెవ్వ రేమి యడిగినను లేదనలేరుగదా ! అజడుండయ్యు నదీనుఁడై, వసుమతీతిలకత్వము చెందియు నశోకభావమును గాంచి, కలాధరుఁ డయ్యు దోషాకరుఁడు గాక, ధర్మమునకై ధనమార్జించుచుఁ, గామము మోక్షప్రతిబంధకము గాకుండఁ దగిన పురుషోత్తము నాశ్రయింప వలయునని కుతూహలముతో నాశ్రయించిన శౌర్యధైర్యాది గుణములతో విధి సృజించిన రాజర్షులలో మొదటివాఁడై ప్రజల నేలుచుండెను. సూర్యుఁడెన్నఁడును జల్లనివాఁడు కాఁడు, కాని యీ రాజభాస్కరుఁడు చల్లదనముఁ జూపఁగలఁడు, చందురుఁడెన్నండును వేఁడిఁ జూపఁజాలఁడు కాని యీ రాజచందురుఁడు వేఁడినిఁ జూపఁ గలఁడు. శ్రీకాంతం బోలు శ్రీకాంతయను దేవితో నీనృపుఁడు సకల లోకాభిరాముఁడై కళను వదలని చందురునివలె సర్వదా యామెను వదలకయుండెను. లోకమునందుఁగల సమస్త సద్గుణములు నా శ్రీకాంతశరీరము నందలి లావణ్యోదకమునందు స్నానముచేసి తమ యాత్మలను బవిత్రములుగాఁ జేసికొనఁదలఁచినవో యననామె నాశ్రయించినవి. శీలము, ఓరుపు, వినయము, రూపము మొదలగు గుణములను బరీక్షించి సమస్త రాజకన్యకలయందందకత్తెయని నిర్ణయించి తానొనరించు సుకృతకర్మము

లకు సహాయభూతురాలని భావించి యీశ్రీషేణ నరేంద్రునిచే స్వయ
ముగా వరింపఁ బడిన యీ శ్రీకాంత కీర్తిని రూపమును గ్రహించుట
కొఱకు దేవతాస్త్రీలుగూడ భూలోకమునకు వచ్చి తపము చేయఁదలచు
చుందురు. దోషానుబంధములేక మత్తమువదలి బంధుపద్మములను విక
సింపఁజేయుచు సూర్యుని ప్రాతఃకాల కాంతివలె నిష్కలంకయగుభార్యతో
నా నరపాలుఁడు సుఖపరవశుఁడై కాలము గడపుచుండెను.

ఒకనాఁటి యుదయమునఁ గృత్యములు దీర్చుకొని యంతఃపురము
నకుఁ బోయి కపోలతలమునఁ జేయిచేర్చుకొని విచారించుచున్న భార్యను
జూచి తన్మనో గతదుఃఖమును బంచుకొనఁదలఁచిన వాఁడుబోలె వ్యాకుల
మనస్సుతో "దేవీ ! దుర్వారులగు సకల శత్రువుల రూపుమాపినవాఁడను,
దుస్సహమగు పరితాపమును భూమియందు నిండఁజేసిన నేను నీకు జీవి
తేశుఁడనై జీవించియుండఁ బరులవలన నీకుఁ బరాభవము కల్గియుం
డదు. నిమేషకాలమయినను సంతాపమూలమగు నీవిరహమును సహింప
లేనివాఁడను నాయందు నీకుఁ గోపమువచ్చియుండదు. నిశ్చయము.
నీపాదపద్మములే శరణముగాఁ జిత్తవృత్తి యంతయు నీయంద నిలిపి,
మనస్సు నీప్రేమకుధారవోసి యేకశరీరముగాఁ బరివర్తించు చెలికత్తె
యందైన నీయపరాధ ముండునని తలంపను. అభిప్రాయము ననుస
రించి నడచు బాంధవులు గాని, కాల్బలముగాని, దాస్యముచేయు నంతఃపుర
కాంతలు గాని, నీకనుబొమముడి చూచిన భయపడువారు నీ కేమి యప
కార మాచరింతురు ? అయిననీనానుడివిన విషయములలో నీసంతాపము
నకుఁ గారణమేదియో చెప్పుము" అని యడిగిన రాజునకు సిగ్గుచే నుత్తర
మీయఁజాలక చిన్ననాఁటి చెలికత్తె మొగమువంకకుఁ జూచెను. అదియు
సిగ్గుచేఁ దన యొడయురాలు భర్తకుత్తర మీయలే కుండుట యెఱిఁగి
"దేవా ! మాచెలి కెవ్వరివలనను బరాభవము గలుగలేదు, ఈ సంతాప
మునకుఁ గారణము దైవముతప్ప వేఱొకరుకాదు. ఇది తీర్చుటయు వాని
నికిఁ దప్ప నొరులకు సాధ్యముకాదు. అయినను దేవరతో నది యెంతయు

విన్నవించెదను. జరుగఁబోవుదానికై దైవమే ప్రమాణము. ఈమెనేఁడు నీ ప్రభావముచేఁ బరిపాలింపఁబడుచున్న యీ పట్టణశోభను జూడఁ దలచినాతోఁగూడ మేడమీఁదికెక్కి వీధిలో బంతులాట యాడుచుండినధన వంతులపిల్లలను గొంచదతిని గాంచెను. చంద్రబింబములవంటి మోములు గల వారినిఁదనివిదీఱకచూచి యీగతి వాఁడుదేఱినముఖముతో 'నీబాలకుల చేత నేకాంతలజన్మము వ్యర్థముకాలేదో వారే ధన్యలు. వారికి నేనునమ స్కరించెదను. పండుపండని తీవలవలె నిర్భాగ్యులమయిన మాజన్మలేల? ఏపురంధ్రీజనము ప్రసిద్ధమయిన స్త్రీశబ్దము సార్థకముగా సర్వలోకముల చేతఁగొనియాడఁబడఁ దగినజన్మము కలదిశైయియుండునో యదివంద్యము గాక వంధ్యలతలవంటివారి జన్మములుకాల్పనా! కన్నులులేని మనుష్యుని వలెఁ,జంద్రుఁడులేనిరాత్రివలె, సూర్యుఁడులేని యాకాశమువలె,రాజహం సలేనితటాకమువలె, సంతతిలేని కాంత పరిహాసాస్పదురాలనుటకు సంది యములేదు. కులకాంతలకు వంశవృద్ధికారణమగు కొడుకుతప్ప నితరాలం కారములే లేవు. నిజకులభూషణం బగు కుమారుఁడు లేని కాంతబ్రతుకు బ్రతుకుకాదు. పుణ్యహీనురాలనగు నన్ను సంతోషపఱచుటకు జ్ఞాతులుగాని స్నేహితులుగాని, పతిప్రసాదముగాని సమర్థముకా' దనివిచారించి దుఃఖ కారణము నాకుఁదెలిపి తల్పమునఁబరుండెను. అనేకవిధముల నమునయిం చినను గొంచెమయినను నేదదేఱినదికాదు. తుట్టతుదకు మాచేఁబ్రబోధితు రాలై యీగతి విచారించుచున్నది. "అనిచెలివలనఁ దనచెలువశోకకార ణముం దెలిసికొని రాజపుంగవుం "డోపద్మాక్షీ! శరీరము, నింద్రియములు హృదయమును గృశింపఁజేయు దుఃఖమునీకుఁదగదు. నీకోరినకోరికిదైవ సాధ్యము. నీవువిచారించిన నాకుదుఃఖమువచ్చును. నేనువిచారించినఁబ్ర జలందఱేడ్తురు. కావున సమస్తజనులకుఁ బరితాపహేతువగు శోకము మానుము. నాయెడను బ్రజయెడను దయఁజూపుము. జన్మాంతరమునఁ జేసిన శుభాశుభకర్మములు పండకమానవు. మనమట్టిపుణ్యమే చేసియుండి నచో మనకోరికఫలించుటకు సందేహములేదు. అందులకై * విచారించుట యనవసరము: దైవసాధ్యమగు కార్యమునెడల జనులొఁగాములాలోచింపఁ

దగదు. కేవలమువిధి ప్రతికూలుఁడుకాఁడేని నీకోర్కి కొనసాగుటకుఁ దగినయుపాయ మాలోచించెదను. మహాత్ములగు జైనమునులనేకులుకలరు వారిసేవచేసిన సంతతిప్రతిబంధకమగు కారణము తేటపడగలదు"అని మధురములగు మాటలచేఁబ్రియురాలి దుఃఖమునుబాపి పదంపడియొకనాఁడు మిత్రబృందముతో వసంతలక్ష్మిచేఁ గలకలలాడుచున్న క్రీడావనముం జూడ నెంచి తాండవముచేయుచున్న నెమిళ్ళను, గర్ణప్రియముగఁబల్కుచున్నకోయిలలును, రుచిగలిగినపండ్లును, బరిమళముగలపూవులును, జల్లనిమందవాయువులునుగలిగి సర్వేంద్రియములను దృప్తిపఱచు నుద్యానవనమునకుఁబోయి విహరించుచుండఁ దపోనిష్ఠాగరిష్ఠుండును బ్రపంచమంతయుఁగరతలామలకముగ నెఱింగినవాఁడు నగు ననంతమునీంద్రుఁడాకాశమునుండి వచ్చినసూర్యునివలెఁ దేజరిల్లుచు రాజుదృష్టిపథ మలంకరించెను. రాజునొడలు పులకరింప మన మువ్పొంగఁ దమాలవృక్షమునీడనుగూర్చుండిన యామునికి దోసిలియొగ్గిసంసారసముద్రమును దాఁటించు నతని చరణములకు భక్తిపరవశుఁడై నమస్కరించెను. అతఁడును సమాధిచాలించినిర్మలవాక్యములతో నాశీర్వచనములను జదివెను. రాజేంద్రుఁడును ధర్మాభిషేకముచేయఁబడిన పగిదిఁ దెల్లకల్వలఁబోలు ముని చిఱునవ్వుచే నభిషేకింపఁబడి కరపద్మములు ముకుళించి తనచిఱునవ్వుచే మంచిగంధము పూసినపగిది మునిచంద్రు చరణపీఠిక నలంకరించుచు 'దేవా! ఎంతదూరముపోయినను జూడవలయునని కోరినను గాన్పించని మీచరణారవిందము లునాకు సులభముగఁ గన్పడుటకు మదీయపూర్వజన్మపుణ్యమే కారణము గాని వేఱుకాదు. లేకున్న నీకీర్తి నిర్హేతుకజాయమానకటాక్షము నాయందేలకలుగును. తమబోఁటిమహాత్ముల దర్శనము శ్రేయస్సులను వృద్ధిపఱచును. వివేకము పెంచును. అఘముఁద్రుంచును. ఐశ్వర్యమును మంచును సమస్తశుభములకుఁ గారణమగు నిదితక్కువపుణ్యముచే లభ్యమగునది కాదు. భూతభవిష్యద్వర్తమానములయందు మీకుఁదెలియనివిషయములేదు. కావున నేనొక మనవిచేసుకొనియెద ననుగ్రహింపుము. సంసార మసారమని యెఱింగియు నామనం బేలకోవిరక్తిఁ జెందకున్నది?' అనురాజుమా

టలు విని యతని హృదయములోని విచారకారణముఁ దెలిసికొని మునీశ్వరుండిట్లనియె, 'రాజేంద్రా! నీమనమునఁ బుత్రివాంఛ యున్నంతవఱకు నీకువిరక్తి కలుగదు. కొలఁదిదినములలో నీకావాంఛతీఱఁగలదు. ఐనను విరాగప్రతిబంధకమగు మఱియొక కారణముగలదు. దానివివరించెద నాకర్ణింపుము. ఈనీపెద్దభార్య పూర్వజన్మమున నీపట్టణములోఁ గాపురమున్న దేవాంగదుఁడను కోమటికూఁతురు. అప్పుడు సునందయనుపేరుగలది. తల్లిపేరు శ్రీదేవి. సమస్తసద్గుణసంపన్నురాలు, యోగ్యురాలు, బంధుపోషకురాలు. ధనవంతురాలు నగు నాసునంద యొకనాఁడు నవయౌవనమున గర్భవతియై శరీరము కృశించియున్న యొక్కకాంతంజూచి యామెపడు పాట్లు కని "దైవమా! నాకెన్నఁడు నిట్టితఱుణమున గర్భమురాకుండఁజేయుమని వేఁడుకొనియెను, పిదపఁ గాలధర్మముఁజెంది భాగ్యవశమున దుర్యోధనునకుగూతురై నీకుభార్యయయ్యెను. కావునఁ బూర్వజన్మభవమగు కోరికవలన నీజన్మమునందును నీభార్యకు నవయౌవనమున గర్భమురాకపోయెను. కొన్నిదినములకాదోషముపశమించును. నిస్సంశయముగ నీకుఁ గుమారుఁడుగలుగును. వాఁడు చంద్రునివలె సర్వమనోరంజకుఁడగును. పెద్దవాఁడైనపిదప నతనియందు రాజ్యభారముంచి నీవు జినేంద్రదీక్ష నవలంబించితివేని సమస్తకర్మబంధములు వాసి సిద్ధాలయమున కేఁగగల'వని సంక్షేపముగాఁజెప్పిన మునీంద్రునిమాటలకు రాజుసంతసించి నిజరాజధానికిం బోయెను. మునియుఁ దపయిచ్ఛం బోయెను.

పిదప రాజును మనుష్యుల కిష్టసిద్ధి పూర్వజన్మకృతపుణ్యముచేఁ గలుగునని ధర్మము చేయనారంభించెను. దరిద్రులకు దానమిచ్చుట జైనమునీంద్రుల నర్చించుట మొదలగు కార్యములచేఁ గాలము జరపుచుండ దేవతలు దానవులు నాగకులము మున్నగువారుకూడ నాచరింపఁదగిన నాందీశ్వరమను గొప్పపండుగవచ్చెను. అపు డుపవాసపూర్వకముగ జగద్విజయి యగు జినేంద్రునిఁ బూజించుచు సమీహితకార్యసిద్ధికై భార్యతోఁ గూడ సేవించెను. తరువాతఁ గొన్నిదినముల కాహ్లాదవరచు చంద్రకళవలెఁ

గోర్కిసమకూర్చు కులదేవతవలెఁ దనరారు నాశ్రీకాంత శుక్తిక ముక్తాఫలమును వహించినవడువున గర్భముధరించెను. దానంజేసి శరీరము కృశించెను. మొగము తెల్లఁబడెను. చెక్కులు వెల్లఁబాలెను. గర్భస్థితుఁడగు బాలుని భారముచేతఁ బోలె మెలమెల్లగనడువసాగెను. సురతాసక్తి తగ్గెను. ముక్కులమీఁద నలుపును దక్కినభాగమంతయుఁ దెలుపును గలిగి స్తనద్వయము తుమ్మెదలువ్రాలిన మంచిగందపుటుండలవలె నుండెను మఱియుఁ బరిమళమునకై వ్రాలినతుమ్మెదలు గల సరోజయుగ్మము ననుసరించెను. తెల్లని కుచద్వయముచేత మనకాంతి జయింపఁబడియెనుగదా యను కోపమునహారము లా స్తనములయందు రాపిడి పుండ్లొనరించెను. గుణవంతులకైనను నసూయవోదుగదా! ఆవులింతలు చెలికత్తెలవలె నెన్నడును వదలకుండెను. భర్తచే విడువఁబడిన యలసత్వము శరణుచెంద, నీమె కాపాడుచున్నదో యనునట్లలసురాలై యుండెను. ఉదరముతోఁగూడసిగ్గును వృద్ధిచెందెను. వళిత్రియముతోఁ గూడఁబెద్దలయెడ నభ్యుత్థానము తగ్గెను. ఇంతదనుక నల్లకలువలను జయించితి, మీఁకఁ దెల్లతామరలను జయింపవలయునను నసూయతోఁ గాఁబోలును గన్నులు తెల్లఁబడియెను. గర్భస్థితుఁడగుబాలకునకుఁ బూర్వజన్మసంస్కారముచేఁ గలుగఁబోవు జినపూజనమాతల్లి దౌహృదములే తెల్పుచుండెను. ఇట్లు గర్భము క్రమక్రమాభివృద్ధిఁజెందఁ, బ్రసూతిసమయమాసన్నమగుడు, శుభగ్రహము లన్నియు నుచ్చస్థానములయందుండ శుభతిథియందు శుభనక్షత్రమునఁ దీర్ఘకరుఁడు కాఁబోవు నొకకుమారరత్నముంగనియెను. ఆకాశము నిర్మలమయ్యెను. చెఱువులన్నియుఁ దేటెను. దిశాంగనలందఱు మాలిన్యమును దొలఁగిరి. దేవతలుదుందుభులు మ్రోగించిరి. రాజగృహముమంగళతూర్యనాదములతో నిండెను. పట్టణవాసులందఱుఁ దమతమయిండ్లఁ బండుగలు చేసికొనిరి. పిలువకుండఁ బ్రతివీధిని వచ్చి గణికాజనము నృత్యముచేయుచుండిరి. "నీకద్వితీయుఁడగు ప్రభువుదొరకెను, నీపుణ్యము మంచిది, సంతసింపు" మని భూమిదేవి నందఱుఁబొగడసాగిరి. పుత్రోత్సవముఁదెలిపిన వారికా

కొందఱు గంతులువేయుట. కొందఱు పురాణములుచదువుట, కొందఱు శాస్త్రార్థములుచేయుట, కొందఱొడలు తెలియకుండఁదిరుగుట చూడఁబట్టణమునకుఁబిచ్చియెత్తినదో యనునట్లుండెను. వేయేల. సంతసింపనిహృదయముగలశత్రువైనను నాపట్టణమునలేఁడు. పిదప సర్వజ్ఞుఁడు కాఁబోవు నాపిల్లవానికి వంశవృద్ధులతోఁగూడ శ్రీషేణనరేంద్రుఁడు శ్రీవర్మయను నామకరణ మొనరించెను. ఆకుమారుఁడు కలిగినపిమ్మట స్వాధీనులుగాని శత్రురాజుల నందఱిని స్వాధీనపఱచుకొని వశముగాని భూమినంతను వశపఱచుకొని యనేకనిధులనుండి విశేషద్రవ్యమును బొందుచు శ్రీషేణనరేంద్రుఁడు జగ మకంటకముగాఁ బరిపాలించుచుండెను.

గద్య

ఇది తృతీయ సర్గము సమాప్తము.

## చతుర్థ సర్గము

పద్మాకరమువలె లక్ష్మీలతాలింగితమగుశరీరముతోఁ జూపఱకంటికి బండువొనరించు నారాజకుమారుఁడు దినదినమువృద్ధిజెందుచుఁ జంద్రునివలెఁ గలలకుఁ దానకంబై సమస్తవిద్యలయందును జదువుచెప్పినగురువుల కంటెఁ గొలఁదిదినములలోనె ప్రవీణుఁడై వయస్సునఁ జిన్నవాఁడయ్యును విద్యాబుద్ధులచేఁ బెద్దవాఁడని పరిగణింపఁబడుచుండెను. సర్వదా ధనుర్ధరులును, ఖడ్గపాణులును, సాధులును, మావటీండ్రును బరివేష్టింప వారిని బోషించుచుండెను. రాత్రి చంద్రునియందును బగలు పద్మములయందును జపలచిత్తముతో వసించుచున్న లక్ష్మియు నారాజకుమారుని శరీరమును రాత్రిందివములు విడువలేకపోయెను. అతని దాతృత్వము వినిలోకములోని దాతలందఱు దాతృత్వాభిమానమును వదలిరి. పరాభవము వచ్చినపిదప నెవ్వరికి నభిమానముండదుగదా! అతనితోఁ దిరుగు పిరికిబంటుకూడ మహాశౌర్యశాలియయ్యెను. త్యాగము, శౌర్యము, సత్యము, నీతి మొదలగు

పెద్దలకిష్టములగు గుణము లోకదానికంటెనొకటి హెచ్చుగ నారాచనిసువు నాశ్రయించినవి. ధనధాన్యము లొసఁగి పోషించుచు. మంచియుపదేశములు చేయుచుఁ, బ్రజలను బ్రోచుచున్న యారాజదారకునియందుఁ బ్రజలకం దఱకు దండ్రులయెడఁగూడలేనిగౌరవము కలిగియుండెను. సమస్తసద్గుణ రాశిఁ యగు నానృపనందనుఁడు తనవారికే కాక శత్రువులకుఁగూడ మంచి వాఁ డనిపించుకొనియెను.అదృష్టవంతుల కసాధ్యములగుకార్యములుండవు, ముల్లోకములను దిరస్కరింపఁజాలు నాతని సౌందర్యమును జూచి చేతురా ననుఁడు తన సృష్టికిఁ దానే మిగుల నచ్చెరువడుచుండెను. సంపదలకునికి పట్టును, జయలక్ష్మికి నివాసంబును, ప్రజలకుం గన్నులపండువయు నగు నా నృపకుమారునియంత నిగర్వచూడామణి పృథ్వియందు లేఁడు. మహాను భావుల కైశ్వర్య మెచ్చినకొలఁది మత్తత తగ్గుచుండును. అతఁడు తండ్రి యను మతిని సార్థక నామధేయముకల ప్రభావతి యను నొక కన్యను వివాహము చేసికొనిన పిదప వృద్ధభూపాలుఁడు రాజ్యభారమంతయు నతని యందు నిలిపి నిశ్చింతచిత్తుఁడై యుండఁదగినవాఁడయ్యె నిచ్ఛవచ్చినట్లు సమస్తభోగము లనుభవించుచు మోహమున కధీనమగు మనస్సుతోఁ గాలమంతయుఁ గడుచుచున్నను, గాలము పోవుచున్నదను జ్ఞానము లేకుండెను. ఎంతటివారిప్రజ్ఞనైనను గాంతామోహ మొక్క క్షణములోఁ బాడుచేయఁగలదు.

ఒక్కనాఁడు మేడమీఁదఁ గాంతలతోఁ గొలువుండి యాకసము నుండి పడుచున్న యుల్కాపాతమును గాంచి విషయములయందు విర క్తిఁగలవాఁడై యిట్లు విచారించెను. "అందఱకు నీ ప్రకారముగనే జీవి తము, యౌవనము, శరీరము నశాశ్వతములయినవి, అయినను నావంటి మందబుద్ధిఁగల జనుఁడు పుత్రికళత్రాది మహాపాశములచేఁ గట్టువడి తెలి సికొనలేకున్నాఁడు. కొండకాల్వలలోని తరంగములవలెఁ జంచలములగు నింద్రియసుఖములకు లోఁబడి, గుప్తిద్దిగవ్వకైన మాఱక, యుత్తరలోక మునకు నిడుమలఁ దెచ్చిపెట్టు మహాదోషము లొనర్చుచు, ననంత దుఃఖ

ములను మోహవశమున గణింపకున్నాఁడు. ఉత్తరక్షణమందు నమ్మకము లేని యాయుర్దాయము స్థిరమని నమ్మకుండినచో మనుష్యుఁడు కర్మపాశములచే బద్ధుఁడై యనేక జన్మములందు గర్భనరక మనుభవింపకయే పోవును. స్వభావచంచలమైనదియు, దురంతమైనదియు వదలిపోయినపుడు చాల దుఃఖమును గలుగఁజేయునదియునగు సంపదకొఱకై యీమూఢజను లెంతశ్రమ చేయుచున్నారో ! ఆహా ! మోహమహిమ ! మాటిమాటికిఁ గలుగుచు నశించుచున్న యీబంధుసంబంధములు స్వప్నసమాగమతుల్యము లని యెఱుఁగక విద్వాంసులు గూడ వానియందు విశ్వాసముంచుచున్నారు. ఏయపాయములు లేని నిర్వృతిసుఖ మాసింపక యపాయములు మెండుగాఁ గలిగిన యైహికసుఖములను గోరువారు నిజముగా సుగంధియగు మంచినీరు త్రాగక బురదతోఁ గూడిన వరదనీరు ద్రాగువారితో సమానులు. కటకటా ! ఈ జీవలోకము 'నాది' 'నేను' అను దురాగ్రహముతోఁ గూడి స్వల్పసుఖముకొఱకు కొండంత దుఃఖమును మోయుచున్నారు. కాకతాళీయముగ మనుష్యజన్మ లభించినను సంసారపాశములచేఁ గట్టఁబడి నరులు ప్రమాదముల పాలగుచున్నారు." ఇట్లు సంసార మసారమని విచారించుచు నా ధరాపాలుఁడు విషయానురాగమును వదలి మంచిబుద్ధి కలిగినందులకు ఫల మగు వైరాగ్య మవలంబించెను.

మఱునాఁడు కొడుకును బిలిచి, నమస్కరించి యెదుట నిలువఁబడిన యతనిపైఁ బ్రేమరసము లేని చూడ్కి నిగుడించి "కుమారా ! ఈశరీరమను గుడిసెను ముసలితనమను సుడిగాలి పడవేయకమునుపె, వృద్ధి పొందుచున్న యజ్ఞానమును బోఁగొట్టఁజాలిన నేత్రములయందలి శక్తి తగ్గకమునుపె, సమస్త తీర్థయాత్రలు చేయఁజాలిన పాదములయందలి నడక యడఁగకమునుపె, సకల శ్రుతిస్మృతిధర్మములు వినఁజాలిన చెవులకుఁ జెవుడు రాకమునుపె, ముదిమిచే రాఁబోవు నింద్రియ దౌర్బల్యమున మతిభ్రంశము కాకమునుపె, యుత్తమ గ్రంథములన్నియుఁ జదువు కొనఁజాలు నాలుక తొట్రుపడకమునుపె నన్నీ సంసార సముద్రమునుండి

దాఁటించి దుఃఖాగ్నిచేఁ బరితప్తమైన నామదికి శాంతి కలుగఁజేయుము. ఏను జినేంద్రదీక్ష నవలంబించెదను నీవీరాజ్యభారమును వహింపుము. నాయభిమతం బీడేర్పక నాకు శత్రుఁడవు కాకుము, సంసారపరంపరలకుఁ గారణములగు విషయభోగములయం దిచ్ఛ నేనిదివఱకే వదలియు నీవు పెద్దవాఁడవగుదాఁక రాజ్యభారము వహింపకుండుటకు వీలులేకపోయినది. నేఁటికిఁ బెద్దవాఁడవైతివి. కావున వ్యసనములకు లోఁబడక, శత్రువుల వృద్ధిపొందనీక, దుర్జనులనుమాటఁ జెవినిఁ జొరనీక, యీ ధరామండల మును బరిపాలింపుము. సూర్యోదయమునకుఁ జక్రవాకములు సంతసించు పగిది నీ యభ్యుదయమునకుఁ బ్రజలు సంతోషింపవలయును గాని వ్యసన పడఁగూడదు. చారులవలన సంగతులన్నియు సత్యముగాఁ దెలిసికొనుచు సంపదల నభిలషించి నీపరిపాలనకు లోఁబడినవారిని బాధపెట్టకుము. సంపదలకుఁ బ్రథమకారణము ప్రజానురాగమే యని నీతివేత్తలు చెప్పు చున్నారు. రాజులకుఁ బ్రజలు లోఁబడియుండుటయే సుఖము. లోఁబడ కుండుటయే దుఃఖము. వారు వశ్యులై యుండుటకుఁ గృతజ్ఞత్వమే కార ణము. కావునఁ జేసినమేలెన్నఁడును మఱవకుము. ఎన్ని సుగుణములు గలవాఁడయ్యును గృతఘ్ను డందఱికి శత్రువగును గృతఘ్నతకు మించిన దుర్గుణములేదు.అర్థకామములతో ధర్మమునకు విరోధము లేకుండం ద్రివర్గ మునుసమముగా నడిపించిన రా జుభయలోకములను సాధించుట కేమియు సందేహములేదు. సమస్తకార్యములు పెద్దలకుఁ దెలుపకుండఁ జేయకుము. అట్లుచేసినచోఁ బ్రమాదములు రాకమానవు.గురువులశిక్ష దాఁటనిరాజు దేవేం ద్రుని వంటియైశ్వర్య మనుభవించును.జనులబాధించు నుద్యోగస్థులను వదలి వృద్ధికోరువారిని సంపాదింపుము.నీకీర్తిదిగంతములను వ్యాపింపవలయును. నీసద్గుణములను సర్వదా వందిమాగధులు నుతింపవలయును. కార్యము లన్నియు ఫలముచేతనే వెల్లడి కావలయును గాని ప్రారంభమందుఁ దెలియఁగూడదు. పరుల యాలోచనలను బ్రారంభముననే తెలిసికొన వలయును. ఇట్లు ప్రవర్తించురాజు విరోధుల కెన్నఁడును జిక్కఁడు. సూర్యుని వేఁడిమివలె నీప్రతాపమొకప్పుడు ప్రజలకు బాధకరమైనను

మొత్తముమీఁద నుపకారకమై యుండవలయును.'' అని తనతండ్రి యుపదేశముతోఁగూడ వైరాగ్యమును సూచింప శ్రీవర్మనృపాలుఁడును నతని బోధకెంతయు సంతసిల్లి ప్రతిబంధముచే రాజ్యమేలుట కంగీకరించెను. పిదప వృద్ధరాజును జ్ఞాతులందఱికడ సెలవు పుచ్చుకొని కుమారునకు రాజ్యమప్పగించి శ్రీప్రభుఁ డను ముని నాశ్రయించి నిర్వృతికాంతను పెండ్లియాడెను.

శ్రీవర్మయుఁ బితృవియోగమునకుఁ గొన్నినాళ్ళు శోకించుచుమంత్రులచేతను, మిత్రులచేతను నూఱడింపఁబడి కామినియగు భూమియందాసచే నాశోకమును మఱచి తన రాజధానియందుఁ గొంత మూలబలమును, దిగంతములయం దాటవికసైన్యమును, దేశమధ్యమున సామంతబలము నునిచి బయలుదేరెను. అతని గుఱ్ఱముల కాలి త్రొక్కుడులచే నెగసిన గాడిదపెంట్రుకలవంటి పరాగము దిక్కులనే కాక శత్రుస్త్రీల మొగములనుగూడ మలినముగాఁ జేసెను. అతని ధ్వజపటములు సూర్యునే కాక శత్రుపరితాపమును గూడఁ గప్పివైచెను. అతని గజముల మదప్రవాహము భూపరాగమునేగాక శత్రుధామములనుగూడఁ దుడిచివేసెను. అతని ప్రయాణ భేరీఝాంకారము పర్వతగుహలనే కాక శత్రుచిత్తములను గూడ క్షోభపెట్టెను. అతులశక్తిగల యాతని ప్రయాణము విని కొందఱు రాజులు దారాపుత్రులను వదలి లేళ్ళవలె దిగంతములకుఁ బరువెత్తిరి. మఱికొందఱు వాఁడిగల కత్తిని, మఱికొందఱు గొడ్డలిని గంతమందుంచుకొని మానము వదలి శరణ్యుఁ డగునతని శరణుజొచ్చిరి. మఱికొందఱు మానము వదలలేక ప్రాణములనే వదలిరి. మఱికొందఱు తమకుఁ గల సొత్తంతయుఁ గానుకగా నొసఁగి హిమ ఋతువునందలి వృక్షములవలెఁ బ్రాణములనుమాత్రము కాపాడుకొనిరి. దీనరక్షకుఁడగు శ్రీవర్మయు శరణుచొచ్చినవారి రాజ్యము లెవరివి వారికిచ్చివేసెను సత్పురుషుల కోపమునకు నమస్కారమే యవధిగదా ! రణమందుఁ జచ్చిపోయినశత్రుభూపాలుర కుమారులకుఁ గూడ వారివారి రాజ్యము లిచ్చివేసెను. ఉన్నతు

లకు దీనులయెడ దయ సహజసిద్ధమేగదా! అతని కటకమువలె రాజధాని గూడఁ బ్రతిదినము వృద్ధినొందసాగెను. ఝుమ్మని తుమ్మెదలు గండస్థలములు మూయ మదప్రవాహముచేత భూమి యంతయుఁ బంకిలముగావించు నేనుఁగులచేత నతని ముంగిలి యంతయుఁ బరిమళించుచుండెను. ఏనుఁగు దంతములతో బిగించిన చామరంబులును బంజరములలో మంచి తెచ్చిన సింగపుఁ గొదమలును గానుకగానిచ్చి మన్నెపు దొర లతనిని సేవించుచుండిరి. ద్వీపాంతరీయు లగు రాజులందఱు నచటఁగల విచిత్రవస్తువులను దెచ్చి యిచ్చుచుంత నీభూపాలుఁడును వారిని యథావిధిగ మన్నించుచుండె. ప్రభువుల చిత్తములు దుస్సహవాసముచే నొకప్పుడు చెడిపోయినను స్వభావముగా నుచితజ్ఞులు కాకపోవు. సముద్రతీరమున సంచరించుచున్నపు డతనికి సముద్రుడు గూడ భయముచేతను బోలె మంచిమంచి రత్నములను ముత్యములను గల్లోలహస్తములచే సమర్పించుచుండెను. వేయేల, ద్వీపములయందుఁ గాని, దుర్గములయందుఁ గాని, మండలములయందుఁ గాని, దిక్కులయందుఁ గాని, మూలలయందుఁ గాని, యతనియాజ్ఞ కెదిరించువాఁడు లేకపోయెను. దైవమనుకూలుఁడైనపు డనుకూలము కానిదియుండునా! మొదటఁ గరముచే లాలింపఁబడి పిదప మానము చెడకుండ ననురంజింపఁబడిన సముద్రవసన యగుభూమి కులకాంతవలె నితనికి సర్వదా వశురాలై యుండెను. ఈరీతి దిగ్విజయముఁగావించిన యా శ్రీవర్మ శ్రీపుర మేలుచున్నసమయముననే భూమి రాజన్వతియయ్యె. అపుడపుడతఁడు వాహ్యాళివెడలి తుమ్మెదల రొదకు బెదరి తలలాడించుచు నమస్కారములు చేయుచున్నవో యనునట్లున్న యేనుఁగులకుఁ గట్టుకట్టు లగుచెట్లను, నగడిత యొడ్డున బారులుతీర్చి కలస్వనంబుతోఁ గన్నులకుఁ బండువొనరించుహంసలును, నీటిలోపల బెళుకుబెళుకుమని గంతులువైచు చేఁపపిల్లలును, గాలిచే నిట్టటు నాచువలెఁ గదలుచున్న తమ్మిపుప్పొడియును, గవాక్షముల నడుమనుండి యొయ్యారముగాఁ జూచుచున్న పౌరకాంతల సౌందర్యమును జూచుచు మరల నంతఃపురమును జేరినపుడెల్లఁ బంచ

బాణుఁడుగూడ కాంతాహృదయాంతఃపురములను జేరి వారిని వేధించు చుండెను. రాజేంద్రుండును బౌరకాంతల కెవ్వరికిని స్వాధీనముగాక శీలసౌభాగ్యములు గలిగి కామశక్తివలెఁ బ్రకాశించు నొక్కప్రభావతీ దేవికిమాత్రము సాధ్యుఁడై, యామెతో సమస్తసుఖము లనుభవించుచు నేవికారములును లేక శ్రీపుర మేలుచు, నొకనాఁడు నింగినిమూసియున్న శరత్కాలమేఘములు పుట్టుటయు నశించుటయుఁ గాంచి నిర్వేదమును జెందెను. సత్పురుషునకు విషయసుఖములయం దత్యాసక్తియుండదు. రాజ్యము శ్రీకాంతుడను పుత్రునకు సమర్పించి శ్రీప్రభుఁడను మునీంద్రు నాశ్రయించి సన్న్యసించి దుశ్చరమగు తపమాచరించి రెండువందల సంవత్సరములు జీవించి యతఁడు దేహమునుద్యజించి శ్రీధరమునీంద్రుఁడై యవతరించెను.

ఇది చతుర్థ సర్గము.

## పంచమ సర్గము

ధాతకియను పేరుగల దక్షిణఖండమున నిషకారగిరి యను నొక పర్వతముకలదు. భరతుఁడు మొదలగు రాజులందఱు నవతరించిన పూర్వ భరతఖండ మాగిరిని జుట్టువారియున్నది. అం దలక యను దేశము గలదు. ఆదేశమున నంతట మెట్టతామరతీఁగలు కాంతలవలెఁ గమలాన నంబులతోడను మధుకరీ నయనంబులతోడను, నాళబాహువులతోడను మనో హరములై యుండును. మఱియు నందలి పల్లెటూళ్ళలోఁ బండు ధాన్య రాసులు కొండలవలె శిఖరములచే మేఘముల నొరయుచు విస్తారమైన భూమి నావరించియుండును. మహాత్ముల మతులవలె గభీరములగుటచే నెవ్వరికిని లోఁతు తెలియక విమలములయ్యు సర్వలోకసమ్మతములైన గొప్పచెఱువులును, జనులు దిగుటకుఁ దగిన నీరుగల దిగుడుబావులును, జక్కని శకుంతములచే నుభయతటములయం దలంకరింపఁబడి సర్వదా

ప్రవహించు నదులును, పద్మవనములచే నిండియున్న తటాకములును నాదేశము నందంతటఁ గలవు. తగినవేఁడియుఁ, దగినమంచును, దగిన వర్షంబును గలిగి శీతలబాధయు, వాయుబాధయు, రజోబాధయు లేక యుండు నా దేశమునఁ బ్రజలందఱు సమస్తఋతువులయందు సమమైన సుఖ మనుభవించుచుందురు. ఆదేశ మిసుక తిన్నెలను పిఱుందులు, సుడులను నాభులును కలిగి సుందరములైన మధ్యభాగములతో సుపయోధరంబులైయున్న మహానదులును గులస్త్రీలనువలె నిజాంకమున లాలించు చుండును. అచటి జనులకు వ్యసనములకు లోఁబడిన పడుచుఁదనమును, మఱపు పుట్టించి మతిని బాడుచేయు ముదిమియును. నకాలమృత్యువును నేమాత్రపు మాలిన్యముగాని గల సుగుణంబులును లేవు. దోషములు లేక యెప్పటికప్పటికి నూతనములైన సస్యములచే ముక్కారును బండుచు నుత్తరకురుదేశ భూములనుబోలియున్న యచటిభూములు సమస్తజనులకుఁ గన్నుపండువొనరించుచుండును. పూలుపూయని చెట్లును గాయలుగాయని పూవులును. బండుపండని కాయలును, రుచిలేని పండ్లును నందులేవు. పెక్కేల, యేవస్తువుగాని జనులకు ముదముగొల్పని దందులేదు. ఆ దేశమున ముల్లోకములు నిండిన ప్రతిష్ఠగల కోసలయనుపట్టణము గలదు. అలకాపట్టణమువలె భూరివిభవముగల పుణ్యజను లందును గలరు. అందలి సౌధశిఖరములు గుచ్చుకొని తూంట్లుపడిన మేఘములు శరత్కాలమందును గొలంది కదుపులు కలవయ్యును పెద్ద ధారలుగల నీరును గురియుచుండును. అందలి పడుకటిండ్లలోఁ బూవు దండలలోని పరాగమును జిమ్మి మణిదీపముల నార్పఁదలఁచియు నవి యాఱిపోవమి సిగ్గుపడుచుఁ దలవంచుకొనిన ముగుదలంజూచి భర్తలు నవ్వుచుందురు. భాగ్యవంతులు కట్టుకొనిన మేడలయందుఁ బ్రతిఫలించిన నక్షత్రములు విలాసమునకై చల్లిన మల్లిపూవులవలెఁ గనఁబడుచుండును. భర్తల సంకేతస్థలములకై యర్ధరాత్రములయందుఁ గటికిచీఁకటిలోఁ బోవుచున్న యచటి జారిణీస్త్రీలకు వారిముఖచంద్రుఁడే యెంతయు విఘ్నముఁ గలుగఁజేయుచున్నాఁడు- చంద్రుఁడా పురమునందలి మేడల

మీఁదుగాఁ బోవునపు డచటి కాంతల మొగములచే జయింపఁబడిన వాఁడుంబోలె నింద్రనీలమాణిక్యకాంతిచే నల్లపడుచుండును. అచటి యగ్రత్తయందలి తెల్లతామరపూవు లెత్తైన మేడలు దాఁటిపోవుట కూర్ధ్వముగా నడచుచు నాయాసపడిన రవిగుఱ్ఱముల నోటినుండి జాఱిన నురుఁగుముద్దలవలె నుండెను. మానససరస్సు నిర్మలోదకము కలదయ్యును సర్వదా హంసలచే సేవింపఁబడమింజేసి యందలి సరోవరములకు సాటి రాదు. అచ్చటి కోటగోడలమీఁది స్ఫటికమణికాంతులచే రాత్రులయందు నక్షత్రములు గూడసూర్యునికంటె నెక్కువగాఁ బ్రకాశించుచుండును,విధాత యచ్చోటి కాంతలనుగూడ దేవతాస్త్రీలవంటివారినిఁగా సృజించి సాంకర్యము లేకుండ వీరికి తెప్పపాటొదవించెను. పద్మము లను భ్రాంతిచేఁ దుమ్మెదలు ఝుమ్మని మీఁదవ్రాల భయపడుచుందురను నొక కొఱఁత తప్ప దేవతాస్త్రీలకును నచ్చటి స్త్రీలకును నేమియు భేదములేదు. ఆకోసలపుర మజితంజయుఁ డను రాజు పాలించు చుండెను. సమస్తరాజులకు శిరోభూషణములగు పాదారవిందములు గల యానృపుని గుణచంద్రికల చేత జగమంతయు ధవళీకృతమయ్యెను. నావలెఁ బ్రతాపముతో నుండువాఁ డెవఁ డను నహంకారముచే సూర్యుఁ డుదయించుచున్నను నతని ప్రతాపమును గనుఁగొని సిగ్గుపడి క్రమక్రమముగఁ గాంతితరుగ నస్తమించు చుండును. ఎంత యైశ్వర్యశాలియైనను నారాజునకు నిగర్వచూడామణి యను కీర్తియే దిగంతములకు వ్యాపించెను. పురుషుల కెన్నఁడును గుణసంపద తెచ్చినంత గౌరవము నైశ్వర్యము దేఁజాలదు. భువనప్రసిద్ధమైన కీర్తిచేఁ బేర్కొనఁబడిన యా యజితంజయుని ధైర్యమును వినుటచే నల్లపడిన సముద్రుని కిప్పటికిని మాఱురంగు రాకున్నయది. రిపువంశారణ్యములఁ దగులఁబెట్టి మిత్రముఖపద్మములను వికసింపఁజేయుచున్న యాభూపాలుని తేజస్సుచేత సూర్యుఁడును, సౌందర్యముచేతఁ జంద్రుఁడును, జయింపఁబడిరనుటకు సందియమేమి? ఈ కోసలాధిపతి యీశ్వరుఁడు, గురుఁడు, నరకభేది,ధనదుఁడు, కమలాలయుఁడు,శిశిరకిరణుఁడు, బుధుఁడు, సుగతుఁడు నగుటచే సర్వదేవమయుఁ

డనుట కెవ్వరును జడియరు. రిపులను మాడ్చి గుణములచే సమస్తప్రజలను రంజింపఁజేయుచున్న యితనికాలములో ధరణి నిరుపద్రవయై వర్ధిల్లుటకు సంశయమేమి ? నడుమనడుమ శత్రుకాంతల కన్నీళ్ళచే నాఱిపోవుచున్న యితని ప్రతాపాగ్నిని వైరిసూర్యకాంతి మరల రగుల్కొనఁజేయును. మదించిన సింహకిశోరమువలె యుద్ధమునకు దొరఁకొన్న యతనికి శత్రుగణము కీటకములకంటెఁ దక్కువగాఁ గనఁబడు చుండెను. దిక్కులన్నియు జయించి యేకచ్ఛత్రాధిపత్యముగాఁ బుడమి యేలుచున్న యితనికాలమున నింద్రాదులకుఁ గల దిక్పాలకు లను పేరులు నిరర్థకములై యుండెను. సముద్రవసన యగు భూమి నితఁడు భుజాయుగళంబున మోయుచున్నంతకాలమును శేషుఁడు భూభారముచే వంగిన తల లెత్తుకొనియుండెను. సత్కులప్రసూతయు రూపవిభ్రమములచే మనోహరయు నగు జితసేనయను సతీతిలకమును వరించుటచేత నీ నరనాథుని కీర్తికి మిగుల వన్నెవచ్చెను. సురాసురస్త్రీలను బెక్కుమందిని సృజించిన విధాత తనకుఁగల స్త్రీనిర్మాణ కౌశల మంతయు నా జితసేనను సృజియించుటలో వినియోగపఱచెను. రూపమునకుఁ దగినవియు మగనికి సంపత్ప్రదములునగు శరీరావయవములచేఁ బ్రకాశమాన యగు నాసాధ్వి యతని సంపద కలంకారమైయుండెను. చంద్రాస్తమయకాలమందును నాపతివ్రత ముఖచంద్రుఁ డుండుటంజేసి తత్పురవాసులకుఁ జంద్రుడులేనికొఱంత లేదు. సమానగుణశీలవయోరూపములు గల యాదంపతులను సమకూర్చిన తమ్మిచూలి నేర్పునకు ఫలముగా వీరి కజితసేనుఁ డను నొక కుమారరత్న ముదయించెను. ప్రథమవయస్సునుండియుఁ బ్రజారంజకుఁడై శరత్కాలశుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధిఁ జెందుచున్న యాకుమారతిలకమే చంద్రుఁ డొనరించుపనిఁ జేయుచుండ జనులు చంద్రోదయమును గోరరైరి. నిజముగనతనిరూపముచేజయింపఁబడిసిగ్గుచేతమన్మథుఁడు శరీరవిహీనుఁ డయ్యెను గాని హరలోచనాగ్నిచేఁ దగ్ధుఁడయ్యెననుమాట యబద్ధము. ఐశ్వర్యమును వినయంబును, వినయమును శాంతియు, శాంతిని వీరాక్రమంబును నలంకరింప గుణసంపదచే జగమెల్లఁ జూల

కనఁగాఁ జేయు కుమారునిఁ జూచి సంపూర్ణ చంద్రునిఁ జూచిన సముద్రునివలె నాతండ్రి యుప్పొంగుచుఁ దనలో, "సమస్తసద్గుణములు గల యిట్టి కుమారుని గనుటచే నాజన్మ సార్థకమయినది. చంద్రుని కిరణములచేత నాకాశమువలె నాకుల మితనిగుణములచే నలంకరింపఁబడినది. పూవులచే వృక్షములవలె, యౌవనముచే శరీరముపగిదిఁ, బ్రశమముచేఁ జదువు కొన్నవానివడువునఁ బురుషునివంశము సుపుత్రునిచే నలంకరింపఁ బడును." అని సంతసించి మఱునాఁడు సామంతరాజుల నందఱిని బిలి పించి కుమారునకు యౌవరాజ్యాభిషేకముఁ గావించెను. శుద్ధమతియగు నజితసేనుఁడును దేవేంద్రపదముకంటె మిన్నయగు తండ్రిపదమును వడసి చంద్రునివలె సకలరాజకరపద్మములను ముకుళింపఁజేసెను. నయ నాభిరాముఁడై నవోదయమును బొందుచున్న యా బాలచంద్రునిఁ జూచి నెపుడెల్లఁ బ్రజలు శిరసా ప్రణమిల్లుచుందురు.

అజితంజయుఁ డొకనాఁడు యువరాజుతోఁ గూడఁ గానుకలు తెచ్చిన రాజమండలము పరివేష్టింపఁ గొలువున్నతఱిఁ జంద్రరుచి యను రాక్షసుఁ డొకఁడు పూర్వవైరమును స్మరించుకొని యాసభనంతయు మోసపుచ్చి యాకుమారు నపహరించెను. రాజేంద్రుఁడును నిది యసుర కృత్యమని కొంతవడికిఁ దెలిసికొనియు సుతశూన్యమగు సభాభవనమును శూన్యముగాఁ దలఁచుకొని "యిది యింద్రజాలమా ? లేక ధాతుగతమగు వికారమా ? లేక మనోవిప్లవమా ? లేక యీ సభలో యువరాజుండినను లేనట్లు నాకుఁ దోఁచుచున్నదా? లేక పూర్వజన్మ వైరియగు రాక్షసుఁడెవ్వఁ డేని దయమాలి నాకుమారు నపహరించెనా ?" యని తర్కించుచుఁ గుమారుఁడులేని రాజ్యము జీర్ణారణ్యప్రాయముగాఁ దలఁచుకొని విల పించు భార్యతోఁగూడ. దుఃఖించు సభాసదులతోఁ గూడఁ బెద్దయెలుఁ గున నేడ్చుచు 'మదంకదుర్లలిత ! కుమార ! దిక్కులేని నన్నువిడచి యెచటికేగితివి ? నాకొకసారి లఘుదర్శనమైన నొసఁగుము. నిన్నుఁజూడ కున్నచోఁ బ్రాణములు నిలువవు. నిన్ను లాలించుటలోఁ గొఱఁతచేసి

తినా! నీతో మనోహరముగా మాటలాడుటలోఁ దక్కువగావించితినా? నీయందుఁ బ్రేమచూపుటలో నరచేసితినా? ఏల నిష్కారణముగ నాపైఁ గోపించెదవు? వచనామృతముచే నాచెవులకుఁ బూర్వమువలె రసాయన ముంబెట్టుము. ప్రేమలేనివానివలె నాకులపడు తండ్రి నేల యుపేక్షించె దవు! ఏదియే నొక కారణమున నాయందు నిరాదరభావమే కలుగును గాక, కలిగినను నాతప్పుసైచి నన్ను మన్నింపుము. పోనీ, నే నపకా రము చేసితిని. ఏయపకారమును గావింపని నీతల్లి నేల యడలించెదవు! ఇది నీయందు సహజవాత్సల్యముకలదిగదా? ఓదైవమా! పెక్కు మనో రథంబులఁ దలపోయఁ దలపోయనామనవి యాలకించి నావంశముద్ధరింపఁ గుమారునిదయచేసియు నిధిఁజూపించి మరలఁ గప్పివైచినగతి నిర్దయుం డవై యిట్లు చేసెదవా! నీకేమియపకారము చేసితిని? ఓకుమార రత్నమా! భూభువనమను నుదయాచలంబునం బొడమి తమోమార్గము నతిక్రమించి వెలుంగుచున్న బాలసూర్యుఁడవు. నీవు లేకుండుటచే నాకుదిక్కులన్నియు నంధకార మయములై యున్నవి. నాకీదినము దుష్టదినమయ్యెను. బంధు జన మంతయు దిక్కుమాలిపోయెను. నీ వియోగవహ్నిచేఁ గాల్పఁబడిన నేను బ్రతికియున్నను జచ్చినవాఁడనే. కీర్తికి,సుఖమునకు, విభవమునకుఁ దేజస్సునకు నాకునీవే కారణము. నీవులేకపోవుటచే నవియన్నియు లేనివే! సుందరంబగు బొమముడి గల కందోయియుఁ, జంద్రునివంటి ముద్దు మొగంబును, మధురములగు వాక్యములును, సుందరమగు నీ శరీరమును నా పూర్వపాపఫలముచే స్మరణీయము లయ్యెనా! దురదృష్టవంతుఁడగు నాకీదినము మఱల నుత్సవప్రదమగునా; నీముఖపద్మమును జూచునంతటి భాగ్య మీకనుంగవకుఁ గలుగునా! గమనోన్ముఖుండవగు నీవు మాతో పాటు భర్తృవియోగ దుఃఖము గలదానినిగా నొకకాంతను జేయకుండుట యొకమంచిపని చేసితివి. సహింపరాని దుఃఖమను వర్షాకాలముచేత నొడ్లు రలఁ బ్రవహించుచున్న బందుగుల కన్నీటినదులు నిదాఘసమయమువలె నీవురావేని యెట్లెండిపోవును.'' అని విలపించుచుండఁ గృపాళుఁడై విధాత యతనికి క్షణకాలమయిన వ్యథ లేకుండుటకుం బోలె మూర్ఛను

గల్పించెను. పరిజనమందఱు శీతలోపచారములు గావింప నా వసుధేశుఁడు కొంతవడికి మూర్ఛానిద్రను వదలి యాకాశమునుండి దిగివచ్చుచున్న యొక వెలుఁగును గాంచెను. దాని ముక్కు, మొగము మొదటఁ దెలియకపోయెను. తరువాత నది క్రమముగఁ గాళ్ళుచేతులు గలిగిన యాకారమువలెఁ గాన్పించి పిమ్మట తపోభూషణుఁడను నొక మునీశ్వరుఁడై రాజ సమీపమునకు వచ్చెను. ఆమహానుభావుని తపోమహిమచేత యీ యజితంజయుఁడు పుత్రశోకమును మఱచిపోయెను. ఆమౌని నేలఁ బాదములు మోపునంతలోఁ దన యుత్తరీయమును గ్రిందఁబఱచి పిదపఁ బరిజనముచేఁ దీసికొనిరాఁబడిన యాసనమును గూర్చుండుటకై యిచ్చెను. ప్రాణసమానుఁడగు పుత్రుని వియోగముచేఁ గలిగిన దుఃఖమునుగూడ మఱపింపఁ జాలినంతటి సంతోష మారాజున కాముని సందర్శనమునఁ గలిగెను. ఆకాశమునఁ దిరుగువాఁడగుటచేఁ గాలికి బురదయంటనివాఁడైనను నా తపోభూషణుని పాదము లానరేంద్రుఁ డానందాశ్రులతోఁ గలసిన పవిత్రోదకముచేఁ గడిగి దంతకాంతులను మల్లిపూవులచేఁ బూజ చేయుచు "మునితిలకమా! మీదర్శనముచేఁ గృతార్థుఁడనైతిని. నాపుట్టువు కొనియాడఁబడియె. నాకీర్తి చంద్రునివలె స్వచ్ఛమైనది. సర్వమనోరథములమీఁద నడచు మీకు నావలనిపని యుండదుగదా! కృతకృత్యులకు మీకు దేనియందును వాంఛయుండదు. పరమవేదాంతులగు మీకెవ్వరియందును బ్రేమయుండదు. మీరాకకుఁ గారణము నాపూర్వపుణ్యముగాని వేఱుకాదు. నేను దురంతమగు బంధువియోగదుఃఖములో మునిఁగియున్నవాఁడను. ఏబంధువులును దీర్చలేని యాదుఃఖమును నీవు తీర్చితివి.కావున నీవేయెక్కుడు బంధువుఁడవు." అని భయభక్తులతోఁ బాదములమీఁదఁ బడియున్న మహీపతింజూచి మంగళప్రదుండగునాజడదారి మనోహరమగు నుపన్యాసముతో "రాజా! దివ్యదృష్టిచేతఁ నీకుఁగలిగిన దుఃఖము న్నెఱింగి నీయందలిగుణములకు సంతసిల్లి నీయుపద్రవము బాపుటకయి వచ్చితిని. మేము గుణప్రియులము, ప్రియవస్తువియోగముగాని యనిష్టాగమనము గాని జంతుమాత్రములకు సాధారణములైనవని యెఱింగిన

విద్వాంసుఁడెన్నఁడును దుఃఖముపాలుగాఁడు. బుద్ధిమంతుఁడవగు నీకిట్లు దుఃఖించుట తగదు. దైవమువలన వచ్చు విపత్తులకై బుద్ధిమంతులు శోకింపరు, నీకుమారున కుపద్రవము వచ్చినదని విచారింపకుము. కొలఁదిదినములలో నీవతనిం గలసికొందువు. అతఁడు కుశలియై యున్నవాఁ" డని నిశ్చితార్థమును జెప్పి యాతపోభూషణుఁడు నిజాశ్రమమునకుఁ బోయినవెనుక, పుడమిఱేఁడు కొంతసంతసముతో దివసకృత్యముల నెఱవేర్చుకొని మునీశ్వరుని మాటచొప్పునఁ గొడుకువచ్చుసమయముం గోరుచు సుఖముగానుండెను.

ఇది పంచమ సర్గము.

## షష్ఠ సర్గము

అట్లు చంద్రరుచి యను రక్కసునిచే, నపహరింపఁబడినయారాజకుమారుఁడు దేశమంతయును ద్రిప్పఁబడి మొసళ్ళచే భయంకరమగు మనోరమ మను సరస్సులోఁ బడవేయఁబడియెను. ఆకసమునుండి పడిన యాకుమారుని శరీరఘాతముచేఁ నీరు నాల్గుదిక్కులకుఁ జెదరుటచేత క్షణకాలమ్ము చెఱువు భూమియు భూమి చెఱువు నయ్యెను. పిడికిటిపోట్లచేతను, మడమదెబ్బలచేతను జలజంతువులను జూర్ణముగాఁ జేయుచు నీఁదియీఁది యారాజపుత్రుఁడు పూర్వపుణ్యశేషమున నొడ్డెక్కెను. పిదప మనోవికారముచేఁ గొంతవడి తెలుపును. గొంతసేపెఱుపును, గొంతకాలము నలుపును గల చూపులచేఁ దిక్కులను గర్బురవర్ణములుగాఁ జేయుచుఁ జొరరాని మహారణ్యమును జూచి యాకసము పొడవున దట్టముగ నలముకొనియున్న చెట్లచే దిగ్భేదము తెలియక సూదులవంటి కుశాగ్రములు గుచ్చుకొనునేమో యను భీతిచే సూర్యకిరణములు కూడఁ బ్రవేశింపని యామహారణ్యమున సింగపుగోళ్ళచేఁ జీల్పఁబడిన యేనుఁ

గుల కుంభస్థలములలోని ముత్యములు వృక్షాగ్రములచే రాలఁగొట్టఁబడిన తారకలవలెఁ బ్రకాశింపఁ గృపాశూన్యులగు కిరాతులచేఁ జంపఁబడిన లేడిగున్నల యొడళ్ళనుండి ప్రవహించు రక్తప్రవాహములచే నెఱ్ఱనైన నేల చూచునప్పుడెల్ల భయసంతోషములు రెండు నుప్పతిల్ల వనదేవతల కాలిపారాణి యని భ్రాంతిపడుచు నాకారడవిఁ జొచ్చెను. ఒకచోట నెఱుకువాండ్రు చంపిన పెద్దపులుల చారలతోళ్ళను వేఱొకచో సింగములు చంపిన యేనుఁగుల యెమ్ముప్రోవులను జూడ మృత్యుదేవత పట్టణమువలె మది కదలు జనింపజేఁయ నల్లిబిల్లిగ బ్రాఁకిన లతలచే నంధకారమయములు చేయఁబడియుఁ బైకిఁ బ్రసరించు కర్పూరపరాగముచే నేడాకుల యరఁటిచెట్లని తెలియఁజేయుచున్న పొదలు మనంబున కుల్లాసంబుఁ గలుగఁజేయ, గజములనుకొని మీఁదఁబడుచున్న సింహములకు వేఁడినిట్టూర్పులచేఁ జలిఁబోఁగొట్టుచుఁ గోపము చల్లార్చుచున్నకొండచిలువలనుదిగ్భేదము తెలియమింజేసి కదలలేక యున్నచోటనే యుండి చలికాలమును సుఖముగావెళ్ళఁబుచ్చు క్రోఁతులను జూచుచుఁ,గిరాతులు నడచిపోవు మార్గము నెట్టకేలకు గుర్తుపట్టి నడచుచు నారాజతనయుఁడు తన్నుఁబోలి గురువంశమై యప్రమాణసత్త్వమై యున్నతస్థితికలదియై రుచిరాకృతియైయున్న యొకపర్వతము మీఁదికెక్కెను. బహునాగమై, యనేకఖడ్గసేవ్యమై,ప్రసాధితాశమై మహారాజుం బోలియున్న యాకొండమీఁదికెక్కిన కుమారుఁడు వనమెంతదూరమున్నదో పరిశీలించి చూచుచుండ భయంకరమైన మొగముతోఁ బెదవులదర కన్నులు గిరగిరఁద్రిప్పుచు నొక పురుషుఁడు వర్షాకాలమేఘమువలె నతని కెదురుపడి కేకలచేఁ గొండగుహలు మారుమ్రోయ పీరులు వినరానిమాటలతో "నోరీ! నీవుబలశాలివా? విద్వాంసుఁడవా? అన్యులు చొరరాని నా యీ మహారణ్యములోని కేల వచ్చితివి. దేవేంద్రుఁడైనను నాయానతిలేక యిందుఁ బ్రవేశింపఁజాలఁడు. వనములోఁ బ్రవేశించుటయే కాక నాభుజదండములచేఁ బరిపాలింపఁబడు నీకొండ యెక్కితివి. కొండకాలువలలోని నీటితుంపురులచేఁ జల్లపడి సూర్యకిరణములుగూడ నాప్రతాపమునకు జడిసి యీపర్వతమునఁ బ్రకా

శింపవు. నీచావు కౌఱకు నాకు వ్యతిరేకమైన పనిచేసితివి. నిన్నెవఁ డీట్లు వంచించెనో! నాపరితాప మెన్నఁడును వినలేదా! విద్వాంసు లాలోచింపని పని చేయరు. నీవు మూర్ఖునివలె నున్నాఁడవు." అని గర్వముతో బెదరించిన వానిమాటలు మర్మచ్ఛేదముచేయు బాణములవలె దాఁకినఁ గోపము తెచ్చుకొని యానృపసూనుఁ "డోరీ పొగరుబోతా! అర్థములేని నీమాటలకుఁ బిఱికివాండ్రు భయపడుదురుగాని వీరులు జడియరు. నేను సురాసురులు వచ్చిన జయింపఁగలను. నీవంటి మనుష్యకీటకమెంత? ఇఁక గర్వపుఁబలుకులు వదలుము. నవ్వుచు మాటలాడుచున్నానని విజృంభింపకుము. ఇది సత్పురుషులకు లక్షణము. నీకుఁ బౌరుషముండెనేని యుద్ధమునకు రమ్ము. లేదేని నీదారిని నీవు పొమ్ము" అని పలికిన వాఁడినుపకోల గిరగిరఁ ద్రిప్పి కొట్టెను. నరనాథబాలకుఁడు నాదెబ్బఁ దప్పించుకొని వానిఁ దన భుజపంజరమున నదిమిపట్టుకొనియెను. ఒండొరు లొండొకళ్ళఁ జేతులచే బాఁదుకొనుచుండ వనదేవతలు చెట్లు చాఁటుననుండి చూచుచుండిరి. కాళ్ళచేఁ దన్నుకొనుచుఁ జేతులచే గుద్దుకొనుచు మఱియు ననేక ప్రకారంబుల సాదన చూపించుచు మల్లయుద్ధము చేయుచున్న యా యిరువురలో నెవ్వరికిని జిఱకాలమువఱకు జయము లేకుండెను. తుట్టతుదకు రాజపుత్రుఁడు చేతులతో వాని నాకసమునకు గిరాటువేయ వాఁడు పదియాఱుచోట్లను బురుషభూషణములను ధరించిన దివ్యరూపముతో 'రాజపుత్రా! నేను హిరణ్యుఁడను గంధర్వుఁడను. మాది స్వర్గలోకము, సురాద్రియందుఁ గల జినాలయంబులకు నమస్కరింపఁబోయి సుందరమగు నీగిరియందు విహరించుటకై వచ్చితిని. మాఱువేసముతో నీబలము పరీక్షించితిని నన్ను జయించిన నీసాహసమునకు మెచ్చితిని. నిన్నుఁ దొమ్మిదినెలలు మోసి కన్న తల్లియే తల్లి. ఆమెయే ధన్యురాలు. దేవదానవులందఱు మెచ్చుకోఁదగిన చమత్కారముఁ జూపించితివి. కావలసిన వరమిచ్చెదను, కోరుకొమ్మనుటకు సిగ్గుపడుచున్నాఁడను. పుణ్యాత్ములలో నగ్రేసరుండ వగు నీకు నావలనఁ బొందఁదగిన వరమేముండను. అయినను బ్రయత్నసాధ్యమగు నొక మనోరథమును సమ

కూర్చుటకై నన్ను విధేయునింగాఁ జేసికొమ్ము. పరాక్రమశాలురకుఁగూడ నొండొరులసహాయము లేకుండఁ గార్యసిద్ధికాదు. అదియునుఁగాక నీజన్మాంతరచరిత్ర కొంచెము చెప్పెద నాకర్ణింపుము:— నీవీ జన్మము నకు వెనుకటి మూఁడవజన్మమున సుగంధిదేశమున శ్రీపురమేలు భూపాలుఁడవు. ఆపురమున శశి సూర్యులను నిద్దఱు వైశ్యగాండ్రు కాఁపు రము చేయుచుండిరి. అందు శశి యొకనాఁడు సూర్యునియింటికిఁ గన్నముఁ ద్రవ్వివాఁడు పాఁతుకొనిన ద్రవ్యమంతయు నపహరించెను. నీవావిషయము విచారించి శశిని బందెలోఁ బడవైచి వానియొద్ద నపహ రింపఁబడిన ధనము కానరామిఁజేసి సూర్యునకు నీ సొంతసొత్తు నిచ్చితివి. ఆ శశి రెండవజన్మమునఁ జందరుచి యను రాక్షసుఁడై పుట్టెను. ఆసూర్యుఁడే పూర్వపుణ్యమున నేనైతిని. శశి పూర్వవైరముచే నిన్నపహ రించెను. నా కుపకారము చేసినవాఁడవగుటచే నేనిపుడు నీకు మిత్రుఁడ నైతిని." అని తేనెలొలుకు పలుకులు నుడివి హిరణ్యుఁ డంతర్ధాన మాయెను.

రాజపుత్రుండును వాని ప్రభావమువలన నడవిదాఁటి యీవలకు వచ్చిన తనశరీరమును జూచుకొని యచ్చెరువడి యది హిరణ్యుని మహిమగాఁ దలఁచుకొని యూళ్ళు, పల్లెలు, పట్టణములు మున్నగువానితో నిండియున్న దేశమునంబడి పోవుచు నొకచోట నలుదెసల బెదరుచూపులు చూచుచుఁ గాలుకొలఁది పరుగెత్తుచున్న యొకపురుషునిగాంచి తానును వెంటఁ బరువిడి కలసికొని భయముతోఁ బులకరించియున్న వాని శరీర మును జేతఁ నిమురుచుఁ బాఱిపోవుటకుఁ గారణమడిగెను. వాఁడును దెలతెలపోవుచు "నీవాకసమునుండి యూడి పడితివా యేమి? నీకుఁ బ్రసిద్ధమైన వృత్తాంతమే తెలియకున్నది. ధనధాన్యములకుఁ బ్రసిద్ధమైన యరింజయ మను పేరుగల యొకదేశము కలదు. ఎన్నఁడు చూచినను నచ్చటి భూమి లేఁత పరియాకుమళ్ళచేఁ బ్రకాశించు శోభను వదలి యుండదు. ఆదేశమునకు నడుమ విపులమైన విపులాపురముగలదు. జయ

శాలియగు జయవర్మయను రా జానగరము నేలుచుండును. అతని చల్లని చూపులచేతనే ప్రజలు హిమాంశునియం దపేక్షలేనివారై యుందురు. సూర్యకాంతివలె సర్వదా పూరణముచేయుచు రతీదేవివలె సమస్తకామ సౌఖ్యము లొసఁగుచున్న జయలక్ష్మియను నొక రాజపుత్రి యతనికి ధర్మపత్నియై యుండెను. వారికి జగములన్నిటికి మేలుపూస యనఁజాలు శశిప్రభయనుకూఁతురు కలదు. ఆకన్యశరీరము సర్వదా లావణ్యసము ద్రమునం దీఁదులాడుచున్నట్లుండును. మహేంద్రుఁ డను రాజా కన్యను బెండ్లిచేయుమని జయవర్మను యాచించెను. జయవర్మయు నీవుచిరకాలము బ్రదుకువాఁడవు కావని కారణము జెప్పినిషేధించెను. దానికిమహేంద్రుఁ డలిగి కొంతసైన్యముం గూర్చుకొని వచ్చి జయవర్మబలమునంతయుఁ జంపి యతని విపులాపుర మాక్రమించుకొనుచున్నాఁడు. ఈయుపద్రవ మునకుజడిసి గిరిప్రదేశమునకు రాష్ట్రజనమంతయుఁ బాఱిపోవుచున్నది.' అని చెప్పిన యువరాజు విని విపులాపురమునకుం బోయి, రిపుసైనికులచే నిండియున్న యాపోలును చంద్రోదయకాలమున నుప్పొంగు సముద్ర తరంగములచే వ్యాప్తమయిన వేలావనముతో సాటిచేయుచు, ధైర్యముచేఁ జలింపక నగరుఁ బ్రవేశించుచు, మహేంద్రుని భటులందఱు 'నీవేపనికై పోవుచున్నావు? నీకుఁ బ్రాణముపై నాశకలదా లేదా? మారాజుగారెవ్వరిని లోనికి రానీయవలదని కావలియుంచిన మమ్ము గేలిసేయుచున్నాఁడ' వని బెదరింప, వారిమాటలకు అంతకోపముహెచ్చి యందఱిఁ జేతులతో బాఁది 'మీరాజు ప్రాణములతోఁగూడ మీప్రాణములను గాచికొనుండు. ఈ పురము విడచి పాఱిపొండు.' అని పలుకుచు నేనుఁగులను మొసళ్ళను, తురంగంబు లను తరంగంబులును గల సైన్యమును సముద్రమునమందర పర్వతమువలెఁ దిరుగుచు రాజువనెల్లఁ బాఱఁదోలి యామహేంద్రుని కడకుఁ బోయి కోపముతో నొక్కబాణమును బ్రయోగించి వానిజయలక్ష్మిని విధవను గావించెను. జయవర్మయు నకారణబాంధవుఁడగు రాజపుత్రునిఁ బురస్కరించుకొని సమస్తవిభవములతో నగరుఁ బ్రవేశించెను. యువ రాజును గవాక్షరంధ్రములగుండఁ జూడవచ్చిన యంతఃపురస్త్రీలకు వివిధ

ములగు మనోవికారములను బుట్టించెను. మన్మథునివంటి సౌందర్యమును నితరదుర్లభమగు పౌరుషమును గల యారాజపుత్రుని జాతికులశీలస్వభావముల నొరులు చెప్పకుండఁగనే తెలిసికొనిన జయవర్మ యతనినిమిగుల గారవించుచుండెను. కుమారుండును అరింజయదేశమంతయుఁ గైవసము చేయించెను. ఒకనాఁడు భార్యతోఁగూడఁ బాన్పుపైఁ బవళించియున్న యా జయవర్మకడకుఁబోయి నమస్కరించి శశిప్రభ చెలికత్తె "దేవా! మహేంద్రునిజంపిన యాపడుచు కుఱ్ఱవానిఁ జూచినదిమొదలు మనశశిప్రభ గంధము పూచికొనక, మాల్యములు ధరింపక, శరీరమును బోషింపక, దురంతమగు నవస్థతోఁ, దెల్లఁబాఱిన చెక్కిళ్ళతో, శూన్యమగు చిత్తముతోఁ, దిండి తినక నీరుద్రావక పరితపించుచున్నది. హృదయమందలి వియోగవహ్నినుండి పొగ లేచుచున్నదో యనునటుల వేఁడి నిట్టూర్పులు ముఖరంధ్రములనుండి వెడలుచుఁ బద్మము లనుభ్రాంతిచే మొగము మీఁదికి మూఁగు తుమ్మెదలను బాఱఁదోలుచున్నవి. 'నాకాంతి నీమె ముఖకాంతి దొంగిలించుచున్న' దను కోపమునంబోలెఁ జంద్రుఁడు విషము స్రవించు కిరణములచే మన శశిప్రభ ననుక్షణము మూర్ఛిలఁ జేయుచున్నాఁడు. శీతలోపచారమునకై చెలికత్తెలు పఱచిన చిగురు పాన్పొక త్రుటిలో బొగ్గునిప్పుల పోల్కిగై యామె శరీరమును గాల్చుచున్నది. పాములతోఁ జెలిమిచేయు మంచిగంద మీమె శరీరమునకుఁ దాపమొనరించిన నొనరింపవచ్చునుగాని దక్షిణవాయువు గూడ తాపకరమగుట మాత్రము మిగులఁ జిత్రముగా నున్నది. తన భార్య సింగారమును దొంగిలించినదని నిజముగా మన్మథుఁడీమెను జంపుటకుఁ బ్రయత్నము కావించు చున్నాఁడు. కావున నీబుద్ధికొలఁది నందులకుఁ దగిన ప్రతిక్రియ యోజింపుము. మాశశిప్రభ మన్మథుని దశమావస్థఁ జెందకుండఁ గాపాడుము. అని విన్నవించిన యామాటలకు మేను బులకరింప భూపాలుండును గుమారిత చిత్తవృత్తి గూఁడ దన చిత్తవృత్తి కనుకూలించి యందునకు సంతసించుచు మఱునాఁ డుదయమున జ్యోతిష్కునిఁ బిలిపించి యాతఁడువెట్టిన శుభముహూర్తమున నారాజపుత్రునకు శశిప్రభ

నిచ్చెదనని ప్రతిజ్ఞ చేసెను. అది మొదలు యువరాజును వివాహ ముహూర్తమునుంచిన దినమునకుఁ గల వ్యవధి లెక్క పెట్టుకొనుచు దయితా సంగమమును గోరుచుండెను.

మిక్కిలి పొడవును నిడివియుఁ జుట్టు కొలతయుఁగల విజయార్ధ మను నొక పర్వతము కలదు. దానియందు దేవతలుగూడఁ దిరుగు చుందురు. దాని శిఖరములు తారలు నొరయుచుండును. రంగు వెండి రంగు. అది పైనుండి చూచువారల కంబరమను పాము వదలిన కుబుసమువలెఁ గనఁబడుచుండును. దానికి దక్షిణ భాగమున నాదిత్యపురమను పట్టణమాగిరిపైఁ బ్రతిఫలించిన స్వర్గలోకమువలెఁ గన్పట్టుచుండును. ధరణీధ్వజుఁడను రాజాపురమేలుచుండెను. అతని యైశ్వర్యమువంటి యైశ్వర్యము దేవేంద్రునకైనను లేదు. అతఁడొకనాఁడు కొలువు దీర్చియుండఁ బ్రియధర్ముఁడను పేరుగల పరమాణువ్రతము సేయు బ్రహ్మచారి యతి వేషముతోఁ జనుదేర, నతని కుచిత సపర్యలు గావించి పీఠమునఁ గూర్చుండఁ బెట్టెను. మహానుభావుల బుద్ధు లుచితకార్యము లొనర్చుటలోఁ బరోపదేశమును గోరవు. సేవకొఱకు వచ్చిన విద్యాధరాదులకు సెలవిచ్చి మంత్రులను బంపిన వెనుక నా ప్రియధర్ముఁ డారాజేంద్రునితో "నో రాజా! నిన్నుఁ జూచినంత యోగినగు నామదికిఁ గూడ నీయందు స్నేహము పొడముచున్నది. కారణము తెలియరాదు. బాంధవ వత్సలుఁడ వైన నీయందు నాకుఁ బ్రేమ జనించుట తప్పు కాదు గాని నాకీ మోహమేల జనియించినదో తెలియరాదు. ఎంత దుష్కరమైనను నీకోరిన కోరిక నెరవేర్చుటకు నన్నంతరాత్మ ప్రేరేపించు చున్నది. నీవృత్తాంతము నాకు సుధర్ముఁ డను మునీంద్రుఁడు తొల్లి వక్కాణించెను. అరింజయదేశమున విపులాపురమను పురము కలదు. దానిని జయవర్మ యను రాజనుభవించుచున్నాఁడు. అతనికి శశిప్రభయను కూఁతురు గలదు. దాని చక్కఁదనము మిక్కుటము. మన్మథుని ధనుర్లతవంటి యాకన్నియం బెండ్లియాడినవాఁ డెవ్వఁడో వాఁడే ధన్యుఁడు. వాఁడే పుణ్యా

త్మ్రుఁడు, వాఁడే నీకు మారకుఁడు, వాఁడే భరతఖండ మేలువాఁడు" అని యడుగకుండఁ జల్లఁగఁ జెప్పిన రాజును విని భయముచే శరీరముచమ్మ టిల్ల 'మునీంద్రా! నా కీవిషయమునఁ దగిన ప్రతిక్రియ యెఱిఁగింపుము. ఏనప్రమత్తుఁడనై కావించెదను,' అని వేఁడినను నతఁడు చెప్పక యంత ర్హితుఁ డయ్యెను. పిదప నాఁతఁడే యొక ప్రతిక్రియ యాలోచించు కొని. మఱునాఁడు చతురంగబలమును సమకూర్చుకొని జయవర్మ పుర మును ముట్టడించి సంధికై జయవర్మ యనిచిన యుద్ధతుఁ డను దూత మాటలు వినక వానింజంపి జయవర్మ పేరోలగమునకువచ్చి "నేను ధరణీ ధ్వజుం డను పేరుగల గంధర్వ చక్రవర్తిని. నీకు శశిప్రభయనుకూఁతురు గలదఁట. దాని నెవ్వనికో యొక పరదేశికిచ్చెదనని ప్రతిజ్ఞచేసితివని వింటిని. మంచికులమునఁబుట్టి యెక్కుడు కీర్తిని సంపాదించిన నీకుమాత్ర మీపని యుచితమైనదికాదు. ఇందువలనఁ దప్పక నీ కపకీర్తి వచ్చును. ఇంత మంది మహారాజుల ముండఁగనీకీ పరదేశి యెక్కడ దొరకెను? వరుల యెడ ముఖ్యముగాఁ జూడఁదగినదికులము. కులగోత్రములు విచారింపక యేల పెండ్లిచేసెదవు? నీ కెక్కువ పుణ్యములేనిచోఁ గూఁతును నాతని కిచ్చెదవు. నేను బలాత్కారముగ హరింపకుండ నీ చేతులార నాకొసఁగు" మని ముష్కరముగాఁ బలికిన వానికొక్కమాటలోఁ బ్రత్యుత్తరము చెప్పఁ దలఁచి "ధరణీధ్వజనృపాల! నీవు బుద్ధిమంతుఁడవే గాని లౌకికజ్ఞానము లేనివాఁడవు. కులముండనీ, లేకపోనీ యొకని కిచ్చిన కూఁతు నింకొకని కెట్లిచ్చెదను? బలాత్కారముగా నెవ్వఁడేని నపహరింపఁ దలఁచినచో నాకార్యము త్వరగఁ జేయుఁగాక, విలంబమేటికి?" అనిన వాఁడు కను బొమ్మలు ముడివైచెను, జయవర్మ భయము బొందెను. యువరాజది చూచి, 'మామా! యేల కంపించెదవు నేనుండ నీకేమిభయము? నీవు చూచుచుండ వీనినొక్క నిముషములో మృత్యుదేవత నోటిలోఁ బడవైచె దను.' అని మామచిత్తమును గుదురుపఱచి తనకు మిత్రుఁడగు హిరణ్యుని దలఁచికొనెను. స్మృతమాత్రుఁడై హిరణ్యకుండు నెదుటికి వచ్చి తాను వెంటఁ దీసికొనివచ్చిన శస్త్రాస్త్రములతోఁ గూడిన రథ మెక్కించుకొని

శత్రుసైన్యముమీఁదికుఱికి సేననంతయుఁ జెల్లాచెదరుగాఁ జంపుట కారం భించెను. గంధర్వు లందఱు సూర్యుని కిరణములకు వాఁడిపోయిన కలు వలవలె ఖిన్నులై యసాధ్యుఁడగు రాజజామాత కెదుట నిలువఁబడలేక పాఱిపోవుచుండ ధరణీధ్వజుండు నిలునిలుఁడని వారి నాఁగి, శత్రునిపైఁ దామసాస్త్రమును బ్రయోగించెను. దిక్కులన్నియు మూసికొనుచు వచ్చు నాచీఁకటి యమ్మును రాజకుమారుఁడు తపనాస్త్రముచే వారించెను. భుజగా స్త్రమునకు గరుడాస్త్రమును, పావకాస్త్రమునకు సముద్రాస్త్రమును,పర్వతాస్త్ర మునకు వజ్రాస్త్రమును, పయోధరాస్త్రమునకుఁ బవనాస్త్రమునుబ్రయోగించిన విరోధింజూచి ధరణీధ్వజుఁడు కోపముతోఁ గత్తిచేతంబూని మీఁదికుఱికెను. శశిప్రభా ప్రియుఁడును నమోఘమగుశక్తిచే వానింగడతేర్చి హిరణ్యుని మరల స్వస్థానమున కంపి సకలపౌర పురస్సరంబుగఁ బురముఁబ్రవేశించెను. పిదప నొక్క శుభముహూర్తంబున జయవర్మయు విధివిహితముగఁ బుత్రిక నారాజపుత్రునకిచ్చి పెండ్లి జేసి మహోత్సవముఁ గావించెను. శశిప్రభవంటి శశిప్రభను కేలువట్టి యువరాజును గొన్నిదినములు మామగారి యింటనుండి యతని యనుమతిని సుదినంబున భార్యతోఁ దన పురికిఁ బ్రయాణ మయ్యెను. తండ్రిని జూచు వేడుకతోఁ బోవు నతఁ డత్తవారి యింటి కినిఁ బుట్టినింటికిని గల బహు దూరమార్గముఁ గొలఁది దినములలోనే నడచెను. బంధుదర్శనోత్సాహ మెవ్వని కౌత్సుక్యము పుట్టింపదు? కష్ట ములు గడచి శత్రువులను జంపి భార్యను సంపాదించుకొని మహాభాగ్య ముతోఁ గుమారుఁడు చనుదెంచెనని విని యజితంజయ నృపాలుఁడు శరీరమంతయుఁ బులకాంకురములతోఁ బూచిన కమిడిచెట్టు గాఁగఁ బౌరుల తోడను బరిజనముతోడను నెదురేగి గొప్ప యుత్సవముతో నానందబాష్ప ములచే వీధులకు సలిలాసేకంబు గావించుచుఁ బట్టణమునకుం దోడుకొని పోయెను.

ఇది షష్ఠసర్గము

## సప్తమసర్గము

★

పిదప దేవేంద్రునిఁబోలు సంపదతో రాజ్యమేలుచున్న యా యజిత సేనుని రాష్ట్రమంతయుఁ బూర్వజన్మపుణ్యవశంబున శత్రుశూన్యమై ప్రకాశించెను. చక్రిచేతిలోని చక్రమువలె నితనిచేత నున్న చక్రముఁగూడఁ గిరణకాంతులచే జూడశక్యముగాకుండఁ బ్రజలందఱు సేవకొఱకు వచ్చిన సూర్యబింబమునువలె భావించుచుండిరి. తళతళ మను కాంతిచే భూమ్యాకాశముల నడుమ నిండిన యతని కత్తిని నారాయణావతారమగు నా పృథివీపతిని సేవించుటకై వచ్చిన శేషునిగాఁ దలఁచుచుండిరి. చుట్టును వజ్రముల చేరులతో నిండిన చంద్రునివంటి యతిశ్వేతచ్ఛత్రము సేవించుటకొఱకు వచ్చిన లక్ష్మీదేవి తనపాణిపద్మము నభయసూచకముగా శిరస్సు నందిడినట్లు ప్రకాశించుచుండెను. సముద్రముదాఁటుట మొదలగు కార్యము లందు సాధనమైన పూర్వపుణ్యవిభవములచే నాతనికి వశీకృతమైయున్న తోలుపుట్టి తన శరీరమును సంకోచపఱచుకొని యా రాజన్యుని సేవింప వచ్చిన యాకాశమువలె నుండెను. ఆయజితసేనుని చేతిలోని దండము పర్వతములను, వానిరెక్కలు ఛేదించిన వజ్రమునుగూడఁ బగులఁగొట్టుటకుఁ దగిన పాటవము గలిగియుండెను. సూర్యుఁడు పోఁగొట్టలేని చీఁకటినిఁ గూడఁ బోగొట్టజాలిన కాకిణి చంద్రికవలెఁ బ్రకాశించుచు నారాజకుమారునకుఁ గింకరియయ్యెను. క్రొత్తమబ్బుదగ్గఱ నున్న చీఁకటినిఁ గూడఁ బోనడపఁదగిన వెలుఁగుతోఁ దీపమువలెఁ బ్రకాశించుకొనతోఁ గమలాలయ చేతిలోని రత్నదర్పణమువలె నతని శిరోమణి యొప్పుచుండెను. గండస్థలములనుండి జాఱు మదప్రవాహములఁ గలిగి యిరు ప్రక్కఁ జామరములచే విసరఁబడుచున్న యతని పట్టపుటేనుఁగు గౌరవమునకోడి శుశ్రూష చేయవచ్చిన మంచుఁగొండవలె నుండెను. మంచి బలముకలిగి తప్పునడకలులేని యతనిగుఱ్ఱ మాశ్రయించుటకై వాయుదేవుఁ డా రూపముగవచ్చినట్లుండెను. తేజస్సునకుఁ జంద్రుఁడును, శత్రువులకు భయంకరుండును, శౌర్యమునకు భూమియు, శత్రుభయమున

కభూమియునైన కుమారస్వామివంటి యొకసేనాధిపతి యతనిసేనను రక్షించుచుండెను. అతని పురోహితుఁడు శరీరమును దాల్చినపుణ్యముపలె దేవతలు, మానవులు, నక్షత్రగ్రహములును గలిగించు చెడుగుల నన్నిటిని నివారింపఁ జాలియుండెను. కోరినతక్షణము దేవేంద్రుఁడు కాఁపురము చేయు నిల్లువంటి యిల్లు కట్టమనినను గట్టుటకుఁ దగిన సాధనసామగ్రి గలిగి యపరశిల్పిబ్రహ్మయని పేరొందిన యొక వడ్రంగికూడ నారాజు నొద్ద నుండెను. నిత్యమును జరుగు గృహకృత్యములను నిర్వహించుటకుఁ దగిన బుద్ధియుఁ, బ్రపంచజ్ఞానంబును, నాయవ్యయములు వ్రాయుటకుఁ దగిన నేర్పునుగలిగిన యొక్క వ్రాయసకాఁడుగలఁడు. వేయేల ? రమాదృష్టవతియగు శశిప్రభతోఁగూడియున్న యా యజితసేన మహారాజునకుఁ జతుర్దశ విద్యలును స్వాధీనములైనవి. భూపతికి మంచిదినములు వచ్చినపు డాశ్రితులుగూడ మంచివారె దొరకుదురు. దుర్లభముగు వస్తువులేయుండవు. అడిగినవస్తువులెల్ల నిచ్చుచు నెల్లపుడు విడువక కావలికాచుచున్న దేవతలఁగూడియున్న నవనిధులును పుణ్యమున నతని యింటనే పొడచూపినవి. అందుఁ బాండుకమను నిధి మినుములు. సెనగలు, అవిసెగింజలు, నువ్వులు, వ్రీహిధాన్యము. యవలు, శాలిధాన్యము, పెసలు, కొఱ్ఱలు మొదలగు తినుబండారముల నిచ్చుచుండెను, పింగళమనునిధి సుందరములగు కుండలములు, నుంగరములుఁ దారహారములు, మొలనూళ్ళు, మణులు, రత్నములు మొదలగుపెక్కునగ లిచ్చుచుండెను. కాలమనునిధి యాఱు ఋతువులయందును వృక్షములవలన, గుల్మముల వలన. లతలవలనదొరకు పూవులు, కాయలు. పండ్లు, చిగుళ్ళు మొదలైన విచ్చుచుండెను. శంఖనిధి చెవులకు సుఖప్రదములగు వాద్యముల నిచ్చుచుండెను. పద్మకమనునిధి చీని చీనాంబరములు. రత్నకంబళములు, పట్టుబట్టలు మొదలగు నానావిధవస్త్రజాతము నిచ్చుచుండెను. మహాకాళమను నిధి బంగారు. వెండి, రాగి మున్నగు లోహములవలనఁ జేయఁబడిన గృహోపకరణములగు పాత్రలనిచ్చు చుండెను. మాణవమను నిధి ప్రాసము, చక్రము, ముద్గరము, శక్తి, కత్తి, తోమరము, బాణములు

మొదలుగాఁగల యుద్ధోపకరణముల నిచ్చుచుండెను. నైసర్ప మనునిధి పఱుపులు, తలాడలు. ఒఱఁగులు మొదలగు శయనోపకరణముల నిచ్చుచుండెను. సర్వరత్నమను నిధి చిత్రవిచిత్రములగు రంగులుగల పెక్కురత్నముల నిచ్చుటయేకాక తక్కినరిధులిచ్చు వన్నింటినిఁగూడ నిచ్చుచుండెను. ఇంతమైశ్వర్యముకలవాఁడయినను నారాజకుమారున కిసుమంతయు గర్వములేక యుండెను. ఐశ్వర్యమదము లేకుండుటయేగదా మహానుభావులకుండవలసిన ప్రథమసుగుణము ! సమస్తబంధువులతోఁ గూడి యీ యజితసేనుఁ డానవనిధులను షోడశోపచారములతోఁ బూజించుచుండెను.

ఇట్లుండ నజితంజయనృపాలుఁడు శుభముహూర్తంబున సమస్తసామంత రాజులను బిలిపించి యీ యజితసేన కుమారునకుఁ బట్టాభిషేకముం గావించెను. ఆమహోత్సవకాలమునఁ దదభిషేకోదకముచే నొక్కభూతలమేకాదు, హర్షసముద్రముచే బాంధవుల మానసములుగూడ ముంచివేయఁబడెను. నిర్మలాంబరమై వికసితతారకమై యొక్క దిఙ్మండలమే కాక పురకాంతాసముదాయముగూడ మనోహరమయ్యెను. మంచిమంచి తావులు గుభాళించు నవకుసుమమాలికలు వెదజల్లు రాజులచే భూమియేకాక దేవతలచే నాకాశముగూడ నిండెను. ఈ మహోత్సవమునకు సంతసించు స్నేహితులయిండ్లేకాదు, ముందాపదలు కుడువఁబోవు శత్రువుల యిండ్లు గూడ * నుదిత కేతువులయ్యెను. వారకాంతల నృత్యగీతములచే భూతలమేకాక కిన్నరకాంతల నృత్యగీతములచే స్వర్గముగూడ నలంకరింపఁబడియెను. ఇంటిముంగటఁ దుంబురనారదాదులు గూడఁ గైవారము చేయసాగిరి. మృదువుగ జలము స్రవించుచుఁ బోవు వారియంత్రములచేతనే కాక జలాసారమును వర్షించు మేఘములచేతఁగూడ

---

* ఉదితకేతువు = జెండాలెత్తినవి. ఆశ్చర్యముగా జెండాలు కూల్పఁబడినవి (ఉ + దిత + కేతు, ఉ = ఆశ్చర్యము, దిత = ఖండితము, కేతు = జెండా)

రాజమార్గముల యందలి పరాగ మడఁపఁబడెను. మణిబంధముచే నొక్క సింహాసనమే కాక నమోఘాశీర్వచనములు చేయు పెద్దల మణిబంధములు గూడ భూషింపఁబడినవి. ఇట్లు పెద్దలచేతను దండ్రిచేతను పట్టాభిషిక్తుఁడై సూర్యకాంతి తగిలిన సూర్యకాంతమువలె మిగుల వెలిఁగెను. సమస్త ప్రజలను బిడ్డలవలెఁ బోషించుచు రాష్ట్రముఁ బాలించుకొనుచున్న యా కుమారభూపతియొద్ద కొకనాఁడు స్వయంప్రభుఁ డను జినేంద్రయోగి వచ్చిన నజితంజయ నృపాలుఁడు చక్రవర్తియగు కుమారునితోఁ గూడ నెదురేగి, తీర్థభూతుఁడగు నమ్మునీంద్రు షోడశోపచారములు చేసి సుఖాసీను గావించి, తలమీఁదచేతులొగ్గి "దేవా! జంతువు కర్మపాశములచే నెట్లు విముక్తుఁ డగునో యీసందేహ మెవ్వరినడిగినఁ దీఱకున్నది. నీవు నాయందుఁ గటాక్షింపవలయు" నని యడిగిన నామడదూరము వినఁబడు నట్లు తొట్రుపాటు లేకుండ నాతీర్థకరుం డిట్లనియెను. "ప్రమత్తుఁడును, విరక్తిలేనివాఁడును, కామక్రోధాదులతోఁగూడిన వాఁడును, సమమైనచూపు చూడనివాఁడును, గర్మబంధములకు లోఁబడును. ఎనిమిది భేదములు గలయీ కర్మబంధము లోహకాంతము లోహమునాకర్షించినట్లు చేతనమును స్వాధీనపఱచుకొని సంసార సముద్రములోఁ బడఁద్రోసి బహువిధయోనులఁ బుట్టించుచుఁ జంపుచుఁ దిప్పితిప్పి ఖల్వాట బిల్వీయముగాఁ దుట్టతుదకు మనుష్యజన్మ మెత్తించును. మనుష్యజన్మమెత్తియు, వాఁడు పుత్ర బాంధవ కళత్రాది మోహమునఁ బడి మరల నేదియో కుయోనియందుఁ బడఁగల కర్మము చేయునుగాని తరింపఁగల మార్గమును నేరఁడు. కావున సంసార దుఃఖమునకు జడియు బుద్ధిమంతులు కర్మబంధమును దెగఁగోయుటకై జ్ఞానము, దర్శనము, చరిత్రము నను నీతిత్రయము నాశ్రయింపవలయును. జ్ఞానమనగాఁ బరతత్త్వమును దెలిసికొనుటఁ; దర్శనమనఁగా జినమతమును బాగుగాఁ దెలిసికొని లోకములోని జనులయొక్క మతములన్నియుఁ దెలిసికొన సమస్త దేశములవెంట దిరుగుట; చరిత్ర మనఁ బాపకార్యములను నివర్తింపఁజేయు చరిత్రములను వినుట. ఈమూఁడును గలవాఁడు తప్పక కర్మపాశమును దెఁగగోసికొనఁగలఁడు. గ్రుడ్డివాఁడుఁ, గుంటివాఁడు

నేకీభవింపకకార్యము నెఱవేర్చుకొనలేని యట్లీమూఁడు నేకీభవించినఁగాని కార్యసాధకములుకావు. ఆగామిసంచిత ప్రారబ్ధకర్మములలోఁ జరిత్రమా గామికర్మమును, జ్ఞానము సంచితకర్మమును, దర్శనము ప్రారబ్ధకర్మమును నశింపఁజేయును. ఈ ప్రపంచకములోని నరుల సంసారక్షయమున కొక్క జ్ఞానమే చాలుననుట మూర్ఖుల సిద్ధాంతముగాని పండితుల మతము గాదు. సేవింపకుండ నౌషధము నెఱిఁగినంత మాత్రముచే రోగము పోవునా?" అని చెప్పిన స్వయంప్రభునివలన బంధ మోక్షములకుఁ గార ణము విని యజితంజయ నృపాలుఁడు తక్షణము విరక్తుఁడయ్యెను. భవి తవ్యత సత్పురుషుని శ్రేయస్సుకొఱకై త్వరపెట్టునుగదా! బంధువుల యందును, గొడుకునందును, భార్యయందును గల ప్రేమను విడనాడి శాంతుఁడై యావృద్ధరాజు దేహరక్షణకుఁ దగినపాటి బట్టలు గ్రహించి శ్రమణ సేవితమగు పదము నాశ్రయించెను. చక్రవర్తియు వాఙ్మన సశుద్ధిపూర్వకముగ జినేంద్రునకు ముమ్మాఱు నమస్కరించి యంతఃపుర మునకుఁ బోయెను. మఱికొంత కాలమునకు నీయజితసేనుఁడు పరాక్రమ శాలియగు సేనాపతితోఁగూడ దిగ్జయము చేయుటకై బయలుదేఱెను.

జైత్రయాత్రకుఁ బోవునపుడు, ప్రోవుచేసినఁ నురుఁగువలెఁ దెల్లనై యతని శిరముపైఁ బ్రకాశించు శ్వేతఛత్రమెండను బోఁగొట్టుట కను మిషచే సేవించుటకై వచ్చిన చంద్రమండలమో యనునట్లుండెను. త్రోవలో సేనకు వలసిన వస్తువులన్నియు నిచ్చుటకై పూర్వమందుఁ జెప్పిన నిధులన్నియు విచిత్ర రూపములతో బయలుదేఱినవి. సూర్యమండ లమునునిరోధించుచు బిట్టు తేగిన పరాగమునందు దిక్కులన్నియురాజు పన్నడుగునేమో యను భయమునఁ బోలె డాఁగినవి. ఈ సేనాపరాగము దూరము నందుండి కన్నులలోఁ బడకున్నను శత్రుస్త్రీల నయనంబుల నుండి నీళ్ళు జాఱుటమాత్రము విచిత్రముగా నున్నది. ఈ యజిత సేనుఁడు తన రాకవిని భయాక్రాంతులై రాజులంద ఱొదలలమీఁది చేతు లతోఁ గొనియాడుచుండ వారికభయ మిచ్చుచు సముద్రతటమునకుఁ

బోయి యచట విడిసినఁ బ్రభాస నృపాలుఁడు దివ్యరత్నములతోఁ బూజించెను. సత్యమాగధుఁడు "దేవా! సంతోషింపుము. దిక్కులనన్నిటిని జయింపుము. మమ్ము రక్షింపు" మనికొనియాడుచు నిజముగా మాగధుఁ డయ్యెను. మఱియు ద్వీపములందును సముద్రమునందును బెక్కుగనుల యందును జనించిన మనోహరములగు రత్నములను గానికగాఁ దెచ్చి యిచ్చెను. యిట్లు ప్రాక్పశ్చిమ దక్షిణ దిక్కులఁ గల రాజుల నందఱను గైవసము చేసికొని విజయార్ధమున వసించియున్న యాకాశ గమనము చేయఁగలమను గర్వముగల రాజులను జయించెను. ప్రభుమంత్రోత్సాహ శక్తులు మూఁటితోడను దిగ్విజయ మూర్జించుకొన్న యీయజిత సేనునకు విజయార్ధమును సాధించుట యొక చిత్రముకాదు. మేదినీచక్ర మంతయు నాక్రమించి యందుఁగల రత్నజాతము సమస్తమును సంపాదించుకొని క్రమక్రమ ప్రవర్ధమానుఁడై జీవదయాళుత్వము దాతృత్వము మున్నగు గుణముల కాకరమై షోడశమహారాజులకు మించిన ప్రతిష్ఠ నార్జించిన యీరాజునకుఁ బూర్వజన్మ సుకృతవశమునఁ దొంబదియాఱు సంవత్సరము లేకవిధముగాఁ గడచినవి. అతని యింటిముంగిలి యెల్ల యపుడు నెనుబదినాలుగు లక్షల యేనుఁగుల మదోదకముచేఁ బంకిలమై యుండెను. తరంగములచే సముద్రమువలె నాభూవరుని గుఱ్ఱపుసాల పదునెనిమిది కోట్ల గుఱ్ఱములచేఁ గోలాహలముగా నుండెను. శరత్కాల మేఘములచే దిక్కులు ప్రకాశించునట్లు మల్లిపూతేకులవంటి మూఁడు కోట్ల యావులచే నీతని గోశాల నిండియుండెను. పదియాఱువేల దేవత లాతని సర్వదా సేవించుచుండిరి. ఇట్లు జైత్రయాత్రఁగావించి మరలి భరత ఖండమున కేకచ్ఛత్రాధిపతి యను పేరితోఁ దనరాకఁ బ్రతీక్షించు బాంధవులయుఁ బ్రజలయు మనంబు లానందపఱుప నయోధ్యా పురముం బ్రవేశించెను. తమరాజేంద్రుఁడు పురప్రవేశము చేయుచున్నాఁడను సంతసమున నాపురమందలి ప్రజలందఱు ప్రతియింటికిఁ దోరణములు కట్టిరి, రంగవల్లిక లలంకరించిరి. పణ్యవీధి యంతయు విచిత్రతోరణ వస్త్రాలంకార ధ్వజములతోఁ గైసేసిరి. ఇట్లు సర్వాశృంగారితంబగు పురమందుఁ

ప్రవేశించుచున్న మదన సుందర విగ్రహుండగు నరపతిం జూచుటకై పరువెత్తు పురసుందరులకు శ్రోణిభారమునకుఁ దోడు కుచకుంభభారము గూడఁ గొంత ప్రతిబంధకమాయెను. రాజును జూచుటకై వేడుకపడు కందోయితోఁ బరువెత్తుచున్న యొక యువిదకుఁ బోకముడి విడిపోయి పిఱుఁదులనుండి దిగజాఱుచున్న తెల్లని కట్టుబట్టను జాఱకుండ నంటుకొనఁజేసిన చెమ్మటయే మానముఁ గాపాడెను. మఱియొక ముద్దుగుమ్మ గోడమీఁది చిత్తరువును జూచుచుఁ జూచుచు రాజు నాలోకించుటకై గవాక్షము నలంకరించి కొండొక చిత్తరువును మనోభిత్తికయందుఁ జిత్రించెను. మఱియొక తరుణీమణి పదిమంది నడుమకుంబోయి రాజునీక్షించుచున్న సమయంబునం గుచమధ్యమునం బొడము చెమటబిందువులు చూచి కోపించినవోయనఁ జిరకాలమునుండి యందున్న హారములోని ముత్యములు తెగి నేలమీఁదఁబడి దొరలసాగెను. తడితడి లత్తుక యధరోష్ఠము పయిం బూసికొని వడి వడిఁ బుడమి తేం జూడఁబోవు నింకొక పడఁతిమిన్న లోన నిముడని తదాలోకానురాగమును బయికిఁ గ్రక్కుచున్నదో యనునట్లుండెను. వేఱొక విలాసిని రాజదర్శనమునంజేసి యొదలుప్పొంగ నంతరంగములోనికిం జొరఁబాఱుపూవింటి వానికిందోరణము కట్టుచున్నదో యనునట్లు రెండుచేతుల వ్రేళ్ళు గీలించి నెత్తిపై నిడుకొని యావులించెను. ఒకకంటికిమాత్రము కాటుక బెట్టుకొని రెండవకంటికి లేకుండఁగనే రాజుంజూడవచ్చిన యింకొకకాంత జనుల నానందింపఁ జేయుటకై యర్ధనారీశ్వర వేషము వేసినట్లుండెను. పులకరించి యొడ లుప్పొంగుటచే బిగిసిముడివిడిపోయిన కట్టుబట్ట జాఱిపోకుండఁ జేయుచున్న మొలనూలిపై నొకకాంతకుఁ గోపంబును దయయుఁ గూడవచ్చెను. ఈఁతకల్లువలె నొడలు మఱపించుచు, సంస్కార నాశమువలెఁ బిచ్చిపిచ్చి కేకలు వేయించుచు, వాయుదేవునిపగిది దేహభంగము గావించుచు మదనుండాడింప నాయాఁడువాం డ్రిందఱుఁ బెక్కువిధముల నారాజుం గాంచి వికారమగ్నులైరి. రాజేంద్రుఁడును మెఱుఁగు దీఁగలఁబోలు నచ్చిగురుబోఁడుల నివాసములను జూచుచుండియు మనోవైకల్యము లేనివాఁడై

యారతు లెత్తుకొని నిలువఁబడియున్న ముత్తైదువులచే సంకులంబగు మందిర ద్వార ప్రదేశముఁ బ్రవేశించి యచట వారిచే నివాళింపఁబడి భగవనాంగణముఁ జొచ్చి యచ్చోట ముసలమ్మలచే నొసఁగఁబడు మంగళాశీరక్షతలు శిరసా ధరించుచు గురుజనములకు నమస్కరించుచు నత్యున్నతుఁడయ్యు నతి వినమ్రుఁడై పరివారజనమున కాజ్ఞయొసఁగి యా పేయి గడిపి మఱునాఁటి నుండి దివ్యాకారములుగల కాంతలతో సమస్త భోగము లనుభవించుచు శత్రురాజులకు రాజ్యభ్రంశము చేయుచుఁ దన రాజ్యమును నిష్కంటముగఁ బరిపాలించు చుండెను.

ఇది సప్తమ సర్గము

---

## అష్టమసర్గము

★

ఇట్లు సుగుణసంపత్తిచేఁ బ్రజలనెల్లఁ గైవసము చేసికొని యజిత సేన నృపాలుఁడు పుడమి శాసించుచుండ మధుపానము చేయు తుమ్మెద లను సంతోషపఱచు వసంతఋతువు చనుదెంచెను. తరుణీ విరహముచేఁ గుందు విరహవంతులు కన్నీరు గాఱు తమ రమణీయ లోచనములతోఁ గ్రొత్త మొగ్గలచాఁటున డాఁగి మంజులగానము చేయు తుమ్మెదలను జూడలేకపోయిరి. చంపక పుష్పములనుండి కామమును వృద్ధిచేయుచిన్ని పుప్పొడి పడుచుండఁ దెరువరు లవశమైన చిత్తములతో దేవతాస్త్రీని దలఁచికొనినట్లు మనోహరమగు నందెల చప్పుడు గల భార్యను స్మరింపఁ జొచ్చిరి. కలిపురుషులవలె నల్లనైన తుమ్మెదలను మోయుచున్న నాగ కేసరపుఁ గలికలు భర్త యింటలేని వనితలకుమన్మథోద్దీపకము లయి నవి. పద్మమను పేరుగల పూవుల నదల్చుచు, నానామరందముల గ్రోలు చున్న భృంగపంక్తియు, మనోహరముగఁ గూయుచున్న కోకిలలును విర హిణీకాంతల మనములను మొదలంటఁ బీడించినవి. మొగ్గదొడిగినతిల్వ్య

మామిడి చెట్టును జూచి తియ్యవింటి పూవుటంపగములచే వికావికలైన చిత్తముతో భర్తతోఁ గ్రీడింపని కాంతయేలేదు. పల్లవ జాలమును నృత్యముఁ జేయించుచుఁ, గమలవదనలగు కాంతాజనమును మగలయిండ్ల కంపించుచు నుపవనంబుల నుండిచల్లని మందమారుతము వీవసా గెను. 'నీవు పొరుగూర నుంటివికదా! తాపకారియగు గోరంటపూవు గుత్తిని వంచి నీభార్యచేతి కందిచ్చువారెవరు' అని పాంథులను గూకలిడు చున్నటులఁ గోకిలలు గూయసాగెను. మొదట భర్తలతోఁ బ్రణయకల హము తెచ్చిపెట్టుకొని పిదపఁ దద్విరహమును సహింపఁజాలక వందుచు చున్న వెలందులను జూతపరాగముచే శబలితంబులగు వాతపోతంబులు మఱింత బాధింపఁజొచ్చెను. పూవుగుత్తులనుండి జాఱు మకరందముద్రావి సొక్కుచుఁ గర్ణమధురమ్ముగ జుమ్మని పాడుచున్న తుమ్మెద ద్రిమ్మ రీఁడువలనఁ బాంథులకు మనోహరమగు పదార్థమ్ము లన్నియు విష ప్రాయములయ్యెను. చూడనింపుగఁ బుష్పించిన చెట్లు చూచినంతఁ దపో నిష్ఠగల యతీంద్రుల చిత్తములందుఁ గూడ మనోజుం డుదయించెను. "చెలియా! కోపింపకుము. వాఁడు కేవలము మాయకాఁడు. నీకుదాఁచిన ఫలమేమి? వానివలనఁ గృశించిన యీశరీర మెన్నడును బలియదు. నాయందు వాని కనురాగము లేశమైన లేదు. దానివలన నాడెందముడుకు చున్నది. అతనికొక నమస్కారము. ఆపరస్త్రీ కాముకువివలన నాకు వంత తీరునని తలంపకుము. దురాత్ముఁడై నన్ను లేనిపోని బెడిదములాడె. పైవారిచే నాడించె. వానితోనా, నేను మఱలఁ బ్రణయము గావించుట! చాలుఁజాలు, నాకాసుఖ మక్కఱలేదు. గౌరవము పోఁగొట్టుకొనకుండ నిట్లు బ్రతుకుటయే మంచిది. తప్తమైన యీదేహమునకుఁ జందురుఁడు గాని, మంచిగందముగాని చల్లఁదనము నీయకున్నారు. ఐనను నాకపకారి యగు వానియెడల నమ్మకములేదు. వానియింటికిరాను" అని మత్త హస్తినివలె పెక్కుమంది దూతికలను నిరాకరించిన మానినిఁగూడ నీ మధుమాస మొక్కతుత్రిటిలో భర్తకులోపఱచెను. "పూర్ణచంద్రుని మూర్తి వలె సజ్జనుల కెల్లరకు మంచిదానవగు నీవంటిదానవు తొల్లింటి లగ్నల

వలన నాకుఁ జెలికత్తెవైతివి కావున నీవుపోయి వలపు గలిగింపఁగలఁగల సమయోచితములగు తియ్యని పల్కులచే నతనికి దయ పుట్టించుము. కోపశీలురకుఁగూడ ననుగ్రహము కలుగఁజేయఁజాలినవి సామవచనము లేగాని రెండవయవికావు. నీకు దాసానుదాసురాల నయ్యెద. నాదేంహము సురతకామియై యుడుకుచున్నది. కావున నావల్లభుని రప్పింపుము. ఈపని యందు నీకంటె నేర్పరులులేరు. మొదలేడ్చుచున్న నన్ను మఱింత యేడ్పించుటకై యీవసంత ఋతువుగూడ దాపరించినది. నీవేలాగున నైన నీ సుకృతముఁ గట్టుకొనుము. నామగనినన్నుఁ గలుపుము" అని యొక కువలయలోచన భర్తపొందుఁ గోరి దూతికను బతిమాలజొచ్చెను. కాముకుల మానప్రాణములు దూతికల చేతులలో నుండును గదా! వెయ్యేల, పూవింటి బోయవాని యమ్ములచే గాయమ్ములు చెందని కొమ్మ లును, బొరుగూరి యందున్న మగనిఁదలఁపని చెలువలును లేరైరి. ఆహా! మధుమాసప్రభావము! అనుంగుకాంతతోఁ గూడఁ గలసిమెలసి వర్తించు కాములుల చిఱునవ్వులతోపాటు పొగడ బొగడలు కూడ వెల్లివిరిసి యెల్లర కుల్లాసంబు సమకూర్పసాగెను. మెఱపుఁదీఁగలఁబోలు కాంచనార కుసుమంబుల యందలి మరందమానుచు మంద మందముగాఁ గూయుచున్న తుమ్మెదలను జూచిన సమ్మోదము లేనివారెవరు!

"నీతిమంతుఁడా! నీయెడఁబాటువలని వలవంతచే మలినంబగు మాచెలి మనఃకమలము చేతనే చిలుకతేజీదొర మాచెలిని బీడించుచుండఁ బద్మవిరోధియగు చంద్రికిరణ సముదాయము గూడఁ బీడించుచున్నది. మంచువడి యేపుమాసిన శీతకాలము నాఁటి తమ్మితీవ పగిది దేహపరి త్యాగమునకు సిద్ధముగానున్న యబలను గాపాడవేని నీవెట్లు గుణశాలి వనిపించుకొందువు? కాపాడినఁ గాపాడుము. లేదా తిలోదకము విడు వుము. నీవు లేనివేళల రాత్రులందు ధైర్యస్థైర్యములతో మాచెలువ (1) యంతర్గృహమునఁ బ్రవేశించిన (2) మదనశరచోరుని నీవు వచ్చి

1. అంతర్గృహము = మనస్సను యిల్లు. 2. మదనశరచోరుని =

పాఱఁదోలవేని నిజముగాఁ దదధీనమగును గావున రమ్మా. కఠినహృదయము మెత్తపఱపుము. దయితను సంతోష పఱచుము. విరహబాధ సహింపఁజాలదు. ఆబాధ నివారింపఁ జేయఁగల రహస్యము నీవకానియన్యు లెఱుఁగరు" అని దాసివలికిన సరసోక్తులకు మనమునందలి పొలయలుక వదలి యొకకాముకుఁడు దయితా గృహంబునకు దయచేసెను. గంధగుణము లేక యందము మాత్రము కలిగియున్న కొండగోఁగుపూవు విధవల యౌవనమును స్మరింపఁజేయు చుండెను. బ్రహ్మదేవునకు సృష్టిచేయుట యందున్నంత తెలివి యనురూపవస్తు సంఘటనయందు లేదు. సౌందర్యమునకు బరమావధియు, వృక్షమాల యనుకామినికి వాతెఱయు నగు మోదుగు పూవుచేత నీవసంత ఋతువునకుఁ గత్తిపూవుఁ జెందుటవలన వినుమున కుంబోలె మిగుల బ్రతిష్ఠ వచ్చెను శ్రావ్యముగ భ్రమరాంగనలు సంగీతము పాడఁ బుప్పొడివలనఁ (3) బాంసులత బయట పఱచుకొనుచున్న తీవ వెలయాండ్రను నర్తకునివలె మలయవాయు వాడింపసాగెను. (4) అశోకబలము గల మదనుఁడు విరహిజనుల నెల్ల మృత్యుగ్రహము వోలె గ్రసించుచుండ వారి కంత్యకాలమందుఁ గూడఁ బ్రమవాస్మరణమే నారాయణ స్మరణ మయ్యెను. వసంతఋతువు వచ్చినదాఁకఁ బరమోత్సాహముతోనున్న విరహిణీజనమెంతయు సుఖమునకు దూరమయ్యెను. "చెలియా! శోక సముద్రమును మఱింత పొంగించు రోదనముమానుము. ధైర్య మవలంబింపుము. ధీరుల కిడుమలు రావని పెద్దలందురు. కంటికిని, జెవులకును విందుచేయు క్రొవ్విరుచులచేఁ గలకలలాడు వసంత ఋతువు నీ కాయురవధికాలముగా విధాత తలఁచి యుండఁడు. విప్రయోగముచేఁ జిక్కిన భార్యలకు సంతోష ప్రదమగు దెందముతో నుండఁ దేని యతఁడుమాత్రి మీ యామనిలో బ్రతుకఁగలఁడా? కష్టపడి జననీ జనకులచేతను బిదప నీచేతను బెంచఁబడిన యీనెమ్మెనిపైఁ జాలకఁ

---

మన్మథబాణములను దొంగను, 3. పాంసులత = బూడెదచే బ్రుంగుట, అంకుతనము, 4. అశోకబలము = అశోకవృక్షముల బలము, దుఃఖము లేని సైన్యము.

దనముఁ జూపకుము. నేటనో, యెల్లియో నీపెనిమిటి వచ్చును. రాక యతఁడు మాత్రము విరహమెట్లు సహింపఁగలఁడు." అనిప్రియవియోగ ముచేఁ జానుంకించు నొక పంకజాక్షి కొక దూతిక బోధింపసాగెను. "చెలియా! మల్లితీవలు నీపైఁ దుమ్మెదచాలను నెపమున బొమలు ముడి వేయుచున్నవికదా! నేను నీకు దాసుఁడనైనచో నివి యేమి చేయగలవు? దాశ్యమే చేయవలయును నాపిఱికి గుండె నీకుఁగోపము వచ్చినదిమొదలు నన్ను మఱింత బెదరించుచున్నది. ఇదిగో! నమస్కరించు చున్నాను. పాదదాసుఁడను నీకోపమునకుఁ బాత్రుఁడ గాఁజాలను. ఆకసమువలె ననంతమగు లావణ్యమందు నీముఖారవిందము మున్గిఁయున్నది. అవి కానక తుమ్మెదవలెనే గతాగతము లాచరించు చున్నాను. మదనునికుటిల వృత్తి తలంచిన నామది మఱింత భెదరుచున్నది. కోపము తగ్గించుము. ఓ పీవరస్తనీ! నాయందు దయంజూపుము." అని జాలిపుట్టించు పలు కులచే నొక నేర్పరి మానవతియగు దయితను స్వాధీనపఱచుకొని రమించెను. రసముట్టిపడు పండితుల వచన రచనలకుఁ గరఁగనిడెందము లుండవు. చంద్రబింబమువోలెఁ దెల్లనై పాఱు నదులతోఁ గుబేరునకు గాఁపురమైన దిక్కునందుఁ జిలువగుంపులను దాఁచినట్లు గుహాలయం దంధకారమును గూడ దాఁచిన హిమవత్పర్వతము వైపున కంధకారాతి యగు సూర్యుఁడు ప్రయాణ మయ్యెను. వికసించిన పూవులమీఁద వ్రాలి నంతనే తుమ్మెదలను దమలో నైక్యముఁ బొందఁజేసికొనుచు నువ్వుల రాసులవలె నొప్పుచున్న తిలకవృక్షములు చూచినవారికిఁ గామాంధకారము ప్రబలుట చిత్రముకాదు. అఁడుతుమ్మెదలతోఁ గూడఁ బద్మలతయందలి యాసవము గ్రోలికొ్రలి యొడలెఱుఁగక రొదసేయు మగతేఁటులను గాంచిన తెరువరులకు నోటమాటలు రాకుండుట యబ్బురము కాదు. చల్లఁ దనము కొఱకు నీటముంచి విసరుకొనుచున్న వీవనల గాలియే చన్నీళ్ళను వేన్నీళ్ళనుగాఁ జేయుచున్న కాలమున విరహతాప జ్వరమున బ్రింగు శృంగారవతు లెట్లు బ్రతుకుదురు? ఏమూలఁ జూచిన గడుంగోయిల పాటలును, నేవంకఁ జూచిన లతాతలోదరుల యాటలును, నేదెసఁజూచినఁ

జంచరీకంబుల యార్భటులును, పరిక్కఁ జూచిన నేలరాలిన తుంట విల్కాని విరితూపులును గల యీ వసంతకాలంబున నజితంజయ నృపాలుఁడొకనాఁ డంతఃపురంబున నంకగత యగు శశిప్రభతో "నోదేవీ! వింటివా! తిలకశోభయుఁ, బత్రరచనయుఁ గలుగుటఁ జేసి యువతీమణి ననుకరించుచున్న యుపవనలక్ష్మినిఁ జూడరమ్మని వసంతుండు చంచరీక ధ్వని నెపంబున మనలం బిల్చుచున్నాఁడు. అతనిమాట నిరాకరింపరాదు. అతఁడు మదనునకుఁ జుట్టమగుటచేత మనకును జుట్టమే. ఆతని బంటు పలిగాలి చక్కఁగాఁ దీవపూవుంబోఁడుల నాడించును. భ్రమరాంగనలచేఁ బాడించును. తిరోహితలై యున్న వనదేవతలు గూడ నినుఁజూతురు. అచట మనయెదుట నెమిలి పురివిప్పి యాడుచున్నపుడు మాత్రమో తరుణీ! నీకొప్పు చీరకొంగున మాటుపఱచు కోవలయుఁ జుమా! లేదేని నదిసిగ్గుపడి పాఱిపోవునేమో; లేమావి చిగురులు మెసవుటంజేసి కుత్తుకలకు జీరలు తెగి మనోహర మ్ముగఁ బంచమ స్వరము గుమ్మరించు కోయిలలుగూడ నీవు మాటలాడుచున్నపుడు నీపలుకుల యందలియందము నేర్చుకొనునవియుం బోలె మూగలై యుండును. నీపాద ప్రహారము వలన నామూలాగ్రము ననిచిన యశోక భూజమ్ముం జూచినపుడు శరీరమంతయుఁ గాకరకాయవలెఁ బులకరించిన నేనుఁగూడ దానితో సమానుఁడ నగుదును. ప్రియుఁడొకండు నశోకవృక్ష మొకటియుఁ గదా కాంతలచేఁ దన్నులు పడువారు. మందమందముగా నందముగా నడచు నీనడకలుగాంచి బిగుడుబావుల యందుండు రాయంచ లోచంచలాక్షి! నీకంతేవాసులై యందలి మర్మముఁ దెలిపినదాఁక నిన్ను వదలవని తలఁచెదను. క్రొంబగడము వంటి నీపాతెఱఁజూచి కంకేళి చిగురని భ్రమపడి మిళిందము తదీయ మకరంద మానఁబోవునపుడు మాటిమాటికి భయకంపితాంగివై నీవు కరాగ్రమునఁ దొలఁగించు చుండుటఁ జూచిన నోసుందరీ! యెవ్వఁడు నవ్వకుండును? వేవెలుంగుల దొర వెలుఁగైనఁ జొరకుండునటుల నల్లిబిల్లిగ నల్లుకొనిన యీపాలు తూఱునపు దోతరుణీ! నీముఖచంద్రికాంతి సహాయమైయుండఁగటికచీఁకటి మ మ్మేమిచేయఁగలదు? వనవిహారము చేయ

లేని నీచెలులందఱికిని మహారులవంటి నీచూపులును దీపలవంటి నీ యొడలును కదళీస్తంభములవంటి నీతొడలును, దొండపండువంటి నీ పెదవియుఁ, జిగురుటాకులవంటి నీ చేతులును, మెట్టదామరలవంటి నీ యడుగులును వనమంతయుఁ దిరిగిచూడని లోపము దీర్పఁగలదు." అని మధురోక్తులచే సంతోషపఱచి వనవిహారము గావించుటకై పోవుచున్నా మని యంచులకుఁ దగినవారికిఁ దెలిపి ప్రయాణమైనపుడు ప్రయోగించిన మంగళవాద్యముల మ్రోఁత ప్రతిగర్జంబుల ఘీంకారమని భ్రమసిన దిగ్గజంబులకుఁ గోపంబును పయోదగర్జితమని భ్రాంతిపడునెమ్మల కానందంబును గలుగఁ జేయుచుఁ బాములచేఁ బడగలెత్తించుచు గిరికందరంబు లనుప్రించుచు నల్దిక్కులకు వ్యాపించెను.

ఇది అష్టమసర్గము

—:o:—

## నవమ సర్గము

★

వసంతునిచేఁ గైసేయఁబడిన కోకిలానాదిని యగు నుపవన సంపదను గాంతనుబోలెఁ జూచుటకై వెడలిన యాయజితంజయ నరేంద్రునితోఁ గూడ వనవిహారముఁ గావించుటకై వనభూములపరె లలితఘన తమాలకలును, సుందరద్విజ సుభగలును, తిలకాహితోష శోభలు నగు వెలందులుకూడ బయలుదేఱిరి. గలగలలాడు మొలనూలి మ్రోఁతలను కరించు రాయంచలయందును, దమతోఁ దుల్యముగ నడచుచున్నవను సంతసంబున రాజహంసంబులను జూచుకొంతల యందును బడుచువాండ్రి దృష్టి పఱవసాగెను. మృదుగమనము గల హంసలకంటెను, మందగమనముగల కరిపోతములకంటెను వ్యతిరేకముఁ దెలుపు నలసగమనంబుల నాకామినులకు వారి నితంబభారమే నేర్పెను. చంచలంబులగు తెఱవల నయనాంచలంబులచే రెండువైపుల నిండిన యాకసము నల్లకల్వల చెఱువుపలె

నుండెను. "ఓముగుదా! ప్రియాసపడి యేల మొగమునం దగురుచుక్క నెలకొల్పెదవు? నీమొగము తామరపూవని యాశపడి వ్రాలు తేఁటియే తిలకమగుచున్నది. ఏల బరువు? చన్నులమీఁది ముత్యాలహారముఁగూడ దీయుము. చెమ్మటబిందువులే నీకాయందముఁ జెప్పుచున్నవి. ఆకర్ణాంతములయిన వెడఁదకన్నులుండ మరలఁ జెవులందు నల్లకల్వ లెందులకు? సహజాభరణంబులగు నీపాదంబులకుఁ గ్రిమ్మఱ లత్తుకపూఁత యేటికి" అని దారినడుమ నొకలికయుసేఁత సేసికొను ప్రియురాలితోఁ ద్వరగ నడచుటకై ప్రియుఁడు బోధించుచున్నను దానికచకుచజఘనభారము మాత్రము వేగిరముగ నడువనీదాయెను. "ఒకసారి నీ కపరాధముఁ గావించినందులకు నీవుకోపగించి మాటాడకుండుటయే శిక్ష. నేనెన్నఁడు నటువంటి యపరాధముఁజేయనని నీవల్లభుఁడు ప్రమాణము సేయుచున్నాఁడు. అదియునుంగాక నీయందుఁ బక్షపాతము గల మదనుఁడు గూడ వానిని వేధించుచున్నాఁడు. తప్పుఁజేసిన పురుషునకుఁ బ్రభువువలన శిక్షింపఁబడుదాఁక బుద్ధిరాదుకదా! నెమ్మేను కృశింపఁజేయుచున్న ప్రియవియోగము నీవు మాత్రము సైఁపగలవా! ఆబింకమెంతకాలము నిలుచును? వెచ్చని నిట్టూర్పువాయువులే నీమనోవ్యాధిం దెలుపుచున్నవి. సర్వదా చిత్తమొకతీరుగా నుండదు. నీవుతేలికపడవలసినవు డతఁడు విఱ్ఱవీగును. మర్యాదనిలుపుకొనుము" అని తియ్యని మంచిమాటలచే నొకదూతిక యొక మానవతిని బతితోఁగలిపెను. ఒకవిటుఁడు మదనవికారమున నొడలెఱుంగక భార్యభుజముమీఁదనుండి రానిచ్చిన చేతితోఁ గుచాగ్రముఁ బట్టుకొని మత్తదంతివలె మెల్లమెల్లగ నడిపించుచు నడువసాగెను. ఇంకొక భుజంగుఁడు మదనాటోపమునఁ జేసి యమరు పడఁతి నుందొడలను దాటినడకమెయిఁగలిగిన యలసట దీర్పు నెపంబునఁ నడుమనడుమఁ బిసుకఁదొడఁగెను. ఈవగిదిఁ బౌరులందఱు నానావిధ వికృతచర్యలతో భార్యలతోఁ గూడ ముందు తమయొడయఁడు పడఁతులతోఁ బ్రవేశించిన యుపవనముఁ జొచ్చిరి. కొమ్మ లందఱుఁ జేతులతో గొమ్మలదల్చుచు నేలరాలిన విరులు ప్రోవు చేయుచుఁ జేతిగోరుల మిసిమిచే నాకులన్నియు నెఱ్ఱఁబాఱినను మెత్త

దనమువలనఁ జిగురుటాకులు గుర్తించి కోయుచు విహరించిరి. మిక్కుటమగు వలపుననొక యరవిందలోచనకు మగనిచే గర్ణమునం దలంకరింపఁబడిన యశోకపల్లవముగూడ దాని సవతికి శోకముఁ గలుగఁజేసెను. చేతి కందు కొమ్మలవింత ననిచిన వృక్షము లుండఁగా నొక మృగాక్షి దాని మగఁడు నిక్కుచనులు భుజమూలములును జక్కఁగాఁ జూచుట కభిలాషపడి చేతికందీయందని కొమ్మలుగల చెట్టుపూవులు కోయుమని పురి కొల్పెను. మున్ను పేరునకుమాత్రము తిలకము లనిపించుకొను పూవులిపు డబలాజనముచే శిరసాధరింపఁబడి సార్థకనామమును వహించెను. "చెలీ! బంగారు రంగుగల నీచన్నులపై సంపంగి పూవులమాల రాణింపకున్నదిసుమా" అని పలుకు నెపంబున నొకఁ డొక మృగాక్షి కుచములంటుచుఁ బొగడపూవులదండ యొకటి యం దలంకరించెను. రాచేందుప్రియుఁడును గొంతతడవు కిసలయపాణులతోఁ గూడఁ గుసుమాపచయ వినోదంబునఁ గాలముగడపి యాయలసట వాయుటకై జలక్రీడకుఁ దగిన పుట్టంబులతో శృంగార తటాకమునం దోలలాడుటకై దిగెను. పిదపసతని పరివారముగూడ మోకాలి బంటినీటికే భయంపడు వయస్యలఁ బెట్టాపట్టంబులతో మెల్లమెల్ల నడిపించుచు బొమ్మబంటి లోఁతునకుం దీసికొనిపోయిరి.

కుంభస్థలములచే నీరుముందఱికిఁ ద్రోయుచు నడచు నాడయేనుఁగులవలెఁ గుచకుంభములచే నీరు త్రోసికొనుచుఁ బోవుభామలాం గుల ముఖ ప్రతిబింబములను జూచి పద్మము లనుకొని మూఁగు తుమ్మెదల పరిశ్రమమంతయు వ్యర్థమయ్యెను. మద్యపానము చేయువారు చేసిన కార్యము లేవియు ఫలింపవుగదా? ఒకసుందరి తన భుజములతో సమానములగు తూండ్లను, దన క్రీగంటి చూపులతోఁ దుల్యంబులగు చఞ్చరీక భ్రమరంబులును గల యొక సన్నని తామరతీఁగం జూచి కృశాంగియగు చెలికత్తియ యనుకొని కౌఁగిలించుకొనెను. ఇంకొక లజ్జావతి యలఁ యలజడి మాడిపోయిన కట్టుఁజీర వెతకులాడుచు వస్త్రవిహీనమగు జఘ

నము ప్రియుని కంటఁ బడకుండ నీరు కలచివైచెను. బొడ్డులోఁతు నీటిలోఁ నీదులాడుచున్న మఱియొక తలోదరి మునుఁగకుండఁ జనుకుంభతతే సాధనములయ్యెను. 'ఓప్రియసఖీ! నీనడకసొగసు నేర్చుకొనుటకుంగాఁబోలు రాజహంసి యిసుము తిప్పలమీఁద గతాగతము లాచరించుచున్నది. చూచితివా, ఓసుకేశీ! అసభిముఖియగు పెట్టంజూచి మృదూక్తులచే బతిమాలుచున్న జక్కవ పిట్టంజూచిన నాకుఁగూడఁ గుపితవగు నిన్ను బతిమాలుకొను నేర్పలవాటగుచున్నది. ఈబేడిసలు తమ యందమంతయునీవిలోచనము లపహరించినవను కోపముచే నెగిరిపడుచుఁ బుల్కుపుల్కున జూచుచున్నవిసుమా!' అనుచు నొకనేర్పరి కోపనయగు తన పూపజవరాలి ననేకరీతుల నుబ్బించుచు బుజము చుట్టిరానిచ్చిన కరంబునం గరంబబ్బ సూచించు గబ్బిగుబ్బల నుపలాలించెను. ఒక ధూర్తుఁడు "ఈపద్మము మిగులఁ జక్కనిది" అని కొనియాడుచుఁ దన్ముందఱుఁ బద్మమని భ్రమసినాఁడు కాబోలునని యనుకొనినట్లు చంద్రానన యగు నొకననబోఁడిని ముద్దుపెట్టుకొనియెను. ఒకలతాంగి సవతి కుచములమీఁదరాలిన పుప్పొడి నలుసులు చూచి నఖక్షతము లనుకొనిమగని చుఱుకుచుఱుకునఁ జూడసాగెను. కాంతాధరముల యందలి లత్తుకచే రాగము వహించిన జలము మరలఁ గాంతా హృదయముల కనురాగ మాపాదించి యప్పుదీర్చుకొనియెను. కఠినకుచములచేఁ దునకతునకలుగాఁ జేయఁబడియుఁ జపలంబులగు తరంగములా కురంగాక్షుల కుచములమీఁదనే పడఁజొచ్చెను. పెద్దపెద్ద పండితులే యండజయానలం జూచి వ్యామోహ పడుచుండఁ జపలచిత్తు లట్లగుటయబ్బురముకాదు. మగలను వంచించుటకై కొందఱు మృగాక్షులు కొంతకాలము నీటమునిఁగినను వారి మేనివాసనకై మూఁగు తుమ్మెదలు మాత్రము వారినే వంచించుచుండెను. 'నీతారుణ్యజలమునందే నే ననుదినముఁ గ్రీడించుచున్నా, నిఁక నాకు వేఱ జలక్రీడ యేల" యని యొకఁ డొకకామినికి జలక్రీడ మాన్పించెను. శిరోరుహములు లాగియు, నితంబములమీఁది కెక్కియు, నురంబులు మర్దించియుఁ దరంగము లాకాంతలయెడల భుజంగవ్యాపారముఁ జూపింపసాగెను

తామరతూఁటితో నీరు పీల్చి యుమి మరలఁ బ్రియునిమొగముపైఁ జి కుమియుచున్న యొక యన్నులమిన్న తనమొగమునం దతిశయించి యున్న తారుణ్యరసమును భర్తకొసఁగుచున్నట్లగపడెను. ఒకవిలాసి సలిలాంజలిచే నొక ప్రియురాలి కుచయుగముం దడుపునంతలో రెండవ ప్రియురాలి కుచద్వంద్వమును దానికన్నీరే తడిపెను. ఒకకాంత కొప్పు నుండి జాఱినవిరులచే జలముతారకితంబగు గగనంబు మాదిరిఁ బ్రకా శింప దానిమొగమే నడుమఁ జంద్రునివలెఁ బ్రకాశించెను. ఈప్రకారముగ జలక్రీడఁ గావించి యలసిన కొందఱు పూఁబోఁడులు తమ జఘనంబుల కెనయగు పులినప్రదేశంబులకుం జేరిరి. మఱికొంద ఱంగనలు జలక్రీడ యందలి తనివితీఱక యోలలాడుచుఁ గ్రమక్రమముగ నొడ్డెక్కిరి. చిర కాలమునుండి స్తనజఘనాది ప్రదేశముల నంటియున్నను మనల నింకఁ బరిత్యజింతురు: కాఁబోలునను దుఃఖమునం గన్నీ రోడ్చుచున్నవోయనఁ గాంతాధృతంబులగు తడిబట్టలనుండి నీరధారలోడ సాగెను. పిదప రాజేంద్రుండు తన భార్యతోడను సపరివారంబగు పరివారముతోడను శుచివస్త్రంబులు ధరించి యన్నపానాదికృత్యములు నిర్వర్తించి విశ్రాంతికై యుద్యానవనమునందలి పూవుటీరములచెంతకుఁ జేయనంతలో రవియు దూరతారాధ్వగమనము సేసెనయలసటఁ దీర్చుకొనుటకుఁబోలెఁ బశ్చిమాద్రి కూటంబుల నాశ్రయింపఁ బోయెను.

ఇది నవమసర్గము

---

## దశమసర్గము

*

ప్రియసాంగత్యమునకై వేగిరపడుచున్న కాంతల క్రీగంటిచూపుఁ దూపులకు లోనైనవాఁడుంబోలె రక్తమువికి యొఱ్ఱపడిన మేనితోఁ దేజంబు వాసి యస్తాద్రికిఁ జేరిన యినుఁడు మనుజులకే కాదు దేవతలకుఁ గూడ

నభ్యుదయములు శాశ్వతములుగావని సూచించెను. వసుహీనుఁడైనను బతి యింటికివచ్చుచున్నాఁడను సంతసమునం బోలెఁ బతివ్రతయగు పశ్చిమ దిక్కు తనయొడలినిండఁ గుంకుమ నలంకరించుకొనినదో యన సాయం సంధ్య రంజిల్లెను. తమ జీవితమంతయుఁ బరుల యుపకారమునకై కడపు మహానుభావులు విపద్దశయందుఁగూడ నొరులచేఁ బూజింప బడుదు రను మాట నిక్కంబుగాఁ దేజోహీనుఁడై తనచెనకువచ్చిన లోకబాంధవు నస్తాద్రి శిరసావహించెను. మలినంబగు తమము జగంబుల నాక్రమించుట చూడఁజాలక యసమర్థుఁడై సూర్యుఁ డస్తాద్రిచాటునకు లేచి పోవుటచూడ దైవబలమే బలముగాని బుద్ధియుఁ బౌరుషంబును మనుజులకుఁ గార్యకారులు కావనుటయు గుణవంతులకు దుర్దశ తటస్థించినపుడు గుణహీనులే ప్రబలులగుదురనియుఁ దెల్లమయ్యెను. గగనమణియగు దిననాథుఁడు కృంగిన పిదప మలినంబగు చీఁకటిచే గగనమంతయు వ్యాప్తమయ్యెను, పక్షులన్నియు నఱచుచుఁ దమతమ కులాయకులంబుల లోపలం డాఁగఁ జొచ్చె. దుర్జనులకు భీతిల్లిన కులకాంతలవలె దిక్కు లదృశ్యమయ్యె. రవి యను పెనుదివ్వె భువనభవనంబున వెలిఁగివెలిఁగి-యారిపోయిన పిదప దానిపొగచేఁ బొగచూరినగతి నల్లనియాకసము బయల్పడెను, సూర్యునితోఁ జెలిమి చేసినంతకాలము జగములు శుచిత్వముఁ జెందుటయుఁ జీఁకటితో సావాసము చేకూరినంత నల్లఁబడుటయుఁ గనుఁగొన సుజనదుర్జనస్నేహముల ప్రభావము ప్రజలందఱకుం దేటపడియె. తన ప్రభువుచేత మహోన్నతదశ ననుభవించిన వాసరముగూడ ప్రభువుతోనే యస్తమించెను. స్వభావనిర్మలులగు పురుషులు ప్రాణత్యాగమైనఁ గావింతురుగాని చేసినమేలు మఱవరుగదా! సూర్యాశ్రయము వోయిన వెంటనే పంకజాతములకు శోభతగ్గెను. మంచిప్రభువు నాశ్రయించి యున్నంతవఱకుఁ బ్రబలసంపద ననుభవించిన పాపాత్ముఁడా ప్రభువు పట్టువదలినతఱి విపద్దశచెందుట యబ్బురముకాదుగదా! పిదప మిత్రుఁ బాసిన యాకాశసజ్జనుని కనుఁగొలుకులనుండి జాఱు దుఃఖాశ్రుబిందువులవలె దిగంతములయందు నక్షత్రము లుదయింపసాగెను. తరు

వాత బిసతంతునిర్మలంబగు గగనపయోనిధియందు ముత్యాలవలెఁ జంద్ర కిరణంబు లొకించుక ప్రసరించె. పదంపడి బలభిద్దిశామండలంబగు చంద్రమండలం బక్షిగోచరంబై తమఃకిరాతునిచేఁ దాడింపఁబడిన నడిమి చెవులపిల్లి మేని రక్తధారలచేతం బోలె నరుణంబై యాకాశమును సరదం బెక్కి తనదారయగు రాత్రి ననుభవించుచున్న చీఁకటి బోజుంగుఁ బాఱఁ ద్రోలి దిక్కులను చెమటబిందువులతోఁ దిమిరావకుంఠనము తొలంగించి యెదురువచ్చిన నిశీధినీకాంతతోసుఖింపసాగెను. కారణములేకుండ నొక్కొకనితో నొక్కొకనికి మైత్రియు నొక్కొకనివలన నొక్కొకనికివృద్ధియుఁ దటస్థించుచుండుననుమాట చంద్రోదయము వలనవికసించిన కలువలవలన లోకమునకు వెల్లడియయ్యె. వికసించిన పువ్వులయందు డాఁగియున్న తుమ్మెదలగుంపు నిశాకార సాంగత్యమునకై వేఁచియున్న కల్వతీఁగ తన మొగముమీఁద నెలకొలుపుకొన్న కస్తూరి తిలకమువలెఁ గన్పట్టెను. నిర్మలుఁడగు చంద్రు నాశ్రయించుటంజేసి యాకసము తన మాలిన్యమును బాపుకొనియెను. గుణవంతుల నాశ్రయించినచో దుర్జనులకుఁ గూడ సుగుణ సంపత్తి యలవడునుగదా! చంద్రు నొకసారి చూచినంతమాత్రమునకే జడధి యున్నతదశను ననుభవించెను. మహాత్ముల కుపకారస్వభావము సహజమైనది గాని నేఁటిదికాదు. లెక్కలేని చుక్కలతో నొప్పు గగనము ప్రతిఫలించినగతి వెల్లి విరిసిన కల్వపూవులతోఁ జెఱువులు ప్రకాశించెను. చీఁకటియను మాలవాఁడు దరియుండుటంజేసి కాఁబోలు రాత్రి చంద్రికయను మడుఁగులో మునిఁగెను. పర్వతగుహాలు తమ్మాశ్రయించిన తమోగజంబులను నిశాకర సింహమున కప్పగింపవయ్యె. మహాత్ములకు శరణాగత రక్షణవ్రత మెన్నండును వ్యభిచరింపదు. కటకటా! జేజేలపెద్దవంటి కటికివాఁడు మఱొక్కఁడు లేఁడు. ప్రాణులకు సుఖమొక్క తీఱుగా జరగనీఁడు. పగలెల్లఁ బరస్పర సమాగమసుఖ మనుభవింపఁజేసిన చక్రవాక దంపతులకు రాత్రివచ్చునంతతో వియోగ మేల కలిగింపవలెనో! చంద్రుఁడు తన కరముసాచి పంకిలంబులగు హృదయములందు గ్రుచ్చుకొనిన మానశంకువు లూఁడదీయ మానవతులుప్రసన్ను

తైరి. తిమిరమను గవిసెన సడలింపఁ బువ్వుల పందిరివలె సతారకంబగు గగనంబు ప్రకాశించెను. స్పృశించినంత మాత్రమునఁ గుముద్వతి పుష్పవతి యయ్యెను. కొందఱు విరహవతులు చంద్రమండలముం జూచి మదనుఁడు బాణములు నూఱుకొనుట కేర్పఱచుకొన్న సానయనుకొనిరి. కొందఱు విరహవతుల హృదయమునందలి రాగసాగర ముద్వేలమై పొంగసాగెను. చంద్రుని బలమంతయు మదనుని శక్తి విజృంభింపఁ జేయుటకై యుపయోగించెను. మిత్రకార్యము నెఱవేర్పఁ జూచువారు తమ కార్యములయం దడియాస గొనరుగదా! ఉదయముఁ జెందుచున్న చంద్రునిఁ జూచి రాత్రియను కామిని తన మేడలమీఁద మంగళారాత్రిక లుంచెననఁ బర్వతాగ్రంబులయం దోషధులు వెలుఁగసాగెను. చంద్రుఁడు తన కాంతిని వృద్ధిపఱచిన యొకరాత్రికే గౌరవమొసఁగలేదు. కల్పతీగలకుఁ గూడ గౌరవమొసఁగెను. మహాత్ముల పరోపకారచింత ప్రతిఫలము నపేక్షించునది కాదు. ఈపగిదిఁ జంద్రమండలము క్రమముగా వృద్ధిఁ జెంది తఱపి వెన్నెలలు బలిసినపిదప రాగవంతులందఱు నంగనా సహితులై యీరాలు తూటిరి. ఇందనుకఁ బ్రియవిప్రయోగముచేఁ గృశించిన కాంతల శరీరములు కాంత శరీర సంగమ జనితంబులగు పులకలచే యథాస్థితింగనె. పడఁతులయెడల నిముషమేనిఁ బ్రాతికూల్యము గల కాంతులపైఁ గుసుమశరుఁడు విరితూఁపులు విడువక మానఁడయ్యె. కౌఁగిలింతలు గాని, యధరపానముగాని నిషేధించు కాంతల వికారములన్నియు భర్తల కినుమడిగ రాగోద్దీపకంబులయ్యె. ఒకకామిని యున్నత మగు స్తనభారముచేఁ దొలఁగిపోయిన కోకను గనుఁగొనలేక పోయెను, గాని ప్రియుని దృష్టియందలి యొడుపుచే నది తెలుసుకొనగలిగెను. ఒక విలాసి ప్రియాధరమాని జఘనాంశుకము నాకర్షించునంతలోఁ బ్రియురాలును జుంబన మిషంబున నప్పని నిరాకరించెను. కరతాడనంబులును, ముఖచుంబనంబులును, గాత్ర పరిష్వంగంబులును, నధరక్షతంబులును మొదలగు విలాసవంతులు చేయు పనులన్నియు మదనాగ్ని కింధనంబులయ్యె. ఒక ముగుద యభిలాషపడియు నొద్దనున్న సఖీజనంబుల వలని యపత్ర

పచేఁ బ్రియాలింగనము నివారించెను. ఒక ప్రౌఢాంగన విరహాగ్నిచే వేచ్చఁబడియున్న తనయోష్ఠమును సమీపించిన భర్తను కథా ప్రసంగమునకు దింపి ముహూర్తకాల మాపెను. ఒక యువిద మానవతియై పెక్కుసారులు ప్రియునిచే బతిమాలుకొనఁ బడియు స్వాధీనురాలు కాకపోయెను. నిరంకుశమగు మన్మథ శాసనము కూడ నతిక్రమించు కాంతలు కలరు. ఒకకామినికి జీవితేశ్వర పరిరంభణ కాలమున వెలికిఁ బ్రసరించు శృంగార రసమువలె మెయినిండఁ జెమటపట్టెను. పీవరస్తని యగు కాంతను కౌఁగిలించు కొనుటకుఁ జేతులు చాలక యొకండు తనకు దీర్ఘబాహువులు సృజింపని విధాతను దూఱసాగెను. చాటూక్తుల యందు నేర్పరి యగు మఱియొక శృంగారి ప్రణయ కుపితయగు కాంతను బతిమాలి బతిమాలి తదీయోష్ఠామృతంబు చేతనే దాని కోపాగ్ని చల్లార్చెను. చాటూక్తి సుందరంబును గలక్వణితంబు నగు కామినీ పీత్కారమును వినిన ప్రతి కాముకుఁడును దవజన్మ సార్థక మయినదని తలఁచుకొనెను. ఇట్టి సమయంబున నజితంజయ నృపాలుండును శశిప్రభతోఁ బెక్కుసౌఖ్యము లనుభవించి మృదుశయ్య యందు నిద్రించెను. పరివారంబును నానా ప్రకారంబుల నిద్రింపసాగిరి. యామవతియు యామావశేషమయిన తరువాతఁ బ్రాభాతిక తూర్యధ్వనులు విజృంభించె. వందిమాగధు లీరీతిగఁ గైవారంబు చేయసాగిరి. "దేవా! అజితంజయ నృపాల! రాత్రి తెల్లవారుచున్నది, మాసిన వలువవలె నక్షత్రముల కాంతి వివర్ణమగుచున్నది. జగములు రంజింపఁజేయు భారము నీముఖచంద్రుని యందుంచి చంద్రుఁ డస్తమింపఁబోవు చున్నాఁడు. పూర్వదిక్పురంధ్రి పాపట నలంకరించు కొనిన సిందూరమో యనఁ దొలిసంజ కన్పట్టుచున్నది. మహారాజ! కలకల నవ్వుచు హంసతూలికా తల్పంబునుండి లెమ్ము. కాంతివిహీనములు కాఁబోవుచున్న ప్రభాత దీపములు నీచిరునగవు వలన నెప్పటి యట్ల ప్రకాశించుఁగాత! ఉన్న మరందము తెల్లవాఱుదనుక నొడిసిత్రావి నీరసముగు కుముద వనమును వదలి తుమ్మెద దిమ్మరీఁడులు వికసించిన తామరపూవుల యొద్దకుఁ బోఁదలచుఁ చున్నవి పద్మబంధువను తోఁట

మాలి జగదారామము నందున్న చీఁకటి యను కలుపు కిరణము లను గొద్దాలికములచేఁ బెకలించి గిరిగుహలను ననుపయుక్త స్థలములయందుఁ బాఱవేయు చున్నాఁడు. హిమబిందువులచే నిండిన తరుణలతా సనాథములగు వృక్షములు పరస్పర సమాలింగితములై సురతాంత శ్రమజలబిందు పూరితములైన కాముకుల శరీరముల వలె నలరారు చున్నవి. పక్క-నుండి దిగఁబోవుచు నొకపాదము ధరణిపై మోపియు మరలఁ బ్రేమావేశంబునఁ గామినుల పగటి విరహపిపాస తీర్చుకొనుటకుం బోలెఁ బ్రియాధరామృతము కొంచెమాని వెడలుచున్నారు. 'తరుణులారా! మీ కుచద్వయో పరిభాగము సదా తుంటవిల్కాని మోయుటచేతనే యలసియున్నది గదా! దానిని మఱింత పీడించుకొనెద రేల? రోషము వదలుఁడు. మీకు నమస్కరించి విన్నవించు చున్నాము. మీకోపము మీకే యపాయకరము. మీప్రియులు మీచిత్తముల యందే యుందురు. చక్రవాకములకుంబోలె మీకు విరహ మెంతకాల ముండును? ఇఁకఁ దల్పములు దిగి రండు' అని కుక్కుటములు గూడఁ గాంతల కుపదేశించు చున్నవి. 'సరోజవదనా! సూర్యోదయ మగుచున్నది. నీమొగము కలక పాయకున్నది. కఠినమగు చంద్రోయితోడి సావాసము చేసినంత మాత్రమున మృదువగు నీడెందమునకుఁ గాఠిన్యము కలుగరాదు. కుంకుడుచెట్లనడుమ నుండిననేమి తియ్య మామిడిచెట్టు పండ్లు చేఁదగునా!' అని కాముకులు ప్రణయకోపమున మార్మొగముగాఁ బరున్న యన్నుమిన్నం బ్రసన్నురాలిం జేసికొనుచున్నారు. దేవా! యవధారు, సూర్యమండల మాకాశ చత్వరము నలంకరించు చున్నది." అనుచు లలితపదములతోఁ గైవారముగావించిన వందిమాగధుల పొగడిక విని యజితంజయనృపాలుండును తమ్మిపూవులతో పాటు మేలుకొనియెను. పిదపఁ దపనుఁడుపూర్వ రత్నాకరంబునుండి వెడలిన చందమునను త్రుటితప్రియాహార మణులతో నిండిన శయ్యనుండి వెడలి పడుకటింటికిఁ దోరణములుగా గ్రుచ్చి కట్టిన మాణిక్యములచే సహజంబగు శరీరకాంతి రెట్టింప వాసభవనము వెడలెను.

ఇది దశమ సర్గము.

## ఏకాదశ సర్గము

★

పిదపఁ గాలగృత్యములు తీర్చుకొని, జలకమాడి. వార్చి, శుచియై నగలును, వలువలు నలంకరించుకొని నృపాలుండు కల్పిత సింహాసనం బగు సభా భవనంబునకు విచ్చేసెను. అంతకు మున్న వచ్చియున్న ప్రధానామాత్య పురోహితాది పరివారము జోహారు గావించిన పిదప సింహాసనము నలంకరించెను. తక్కినవారును దమతమ యుచితాసనములం గూర్చుండిరి. పదంపడి ప్రధాన దౌవారికునిచేఁ దెలుపఁబడిన సామంతరాజు లందఱు భూపాలునకు నమస్కరించి యుచితాస నంబుల నుపవసించిరి. పదంపడి మాష్టికు లొక పెద్ద బలిష్టమగు గజరాజము ముంగిటికిం దెచ్చిన రాజు దానితోఁ బోరాడుటకై కొందఱిని మల్లవీరుల నియోగించి తాను సపరివారముగాఁ జూచుచుండెను. బలిసియున్న యాయేనుగుఁ దొండముమీఁద నొక దుండగీఁడొక గ్రుద్దు గ్రుద్దిన నది వానినిఁ దఱుముకొని పోవు నంతలో నింకొక మల్లుఁడు లోహ సూచికతోఁ బొడిచెను. దాని కా గజము మఱింత యలిగి వాని వెనుఁదగిలి పోవుచుండ నింకొకఁడు తన లాఘవముఁ గనబఱచుచు బెడ్డలు విసరెను. ఈపగిదిఁ బెక్కుమంది పెక్కు వితముల దానినొడుచుచుఁ బొడుచుచుండ నామతంగము పరుగిడుటకు శక్తిలేని యొకనిఁ బట్టుకొని చూపఱు హాహాకారంబులు సేయఁ దొండమునం గొట్టి రూపుమాపెను. శరత్కాల మేఘమువలె నిమిషములో మాయమైన యతని శరీరమునకు జీవితమునకును నిర్వేదముఁ జెంది యజితంజయ నృపాలుం డీపగిదిఁ దలపోసెను. సంసార కూపమున బడియున్న నరుల జీవితస్థితి యాలోచించినఁ దటిద్విలాసము వంటిది. గదయో పిడుగో శస్త్రమో అస్త్రమో శరమో విషమో అగ్నియో నీరో ముల్లో యేదియోయొకటి మృత్యువునకు సిద్ధమైయుండును. లెక్కలేని సంకటముల కాహారమైయున్న మనుజుఁడు చిరకాలము జీవించుట కెంతవాఁడు ? గ్రుడ్డిగవ్వయైనఁ జేయఁడు. శరీరి తనయొశలను ధనమును నాయువును శాశ్వతమైనది కాదని యెఱింగియు మహామోహాము నకు

లోనై శాశ్వతమైనదిగనే తలఁచుచున్నాఁడు. నేడీపని చేయుదును. తేపది యొనరింతును, ఎల్లుట నాకార్యముఁ గావించెదను. అని యువ్విళ్ళూరుచుం డును గాని సమీపించియున్న మృత్యుదేవతను గానలేఁడు. విషయాభి లాషచేఁ జిక్కుపడిన పామునకు వెఱవక సత్పురుషులు మెచ్చని దుష్కా ర్యములు చేయుచు వానివలనఁగలిగిన యాపద లనుభవించుచు మరల నవియే మంచివని యెంచుచుండును. కులటాకటాక్షములవలె సంపదలు చిరకాలమొకనియెడ నిలువవు. ముదిమిచే నాక్రమింపఁబడని యౌవనం బును, దావాగ్నిచేనశింపని వనంబునులేవు. మొదటసరసంబులును దుద కు విరసంబులును బరిహాసాస్పదములు నగు విషయసుఖములచేఁ గట కటా! మానవజీవిత మెన్నిఱిడుమలఁగుడుచుచున్నదో! కాలభాస్కరుని యెదుటనిలువఁబడుట కీజీవితహిమంబెంతటిది! చిగిరించినపుడే రసా లవృక్షమును గోకిలలాశ్రయించుచుపగిది సంపదకలిగిననాఁడే బంధువు లు మనుజులనాశ్రయింతురు. ప్రాణవంతుల జీవిత మూఁగబండిన పండువంటిదిగాని వారొనరించిన పుణ్యపాపకర్మములు నశ్వరములు కావు. విషయేంధనములచే రగుల్పఁబడిన సంసారదావాగ్ని మంట విజ్ఞానాంబుదమువర్షించునంతదనుకఁ జల్లారదు. జీవికి దురాత్మకమ్మును భయంకరమునగు సంసారమువలననే వధబంధనాదిసంకటము లుప్పతిల్లు చున్నవి. దాని నున్మూలించిన నవియెట్లుకలుగును? కావున మొదటసంసా రమును నిర్జింపవలయును. సర్వదావిపరీతభావశ కలవాఁడేని సంసారియను రాగియయ్యు నశింపఁడు, సర్వదావారిదము వాన గురియుచున్నచో నాకాశ మునకు ధూళి యెట్లంటును? సంసారాంధ్యము లేనిముముక్షులకే తరుణో పాయములు కానరావు. సంసారాంధులకెట్లుకన్పడును? బుద్ధిమరంతములగు భోగముల కాసపడుచున్నంతవఱకు జన్మపరంపరావిచ్ఛేదము కాదు. అది కానియంతవఱకు మోక్షముదొరకదు. జననమరణప్రవాహదుస్తరంబగు సంసారసముద్రము ( దాటుట కోడవంటి మనుష్యజన్మమెత్తియుఁ గుమతు లక్కటా! దానిచుక్కాని తిన్నఁగాఁ ద్రిప్పుకోలేక విషయమహావాయువు లకులోనై యాసముద్రమున మునిఁగిపోవుచున్నారు. ముంచుఁబెక్కిడుమలు

మూడుననియెఱింగియు నెవ్వరీశరీరమునందే సుఖములనుభవింతురో వారు విషముకలిపినయన్నమని యెఱింగియుఁ బ్రిస్తుత మాఁకలితీరునుగదాయని తినువారితోసమానులుకావున శమఖడ్గముఁ గైకొని యరిషడ్వర్గమును జయించి ముక్తికామినిని వరింపఁదలఁచిన నన్నడ్డువారెవరు? ఇంతకుమున్ను శత్రువులను నిరసెంచి, మంత్రులను లోఁబఱచుకొని, రాజ్యమేలినపగిది నింకఁబాపకృత్యములు నిరసించి షడింద్రియములను లోఁబఱచుకొని తపోవనము నేలెదనని నిశ్చయించుకొని "ఓచిత్తమా; నీవేకదా చిరకాలము నుండి భోగామిషలోభివై చతుర్వర్గములను నిందితములు గావించితివి. నేఁటికైన శాంతివహింపుము. నన్నేలక్లేశపరంపరలో ముంచెదవు? జన్మ పరంపరకు భీతిల్లిన మావంటి వివేకశాలురే యింద్రియములను జయింప లేకపోయినచో ముక్తికన్యకలకు మగలు దొరకుటేదుర్లభము" అనిమనము నకుపదేశించి తపోవనమునకై పోనిచ్చగించుచుండ నుద్యానవనములోనికి గుణప్రభుఁడను మునీంద్రుఁడొకఁడు వచ్చియున్నాఁడని వనపాలకుఁడు విన్నవించెను. పిదప రాజును సంసారనివర్తనోపాయములగుకథలు తోడి రాజుల కుపదేశించుచుఁబౌరులతోఁ గలసి యోగనిష్ఠయందున్న గుణప్రభునింజూచి పంచాగ్నిమధ్యమునం దపమాచరించుచున్న యాముని కృశ శరీరమునకుంగల యఖండతేజోవిభవంబున కద్భుతంపడుచు జినసిద్ధాంత మును దుదముట్ట నెఱింగిన మహానుభావు నింకొక జడదారిని నతనిచుట్టుఁ దదీయ వాక్యామృతముద్రావుచున్న మఱికొందఱు మునీంద్రులను జూచి యోగీశ్వరేశ్వరుండగు గుణప్రభునకును దక్కిన నిరాహారులకును వందన మాచరించి గుణప్రభుండగ్గఱి యిట్లునుతింపఁదొడఁగెను.

"దేవా: అజ్ఞానతమోనిరుద్ధంబగు మావంటివారి కన్నుదోయిమీయుప దేశ మను వెలుఁగు తోడుగాకున్న నిరర్థకంబుగదా: ఆశ్రియము లేక యధోగతికిఁ బాలగుచున్న దేహధారులకు నీవాలంబదండము గావేని యెట్లు నిలుతురు. ముక్తిసౌధాగ్రిమున కెక్కఁదలఁచినవారికి నీయుపదేశ ములు మెట్లుకావేని యెట్లెక్కఁగలరు. వికసించిన బొండుమల్లెపూవులవంటి

శమదమాదిగుణములు గలమీవంటి మునిచంద్రులవలనను. జల్లనికిరణ ములు కాయు చంద్రునివలననుగాక జగంబునకు శోభయెక్కడిది! ఉపదే శకిరణప్రసారమున జగత్తంతయు సుప్రకాశితముఁగావించు మీవంటిముని భాస్కరులు ప్రకాశించుచుండఁ దమ దారి చక్కఁజేసుకోలేనివారు గుడ్ల గూబ లనుటకు సందియములేదు. హృదయగతమగు తమము గూడఁ బోఁగొట్టఁజాలిన మీవంటి యపూర్వసూర్యుల మొగముఁ జూడని జంతు వుల జన్మము నిరర్థకము. చిరకాలము పరిశ్రమపడియు నపాయ శూన్య మగు పదవిని బొందలేనివా రొక్కనిముసమున మిమ్మాశ్రయించి యాప దవి నొందుట మిగుల నబ్బురముగా నున్నది. నశ్వరముకాని మోక్షసం పదకుఁ బ్రతిబంధకు లైన యింద్రియములను పేరి శత్రువులను నిర్జించు టవలన మీకుఁగలిగిన యానందము మీకే తెలియఁదగినది కాని యొరులకు గోచరముకాదు." అని కొనియాడి భక్తివినయంబులు భయసంభ్రమము లును దోఁప నెదుట నిలువంబడిన రాజుమీఁదఁదపోధనుల దృష్టులన్నియు నొక్కసారి ప్రసరించెను. గుణప్రభుండును యోగనిష్ఠవదలి తేటిచూచెను. వారి కిరువురికిని జగదానందకరమగు కొంతసంభాషణ జరిగినపిదప మునీం ద్రుం డితరులతో "మునీంద్రులారా. రాజులెందును సహజముగ మత్తులు. మత్తులకుఁగాని రాజయోగమేయుండదు. ఇతనియందది కానరాదు. ఇది మిగులవింతగానున్నది. ప్రజలకు నయంబును,దేవతలకు విభవంబునుదపో ధనులకు వినయంబును,రాజులకు నిసర్గతేజంబును బ్రతిష్ఠకుఁగారణంబులు. ఇతనికిఁగల సార్వభౌమపదవి యెక్కడ! వినయమెక్కడ! ఈ రాజునందుఁ బరస్పరవైరమును వదలి సర్వగుణంబులు నిలిచియున్నవి. ఈ మహిపా లునకుఁ బరలోకమును సాధించుటయందలి ప్రయత్నము సంపద యెడ లఁగాని బాంధవుల యెడలఁగాని, సంసారసుఖ ముల యెడలగాని యున్నట్లు కన్పడదు. మహాత్ముల వ్యాపారము హితమునకుఁ బ్రతి బంధకమై యుండదు" అని నుడువ, భూపతియు దోసిలియొగ్గి విన యనమ్రుఁడై "మహాత్ములారా! మీరిచటికి దయసేయుట నా పూర్వకృత పుణ్యము. ఐశ్వర్యముగాని, బాంధవులుగాని, సంసారసుఖములుగాని దుర్గ

తిలోఁ బడునవు డాపఁగలవా అని యాలోచించి నాచిత్తము మీవంటివారి పాదారవిందములు పూజించుటకు సిద్ధపడినది. నాయందు దయసేయుఁడు. మీదయ యెంతైనను సమస్తవరముల నీఁజాలును. శుభములు వృద్ధిసేయును. అశుభములు నివర్తింపఁజేయును. వెయ్యేల, మీయనుగ్రహము వలనఁ బడయరాని దేదియును లేదు" అని విన్నవించిన యతని యంతఃకరణమును బరీక్షించుటకును సాహసముఁ జూచుటకును గుతూహలపడి యామునిరాజు "రాజా! మే ముపదేశించు తపోనిష్ఠ బూడిదనలఁదుకొను కఠినశరీరములు చేయఁగలవు. కాని కుంకుమపూసికొను సుకుమారశరీరములు సాధింపలేవు. బుద్ధిమంతుఁడై ప్రజలయందు దయకలిగి ధర్మమే ధనముగా నొరులచే నిందింపఁబడక మేటిసిరి యనుభవించు నీవంటి సంసారి తపోధనులకంటెఁ దక్కువవాఁడు. నీవు దయయుఁ బరలోకచింతయు మావంటి జడదారులయెడ వినయంబును గల వాఁడవు. లోకమునేలుము. జనుల నుద్ధరింపుము. ప్రజాసంరక్షణము కంటె వేఱుధర్మము లేదు." అని యుపదేశించిన బుడమితేఁడున జంచలచిత్తుఁడుగాక తనపక్షమునే దృఢపఱచుకొనుటకై మరల "నోమునీంద్రా! మీయానతి శిరసాధరింపఁ దగినదయ్యు నతిక్రమించుచున్నాను. దయయుంచుఁడు. ఈజన్మపరంపరయందలి దుఃఖముతప్ప నాకీవృత్తి కలుగుటకు రెండవకారణములేదు. సంసారమునందుఁ బలువితము లగు మనోవ్యథలే లేనియెడల దుస్తరమైన జినవ్రత మెవ్వ రవలంబింతురు? సంసారులకుఁగూడ చిత్రవిచిత్ర దుఃఖములుగల జన్మపరంపరయే లేనియెడల వివేకము గల మీవంటి వారేల యీఘోరవ్రత మవలంబింతురు" అని పలుకు రాజుసకుం గల జినవ్రతదీక్షకు సంతసించి యతని మదికిం గల దృఢనిశ్చయ మెఱిఁగి జినవ్రతమునందుఁ బ్రవేశపెట్టుట కంగీకరించిన పిదప భూపాలుండును నిర్వైరమగు రాజ్యమును గొడుకున కప్పగించి యామునీంద్రుఁ డుపదేశించినగతి దుస్తరమగు తపంబు గ్రీష్మర్తువునం దెండయందును, వర్షాకాలమునందు వానలలోను, చలికాలమున నీళ్ళలోను సాధించి గురువులను, గురువు గురువులను ధ్యానించుచు సమాధి నున్నంతఁ జరమదశ సంప్రాప్త

మగుడు నొకనాఁడు బ్రహ్మరంధ్రము నుండి ప్రాణములు విడచి యచ్యుత కల్పంబున నచ్యుతేంద్రుఁడై జన్మించి యందును వివిధభోగము లనుభ వించి యెనుబది యెనిమిది సంవత్సరములు బ్రతికె క్రమ్మఱ సువర్ణమాలా కనకప్రభులకుఁ బద్మనాభుండను పేర నీవై పుట్టెను." అని శ్రీధరమునీం ద్రుఁడు తన పూర్వజన్మ వృత్తాంతము లన్నియు నుడువఁ బద్మనాభ నృపాలుండు నొడలు పులకరింప బద్ధాంజలియై యామునీంద్రునితో నిట్ల నియె. "ఓభగవంతుఁడా! నీయనుగ్రహమున నాపూర్వజన్మ వృత్తాం తము లన్నియు నెఱింగితిని. ఐనను నన్ను సంశయము బాధించు చున్నది. దానికిం దగిన గుఱుతుఁ దెలిపి నాసంశయముఁ దీర్పు"మన వుడు శ్రీధర మునీంద్రుండును నతనికి విశ్వాసము కొఱకై "రాజా! నేఁటికిఁ బదియవదినంబున నీనగరంబులోని కొక మదించిన యేనుఁగు రాఁగలదు. దీనింబట్టి నామాటల యందలి నిజము తెలిసికొనుము. ప్రత్యక్ష ప్రమాణముకంటె మించిన ప్రమాణము లేదు గదా" అని నుడివిన రాజేంద్రుండును బ్రణతుండై తన పురమును బ్రవేశించెను.పిదప మునియన్న పదియవ దినమునం బురమున నాకస్మికముగా నొక కోలా హలముప్పతిల్లిన రాజును దాని యుత్పత్తికిఁ గారణ మరయుచుండ నొక చారుఁడు వచ్చి "దేవా! యెచటనుండియో యొక మత్తగజము వచ్చి వీఁటివెలుపల ఘీంకరించుచుఁ ద్వదీయ భుజరక్షితు లగు ప్రజల నంద అను గసిమసంగుచున్నది. పురినుండి బైటకుఁ బోవువారును బైటనుండి పురిలోనికి వచ్చువారును నామావశిష్టు లగుచున్నారు. ప్రజ లందఱికిని ద్విరద రూపంబున సంహారకాలము చనుదెంచినది. దీనికిందగిన యోజ యోజింపు" మనుడు ధరణీపతి ముని పలుకుల యందలి సత్యమునకు సంతసంబును బ్రజల నందఱిని రూపు మాపుచుండుటకు విషాదం బును జెంది దాని బారినుండి ప్రజలను గాపాడకున్న క్షితిపాల శబ్దము వ్యర్థమగుననియుఁ దలంచి యది యున్న తావునకుం బోయి తక్కిన వారిని మరలించి తానొక్కఁడే యెదుటఁబడి పిలిచెను. గజంబును దుండ మెత్తి గర్జించుచు నారాజు మీఁది కురికెను. రాజేంద్రుండును నాఁడు

యేనుఁగు మూత్రముచేఁ దడిపిన బట్ట యొకటి దాని ముందఱ గిరవాటు వైచి యది దాని మూచూచుచుండఁ గఱ్ఱఁ గైకొని పార్శ్వమునం గొట్టెను. దంతావళంబును వస్త్రమును వదలి మీఁదికుఱికెన లాఘవము నందప్పించుకొని మరల దాని ముందఱ నావలువఁ బెట్టి యది యథా పూర్వముగ దాని నాఘ్రాణించుచుండ లగుడమున రెండవప్రక్కఁ గొట్టి యంకుశముతోఁ గూడఁ బిట్టవలె నెగిరి దాని కుంభస్థలము మీఁద నిలిచి హస్తిపకుని పగిది గజమును స్వాధీన పఱచుకొనియెను. దేవతలును దివినుండి పుష్పవర్షము గుఱిసిరి. పౌరకాంతలు సౌధములనుండి కటాక్షకుసుమములు వర్షించిరి. ఇట్లు దేవతలకుఁ గూడ దురాపమైన మత్తగజమును గైవసము జేసికొని వనకేళీ మిషంబున నాయేనుఁగును వనమునకుం గొనిపోయి యందు విడిచి పౌరముఖంబున, గొనియాడ బడుచున్న తనకీర్తి ప్రతాపములు వినుచు మరలఁ బురముం బ్రవేశించెను.

ఇది యేకాదశ సర్గము.

## ద్వాదశ సర్గము

★

పిదపఁ బద్మనాభనృపాలుఁడు నిండుకొలువున నుండగాఁ బందితుండగు నొక రాజచారుండు చనుదెంచి "దేవా! నీ శాత్రవులందఱు మిత్ర బాంధవులతోఁ గూడ భవదీయప్రతాప దినకరాతపమునకుఁ గనలి గిరి గుహాంతరములం దూఱిరి. సకలరాజుల నతిక్రమించు ప్రాభవమునం బ్రజలనేలుచున్న నీయందే పృథివీపాలశబ్దము సార్థకమైనది. మానృపాలుఁడు నిన్ను మనమునఁ గౌఁగిలించుకొని నా ద్వారమున నొకసందేశము పుత్తెంచెను. దానిని సావధానముగా నవధారు. రాజులకు దూతలే మొగములుకదా! చంద్రుని చల్లనికిరణములు దూరమునందుండియుఁ గలువలను వికసింపఁజేయు వడువున నీగుణములు దూరమునందున్నను మహాత్ముల

కానందజనకములగుట నిస్సందేహము. పూచిన పూతచేతనే చెట్లకాపు తెలిసికొనఁగలుగుపగిది దిగంతవ్యాప్తములగు నీకీర్తిసంపదలచేతనే నీవినయాదిగుణములు తెల్లమగుచున్నవి. ముందునీశౌర్యమునకు జడిసి నీరయినచో సముద్రునకది పరాభవచిహ్నమగునని విధి మొదటనే సముద్రుని నీరుగాసృజించెను. నీవినయమే మనోగతమగు సౌశీల్యమును బ్రకటించుచున్నది. ఏనుఁగును గుఱ్ఱమును మంగళప్రదములగుటకు యజమానుని శుభాభివృద్ధియే సాక్షిగదా! నీవిటువంటి సద్గుణములు కల వాఁడవయ్యు నొకటిరెండు విషయములలో మాత్రము మర్యాద నతిక్రమించుచున్నావు. మీవంశమునందుఁ బొడమినరాజులందఱు మాతెగలో జనించిన రాజులకు సమస్కరించుచుండుట పూర్వకాలమునుండియు మర్యాదయైయున్నది. మత్తగజ మాలాన మూఁడఁబెఱికిన చందమున నీవాగౌరవమును నిరాకరించుచున్నావు. మదించిన యేనికకు బంధము కన్నులారఁ జూచుచుండియు నాత్మకుహితవుగాని మదవృత్తి నవలంబించు వాఁడెవఁడు? జాత్యంధునకుఁబోలె మదమత్తచిత్తున కెదుటనున్న వస్తువులు కానరావు కాని జాత్యంధునకు బుద్ధిమత్త కలిగియుండును; మత్తునకదియునుండదు. ఏరాజులోనున్న రిపుషట్కమును జయింపఁ గలుగునో యతఁడే భూమినేలఁదగినవాఁడు. తనమదినే తానులోఁబఱచు కోలేనివాఁ డితరుల నెట్లులోఁబఱచుకొనఁగలఁడు? దంతావళ మంకుశ క్షతి సహించినట్లు నీశాత్యమును నేను సహించుచునే యున్నాను. నేనుసహించినకొలఁది నీవపకారము చేయుచునేయున్నావు. వనకేళీమిషంబున మాభద్రగజమును మీనగరుసొచ్చినదానిని నీవు కట్టిపెట్టితివని మాచారులు మాకు నివేదించిరి.. నీయంతట నీవే దానిని మాయొద్దికిఁ దోలింతువని మేముపేక్షించినను నీవూరకుంటివి" అని దేవరవారితో మనవిచేయుమనియె. పైనమీచిత్తము. తెలివిలేని వారికి హితముబోధింప వలయునుగాని మీవంటి నీతిపారగుల కనవసరము కావున మాప్రభువు గజమును ప్రభువున కర్పింపుము. సముద్రముండఁగా నదముల కెన్నఁడును రత్నాకరమను పేరురాదు. ఆనృపాలున కనుగ్రహము వచ్చిన

నీయేనుఁగనే మీకిచ్చి మఱికొన్ని యేనుఁగులనుగూడ నియ్యఁగలఁడు. వృథావిరోధము పెంచుకొనకుఁడు. అధికలాభమును గోరుదేని దుదకు నొకతాంబూలమైనఁ గఱవగును; నామాటవినిన మారాజునకు మీయం దాగ్రహము రాకుండఁజేయఁగలను." అని దూతపల్కిన పల్కులకుఁ బద్మనాభ నృపాలుం డలిగి కుమారునకు సైగఁజేయ యువరాజగు సువర్ణనాభుండిట్లనియె. "ఓదూతా! పైకివినయంబును మాటలయందుఁ జాఱుకుఁదనమును గల నీవుదక్క నితరులిప్పగిది నెవ్వరును బ్రస్తా వింపరు. బుద్ధిమంతులగు నీవంటి మంత్రులుగల రాజునకు సంపద కేమిలోటు. ఒకవినయ మున్నంతమాత్రముననే దూతలు యోగ్యులుకారు. ఉచితానుచిత సంభాషణముఁ గూడ నెఱిఁగియుండవలెను. మాయదృష్ట వశమున నాభద్రగజము మానగరు సొచ్చినది, దానిచే మీరాజునకు మాయందంత మాత్సర్యమేల? మాయేనుఁగును మేమీకపోవుట మాకక్రి మమా! ఒకరిపదార్థము నపహరింప నెంచుట మీదిక్రమమా! నీప్రభువు నీకుఁబ్రభువు గాని మాకేటిప్రభువు; మాయెడల నీవాపదమును బ్రయో గింపవచ్చునా? ఎవనికి భుజబలము కలదో వానిదీవసుధ. ఏనుఁగేకాదు ఇంకొక వస్తువేకాదు, పుణ్యమూలమున లభించును. దానికింత వగవ నేల? బలముండిన జయింపవచ్చును, లేదా, దీనుఁడై యేనుఁగును యాచింపవచ్చును గాని యీయసంబంధ ప్రలాపములెందులకు, మీనృపతి కేనుఁగులు లేవా! మాకేనుఁగులులేవా! ఇదియొకచేనా? ఇదియొక నెపముగా మాతో విరోధముఁ బూననెంచుచున్నాఁడు. కాఁబోలు, కానిమ్ము. నేనే బలవంతుఁడనను నహంకారమేటికి? పలుకులు చాలింపుము. గిరి గుహాయందు నిదురించుచున్న సింగమును లేపినపగిది నీపగిది యుద్ధము నకుఁ బ్రేరేపించుచున్న నిన్ను శాంతగుణమే నివారింపకున్నచో నిపుడే చంపవలసినది. రిపుల నెదిఱిపోఱినవాఁడే పండితుఁడు. మండుచున్న మంటకు గాలి తోడయిన పట్టున నదిమండక మానునా? క్షయము కలవాఁడుగాని, దైవోపహతుఁడుగాని, వ్యసనిగాని పరులచే జయింపఁ బడుదురు. ఇందు మే మెవ్వరము గాముకదా! మమ్మ మీరాజెట్లు

యింపఁదలంచెనో నుడువుము? క్షుద్రులయెడల సాహసకార్య మిష్ట సాధకమగుంగాని తదన్యులయెడలఁగాదని మీరాజెఱుఁగడు కాఁబోలును, అకపోయినను ధనమదాంధులకుఁ దెలివితేట లెక్కడివి. ఎవరిబలము చేత మీ రాజు నిష్కంటకముగ రాజ్యమేలుచుండెనో నీ వెఱుఁగవా! మూరాజే మీకు సహాయుఁడుగానిచో మీరాజేమిచేయఁగలఁడు'' అని యువరాజు పలికిన పలుకులకు రిపుదూత పరివృద్ధమత్సరుండై చేయియెత్తి గర్వగద్గదముగా నిట్లనియె. ''పుణ్యశాలియగు నరుఁడు పరులు బోధింపనతటిఁ దెలియకున్నను దనబుద్ధిచేతనైనఁ దన హితము నెఱుంగఁ గలఁడు. తెలివిమాలిన వానికొరులు బోధించినను దెలియదు, తనకుఁ దాను దెలిసికొనలేఁడు. సదుపదేష్టయు, సజ్జనసంగతియు, శాస్త్రంబును, బురుషునకు నిమిత్తమాత్రంబులుగాని హితాహితవిచార మదృష్టవశమునసే కలుగవలయును, తన పరాక్రమము క్రియయందుఁ గనపఱువవలయుంగాని మాటలయందుఁ జూపరాదు. మాటలయందుఁ జూపినవారెందఱెందఱో రణమందుఁ బరిహాసపాత్రులగుట నే నెఱుంగుదును. అభివృద్ధిఁగోరువాఁడు మునుముందు తనబలమును నెదిరిబలముఁ గొంత యోజింపవలయును. శరభమృగమువోలె సాహసించినచోఁ దుదకది యనర్థకారి కాకపోదు. తనకంటెఁ దక్కువ వానితోఁగాని, తనతో సమానునితోఁగాని పోరునపుడు జయ మదృష్టప్రధాన మనుకోవలయును గాని తనకన్న బలవంతులతోఁ బోరునపు డదృష్ట ప్రధాన మేమిటి? మనకుఁ బదిమంది సహాయు లున్నారు గదాయని విఱ్ఱవీఁగి మందమతి యగువాడుఁ చేయరాని పని చేయఁదలపెట్టును గాని యాసహాయులందుఁ దన కార్యము నిర్వహింపఁ జేయఁదగినవాఁ డెవ్వఁడో తెలియ నేరఁడు. తటగతంబగు వృక్షమెంత మొదలు గట్టినను పదిమందిగెంటినఁ బడదుగాని నదీవేగంబునకుఁ బడకుండునా! సమానమగు బలము కలుగనిమ్ము సైన్య ముండనిమ్ము. కోశము పెరుఁగనిమ్ము. ఒక్కొక్క రాజునకు నొక్కొక్క రాజు లొచ్చగును. ఎంత నీరున్నను, నెంతవిశాలమైనదైనను నదము సముద్రమునకు లొచ్చు కాకపోదు. ప్రియవాద

ములు పల్కుచున్న యీభటులను నమ్మి నీవు మోసపోవుచున్నావు. నే నుడివిన మాటలు కవనరంగమందుఁ గాని నీకనుభవమునకు రావు: పదార్థముల రుచి నాలుకమీఁద బడినఁగాని యన్యథా యెట్లు తేటపడును ? శత్రువుఁడవైన నీకింతగా నేహితోపదేశము చేయనేటికి. నీయభిమత మగు తెరువున నడువుము. హితోపదేశ మభిలషింపకపోయినను మిత్రుల కొనరింపుమని యున్నదిగాని శత్రువుల కుపదేశింపుమని లేదు. నీశిరో మాణిక్యములచేత మారాజుగారి పాదపీఠము నైన నలంకరింపుము, లేదా రణభూమినైన నలంకరింపుము.'' అనిపల్కిన దూతపై యువరాజ ప్రముఖులయిన సభవారందఱు నాగ్రహింపఁ బద్మనాభ నృపాలుఁడు రిపు వాక్యము లనువదించిన వీఁడు దోషికాఁడని వారిని నివారించి "నీవు మీరాజు పాలికిఁ బొమ్ము తోఁచినగతి గావింపుమని మనవిచేయుము.'' అని దూత నంపి మంత్రాలోచనమునకై మంత్రులతోఁగూడ వివిక్తమగు మందిర ముం బ్రవేశించి యువరాజ ప్రముఖులగు మంత్రులతో నిట్లనియె.

మంత్రులారా ! నేను గుశలి ననిపించుకొనుటకును నయమార్గాను వర్తి ననిపించుకొనుటకును మీయోగ్యతయే కారణము. దివసము జగ మంతయుఁ బ్రకాశింపఁ జేయుటకుఁ గారణము రవిమహిమగాని వేతొండు కాదుకదా ! మీమతియే జననివలెఁ గుశలమరయుచున్నది, రాజ్యమేలు చున్నది, ప్రమాదములను నివారించుచున్నది. ఫలమునూత్రమే ననుభ వించుచున్నాను. మేరుపర్వతమంత ప్రయోజనము ఘటిల్లినను మీ రుండఁగా నాకాకులపాటే లేదు. ప్రతిపదమందుఁ దొట్రుపడుచు మత్త గజములవలె సంచరించు మావంటిరాజులకు మీవంటి గుణపు లంకు శములవలె నుండకపోయిన దుర్మార్గసంచార మెట్లు మానును. మీబుద్ధి బలమును బురస్కరించుకొనియే నాపరాక్రమ మరుల నాక్రమించు చున్నది. సారథి లేకున్నఁ దేజోనిధియయ్యు భాస్కరుఁ డపారమగు గగనమును దాఁటుటయెట్లు ? నిజదూత ముఖమున దుర్మార్గుఁడగు పృథివీపాలుఁడు పుత్తెంచిన సందేశమును మీరు సభలోఁ జెవులారవింటిరి

కప. దానిచే నామనముమిగుల క్షోభపడినది. రోగముంబోలెఁ బగతునిగూడ
ద్వరగాఁ జికిత్సచేయకుండ విడువరాదు. అతఁడుమాటిమాటి కేదియోనెపము
పన్ని మనలహింసింపన చూచుచున్నాఁడు. కావునమనకుఁ గార్యసిద్ధికై
దండముకంటె వేఱొండు నుపాయము లేదు.'' అనిమృదుతరంబుగనుపన్య
సించి రాజూరకుండఁ బురుభూతియను మంత్రి యిట్లనియె. "దేవా నీ
యనుగ్రహ మున్నంతవఱకు మేము బుద్ధిమంతులము. కౌశలవంతు
లము. మాకు గురువు, ప్రభువు, మిత్రము, బంధువు నీవేకాని యితరులు
లేరు. నీతిశాస్త్రమంతయు వడపోసి యందలి సారమంతయుఁ బరస్పర
భేదము లేకుండ గ్రహించిన నీవంటి పండితుని ముందఱ నందలి లేశమే
నెఱుంగని మావంటి మూఢులు చెప్ప దొరఁకొంటకు సిగ్గుపడవలసినదే
యైనను మీవంటి శాస్త్రపండితుల యెదుటఁ దెలిసినమట్టు నుడువకుండ
లోపములెట్లు సవరించుకోఁ గలుగుదుమను నాశతో నుడువ సాహసించు
చున్నాను. మేమధికార మందున్నను మీచే శిక్షింపఁబడఁ దగినవారమే
కావున లోపములున్న క్షమింపవలయును. తుషరాశిలో బియ్యపుగింజ
లేఱినపగిది నామాటలలో సుభాషితము లేఱవలయును. జిగీషువగు పురు
షుఁడు నయవిక్రమ ద్రుమములు రెండవలంబించవలెను. ఆ రెంటిని
వదలిన ఫలసిద్ధికి రెండవకారణమే లేదు. నయవిక్రమముల యందు నయమే
బలవత్తర మైనను నయహీనున కెంత పరాక్రమ మున్నను వ్యర్థమే.
మత్తగజముఁ జంపిన సింగమునకు మాత్రము కిరాతుఁడు మారకుఁడు
కాఁడా! నీతిగాన చరించువారి కెంతబలవదిపు లైనను సాధ్యులగుదురు.
వనేచరులు మదమంథరమగు గజము నుపాయమున వశపఱచుకొనుచు
న్నారాలేదా! నీతిశాలికిఁగూడ నొక్కొక్కతఱిఁ గార్యము విఘటించినచో
నయ్యది దైవలోపమేగాని పురుషలోపముకాదు. ఎవ్వఁడు నీతిశాస్త్రప్రద
ర్శితంబగు మార్గమున సంచరింపఁడో వాఁడాడుకొనుటకై కొఱవినిష్టు
లాగు బాలునివంటివాఁడు. మీరు వివేకవంతులలో నగ్రగణ్యులు. శత్రు
వుని యెడల దండమే ప్రయోజ్యమని నుడివితిరి కావున నంతకంటె
నేనేమి విశేషము నుడువఁగలను. కాకపోయినను బృథివీపాలుఁడుమాత్ర

మభిమానవంతుఁడు. సామమాత్రమునకు లోఁబడువాఁడు కాఁడు. అభిమాన ధను లెన్నఁడును విక్రమమునకు వెనుదీయరు. సామమునకులోబడరు నిప్పు నిప్పుచేసెన్నఁడేని జల్లార్చునా ! మొదటసామము. పిదపభేదము, తరువాత దండమును రిపునియెడలఁ బ్రయోగించువారు వివేకవంతులే కాని సామ భేదములు కార్యకారులు కావని తోఁచినపుడు మాత్ర మవి ప్రయోగించుట యనవసరము. ఒక ప్రియవాక్యము నూఱుదోషములనైనఁ బోఁగొట్టును. తాళ్ళు వర్షించుచున్నను నీరు కురియుటచేతనే కదా మేఘము ప్రజ లకు వల్లభమైనది. దానమువలన ధనహాని కలుగును, దండమువలనబల హానికలుగును, భేదమువలనఁ గపటి యనిపించుకొనును. కావునసామము కంటె మంచి యుపాయములేదు.'' అని పురుభూపతి నయాన్వితంబుగ నుపన్యసించి యూరకున్నంత యువరాజు సాసూయముగాఁ బౌరుషా శ్రియముగా నిట్లనియె. ''ఇపుడు చేయఁదగిన కార్యమొకటి, మనమను కొనుమాట యొకటి. ఎద్దుమెడమీఁద మోపక పృష్టముమీఁద మోపిన బరువు మోయఁగలదా ! కార్యకారిగాని కూర్చ శోభయేటికి ? పండు కావలసి విత్తు నాటువారుందురా ! ఒకఁడు బాగున్నాఁడను నసూయకలవా డెన్నఁడును సామవాదమునకు లోఁబడఁడు. వజ్రముచేఁ బొడుము చేయదగినది ' లోహమునకుఁ బొడుమగునా ! పరాపకార పరాయణుఁడగు వాని యెడల దండమే యుపాయమని పెద్దలు చెప్పిరి. పొగరుకొన్న యాఁబోతు ముక్కుత్రాఁడు వేయకుండ సాధ్యమగునా ? పరులచే నిగ్ర హింపఁ బడుఁదాక పురుషుఁడు బంగారము వంటివాఁడు.. ఆ పని కొంచెము జరిగినచో నతఁడు గడ్డిపోఁచకన్నను దేలికయగును.'శాంతము భూషణ'మను మాట యతులకుఁగాని రాజులకుఁగాదు. సంసారమార్గము మోక్షపదవియు నెందును గలియునవి కావు. వెన్నెల నందఱుఁ గాళ్ళతోఁ గూడఁ దన్నుదురు, ఎండను గన్నెత్తి జూడలేరు, తేజో మహిమఁ గనుంగొనుఁడు. కృపణుఁడై సమర్థుఁడయ్యుఁ బరాను వర్తనముచే జీవించునతని జన్మము కాల్పనా ! ఏదియో యొక యుపాయము చేతఁ సుక్క బ్రతుకుటలేదా ! దుర్మార్గుని బ్రియవాక్యములచే నెవ్వఁ డనుస

లించునో వాఁడుతన యప్రయోజకత్వమును వెల్లడి చేసికొనుచున్నాఁడు. ఎంత యుఱిమినను వానకురియని మేఘమునకు గౌరవమేమున్నది ? పరాభవముఁ జెంది జీవించుటకంటె డాఁగుట మేలు, చచ్చుట మంచిది. స్వతంత్ర శక్తిచేఁ గాక పశువువలె జీవించుట మగతనముకాదు. కను కనే పెద్దలు మృగరాజు జీవనమును శ్లాఘించిరి. నే నుడువుమాటలు నీతి యుక్తములు కావని తమమదికిఁ దోఁచినచో నది కాలమహిమ యను కొనెద" ననుచుఁ బేశలముగా నుపన్యసించిన సువర్ణనాభుని పలుకులు విని నృపాలుండు భవభూతిదిక్కు మొగంబైన నతండిట్లని చెప్పఁ దొడంగె. "దేవా ! కర్తవ్య విషయమై యువరాజే చక్కఁగా నుపన్య సించెను. నేను మరలఁ జెప్పుట ప్రతిశబ్దమువంటిది గాని వేఱుకాదు. ఈపగిది సౌష్ఠవము చెడకుండ నన్వయము క్లిష్టము కాకుండ స్వచ్ఛముగా నుపన్యసింపఁగలవాఁడు బృహస్పతితప్ప నితరుండు లేఁడు. అయినను నతని మాటలకే యేను శుకానువాదము కావించెదను. కావించెడుపని పరి శీలించి చేయవలయును, లేదా యూరకుండవలెను. విధికిఁగూడ గహన మగు నేతాదృశకృత్య విషయమై నావంటివారు మోహపడుట యబ్బు రమా; సాహస మవలంబించుట పశుధర్మము గాని మనుష్య ధర్మము కాదు. పరిశీలింపకుండఁ జేసినచోఁ బశువునకు మనుష్యునకును శృంగ భేదముతప్ప వేఱులేదు. నామతము యువరాజుమతము నొక్కటియే. కాని కొంచెము భేదముకలదు. కొంతకాలము గడచిన తరువాత దండ యాత్ర గావింప వలయునని నామతము. షాడ్గుణ్యముఁ బ్రయోగించుట కెదిరి బలాబలములు కనుఁగొనవలెను. భేదముచేత శత్రుబలమునుగొంత లోఁబఱచుకోవలయును. ఈవృత్తాంతము భీమరథునకుఁ దెలియఁజేయ వలెను గావున నీపనులకుఁ గొంతకాలవ్యవధి కావలయునని నామతము. మనకు భీమరథునివంటిసమసుఖదుఃఖభాక్కయిన మిత్రము లేఁడు. కులము బాగుచేసినవాఁడు కొడుకు, వ్యసన సమయమందును వదలని వాఁడు మిత్రుఁడు, ప్రజల నేలినవాఁడు ప్రభువు, సరసముగాఁ గవనము చెప్పిన వాఁడు కవి, కావున ననన్యసమాన పరాక్రముఁడగు భీమరథుని మనము

సహాయునిగాఁ బడసిన నీకు సూర్యునకువలె సమ స్త దిగ్విజయము సులభ"మనుచు మంత్రులందఱు నుడివిన మంత్రము విని ఘనలసమయిన బుద్ధితో సమరకాలముఁ బ్రతీక్షించుచుఁ బద్మనాభ నృపుండు కాలము గడపెను.

ఇ ది ద్వా ద శ స ర్గ ము.

## త్ర యో ద శ స ర్గ ము

*

తరువాతఁ బద్మనాభనృపాలుండును భీమరథప్రముఖులగు మిత్రులకు వార్తయంపి వారు వచ్చినవెనుక గగనవిశాలమగు వక్షస్థలంబున ముఖచంద్రుని సేవించుటకై వచ్చిన నక్షత్రములవలె నలరారు ముత్యాల హారంబులలంకరించుకొని కుండలములయందలి పద్మరాగమణుల కాంతిచేఁ బూయఁబడిన బుజములు సిందూరపంకముచే నలంకరింపఁబడిన కరికరంబులవలెఁ దనరారఁ, గిరీటమందుఁ దాపడము చేయఁబడిన నవరత్నములకాంతు లాకసమునం దింద్రధనస్సు నుదయింపఁజేయ మండలాధిపతుల నందఱిని జయింపఁగల భుజములవలని భయంబున మండలాధిపతులగు సూర్యచంద్రు లా భుజములను శరణుజొచ్చిరో యనఁ బ్రకాశించు బాహుపురులతో మొలనూలునందలి వేల్పురాతాల మిసిమిచే నిండి యమునాహ్రదము ననుకరించు నాభీబిలముతోఁ, గుముద పాండురంబగు శ్వేతాతపత్రంబు ధరించి వాహినీశతసమన్వితుండై పృథివీపాలునిపై దాడివెడలెను. సామంతరాజులందఱును దేవతలు దేవేంద్రునివలె నారాజపురందరు ననుసరించిరి. సాదులచేఁ గశాఘాతములచేత నదలింపఁబడుచుఁ దురంగములు భయమునఁ బాఱిపోవు పిల్లలుగల రాజమార్గములయందు నడువసాగెను. బంగారుకుధములచే నలంకరింపఁబడిన గజరాజములతో నిండిన పుడమియంతయు మెఱపు

తోడి మేఘములతోనిండిన గగనమునకుం బ్రతియయ్యెను. రాజొక్కఁడే మదవద్రిపులఁ బరిమార్పఁజాలును, మీ రేటికి ? అనుక్రమమున మదధారాప్లుతంబులగు గండంబులందు గండుఁదుమ్మెదలు రొదసేయసాగినవి. మదపుటేనుఁగుల కటస్థలములనుండి స్రవించు మదమే లేకున్నఁ దురంగఖురోదితంబగు భూపరాగంబులోఁ బదాతులకు దారితెలియకయే యుండును; రథములు మాత్రము పరాగోత్సారణముచేత మిట్టపల్లంబులు వడిన పుడమిమీఁద నెగుడుదిగుడుగా నడువవలసి వచ్చెను. మా రాజితరులకరపాతమును సైఁపఁడని తెలియఁజేయుచున్నవో యన ధ్వజినీధ్వజపటంబులు మార్తాండమండలమును గప్పివైచెను. పద్మనాభనృపాలుని పరాక్రమబీజములు చల్లుటకుంబోలె రథచక్రములు పుడమి దున్నుకొనుచుఁ బోవ మదగజంబులు మదధారావర్షంబులచే నాభూమిం దడుపసాగినవి. రాజులు తమతమ భటులను వదలి కొన్నియడుగులు నడుచునప్పటికి వారు వేగముగఁ దమతమ యోధయులను గలసికొనిరి. ఇనుపకత్తలంబులును గత్తులును దాలిచి భూమినంతయుఁ గప్పియున్న కాల్బల మీ నృపాలుని తేజోభాస్కరునకు జడిసి వచ్చిన తిమిరమండలమువలెఁ బ్రకాశించెను. కృతసమున్నతవంశపరిగ్రహయు గుణవిశేషవిభూషితవిగ్రహయు ముష్టిగతయు నగు యోధులచేతులలోని ధనుర్లత కులవధువువలెఁ గాన్పించెను. జలదములవంటి భద్రగజముల నెక్కి నడుచుచున్న యంతఃపురకాంతలు మెఱపులవలెఁ బ్రకాశించిరి. ఆనాఁడు దండయాత్రకు వెడలినప్రజలేకాదు, వారిని జూడవచ్చినవారుగూడ దశదిక్కులయందుఁ బిక్కటిల్లఁ బురము సర్వ మల్లకల్లోలముగా నుండెను. పురకాంత లందఱుఁ దామరపువ్వులవంటి కటాక్షములచే నా రాజభాస్కరునిఁ బూజింపసాగిరి. రమణీయమగు వస్తువును జూచినఁ గౌతుకము లేనివా రెవరు ? కొందఱు కాంతలు దర్శనోత్సాహమున వేగముగ వచ్చుచుండఁ బెక్కువితములగు వారియొడలి వికారములు పడుచువాండ్రకంటికి విందయ్యెను. వికృతస్వరముగా నఱచుచు మెడఁద్రిప్పుచుఁ గరినిఁజూచి భయంపడి పాఱిపోయిన లొట్టిపిట్ట

హాస్యముచేయు నటునివలె నందఱికిని నానందజనకమయ్యెను. యుద్ధములో భోజనాదులకొఱకుఁ బదార్థములన్నియు బండ్లమీఁదఁ గుండలయందు నిడికొని పోవు కోమటుల హృదయములలోఁగూడఁ గుండలు పగిలిపోవునటులు కరిఘీంకారమునకు జడిసిన పొగరుగిత్తలు బండ్లులాగ సాగినవి. ఏనుఁగు దగ్గఱకువచ్చు చున్నదని యెఱుంగక నడచుచు హఠాత్తుగఁ దిరిగిచూచి భయంపడి నెత్తిమీఁది పెరుఁగుకుండ పగులు నటులు గొల్లది పరుగెత్తసాగెను. రాజాంతఃపురకాంత లెక్కిన యేన్గులకుఁ జుట్టుఁ గట్టిన బురకాలతోఁ బురము చూచువారికిఁ దెరచాఁపలెత్తిన పడవలతో నిండిన సముద్రమువలెఁ గన్పడెను. పెద్దబరువుకావిళ్ళు మోయువాండ్రు తమదారి కడ్డముగా ముందునడచుచున్న యేనుఁగులను దాఁటి పోలేక బరువుచే నొడలు కుంచితముగాఁగ బాధపడఁజొచ్చిరి. మూఁకమూఁకలుగ బారులుగట్టి నరనాథుని ప్రయాణముఁ జూచుచున్న పౌరానీకమువలనఁ గొన్నిచోట్లఁ బురవీథులు తరంగతరంగితంబులగు మహానదులచందముగా నందమజూపసాగినవి. పటహధ్వను లలసులై యప్పటికి బయలుదేఱని భటులను దలవట్టి యీడ్చి తెచ్చుటకుఁబోలెఁ బ్రతిగృహమును బ్రవేశించెను. క్షితిపతియు యుద్ధమునకుఁ బోవునపుడును బెండ్లికిఁ బోవునట్లు వచ్చుచున్న తనభటులను జూచుచు ముదితాంతరంగుఁడై యరదము నధిష్ఠించెను. చల్లనిపరిమళానిలము మిత్రునివలె నెదురుగా వచ్చి యతనిం గౌఁగిలించుకొనియె. ఈప్రకారముగా శారదయాత్రికు వెడలి యెడనెడ వికసితసరోరుహంబులగు సరస్సులను స్వచ్ఛములగు నదులను విలోకించుచు మనోహరవయోవిరాజితంబులును విమలాంబరంబులును బృథుపయోధరంబులు నగు దిక్కులనుఁ జూచి భార్యల నాలోకించినట్లానందించుచుఁ గంబళులు గప్పుకొని యేమేమో పురాతనగాథలు చెప్పుకొనుచుఁ జనుదెంచు ముసలిగొల్లల సంతోషపెట్టుచు, వారొసంగు దధిక్షీరోపాయనంబులఁ గొనుచు నితంబములయుఁ గుచంబులయు బరువుచే గజీగజలాడుచుఁ బిట్టలనుదోలుటకై యాయాసపడుచున్న శాలికాపాలికలను జూచి "యొక్కొకతతి

మంచిపస్తువులుగూడఁ జెడ్డవస్తువులగునుగదా'' యని తలపోయుచు వాంఛ్ర గుండ్రమైనబకాయలం బోలు కుచములయందు నిండించిన లావణ్యరసమును కన్నుఁ జేరల జుఱ్ఱుచు, ఫలపాక గౌరవముచే వంగిన సస్యములనుఁ జూచి సత్పురుషులను స్మృతికిఁ దెచ్చుకొనుచు, సరస్సునంచు క్షణకాలము సహచరు ననుసరించియు మరలఁ దిరస్కరించుచున్న యాఁడురాయంచం జూచి తిర్యగ్జాతులయందుఁ గూడ స్త్రీజాతికిఁ గైతవము సహజమైనదని తెలిసికొనుచు, నిర్వివాదముగా నగపడుచున్న పొలిమేరతో సకలసస్య సంపన్నంబై తెల్లని యావులతో నిండియున్న పల్లెలను జూచుచు నానందించెను. మఱియు నొక తటాకంబునఁ బ్రియనికై తామరతూఁడు నోటఁగఱచుకొని యిందమని యందిచ్చుచున్న చక్రవాకము నిరాకరించు చక్రవాకింగని పక్షులయందలి ప్రణయకలహమును గూడ నభినందించెను. ఉఱుములవలె మ్రోయు కవ్వపుఁ జప్పుళ్ళకుఁ బురులువిచ్చి యాడుచున్న నెమ్మి గుంపులతో నింపౌసంగు గోకులంబులయందుఁ బండిన భూములయందును నాగళ్ళుగట్టిదున్ను భూములయందును నాసతీలక వృషభమువలెఁ దిరిగెను. కాముక మనశ్శయ్యలయందు నిద్రించు మన్మథుని లేపుటకై యేర్పఱచిన మంగళ గీతములవలెనున్న హంస ధ్వనులను వినెను.

ఇప్పగిదిఁ గంటికి వింతైన పదార్థముల నన్నిటిం గనుచు సేనతో నడిచి మంచువంటి చల్లఁదనమును నైర్మల్యమును జిటిచిటితరఁగలును గలిగిన నీరముచే మిగుల మనోహరమగు నొకనదియొడ్డునకుఁ బోయి విడిసెను. జలకేళికై యేనుఁగులన్నియు నదిలోఁ జొరఁబడి యున్నపుడు పైకెగిరి మూఁగు తుమ్మెదలచే నదీపురంధ్రి సతిలకాభరణవలెం బ్రకాశించెను. మధురములుగఁ గూయుచుఁ బరస్పరము సయ్యాటలాడుచు విహరించు జల పక్షులతోడ నభిరామమై యొడ్డునఁగల నల్లతాటి పల్లకల కాంతిచే మిగుల నైగనిగ్యము గలిగి మొసళుల సూత్కారముచేఁ బైకెగరఁ గొట్టఁబడుచున్న ముత్యములవంటి జలబిందుల వలన నాకసమును దారకిత

ముగాఁ జేయుచుఁ దటద్రుమముల నుండి చల్లని యిసుక తిప్పలమీఁదుగా విసరుచున్న పిల్లవాయువులచే విమానచారు లగు దేవతా మిథునముల సురతాయాసములం దీర్చుచున్న యావాహిని నీరాజవాహిని చేరి నీటి దరిని దిరుగు పీతలును మకరములచేఁ గిల గింపఁబడు మధ్యప్రదేశ మును గల యానది యావలియొడ్డునకు దాఁటెను.

ఇది త్రయోదశసర్గము.

---

## చతుర్దశ సర్గము

0

తరువాత నారా జాకాశమునుండి పరస్పర సంఘట్టనమునఁ జోటు చాలక క్రిందఁబడిన మేఘముల గతిఁ దనరారు గుండ్రాళ్ళ సడుమఁ బ్రకాశించుచున్న మణికాంతులచే దీపదీపితమువలెనున్న మణికూట పర్వతమును బ్రవేశించెను. ఆ పర్వతమునఁ జంద్రుఁడు చూడామణియైకాని కానరాఁడు. నక్షత్రములు కనకోజ్జ్వలంబులగు దాని మేఖలలయందు మణిమయములగు మువ్వలగుచున్నవి. దేవతాస్త్రీలు బుక్కాముకొఱకై యంటించిన యగరువత్తులనుండి వెడలు ధూమ మాకసమున గుములు గట్టి సర్వదా మబ్బుపట్టినట్లాగిరికి నీడయొసంగుచుండును. కిన్నర కామి నులు పాడు సంగీతము విని కదలలేక సజీవప్రతిమలవలె నున్న మృగ యూథములాగిరిపై సంచరించు విమానచరులకుఁ గన్నులపండువు చేయు చుండును. గుహాముఖములయందున్న మేఘములు సూర్యకిరణములను లోనికిఁ బ్రసరింపకుండఁ జేయుచున్నను తమ మెఱపులవలననే లోపలఁ గాఁపురమున్న దివిషదులకు భార్యలను గనిపించుటంజేసి యిష్టములే యగుచున్నవి. సూర్యోపాసనవలనఁ దపోవృద్ధిగాంచిన యోగిజనుల ప్రభావమువలనఁ దద్గిరి శృంగము నెక్కిన నరులెన్నఁడును రోగపీడితు లుగారు. మేఘమండలముకంటెను బైనున్న తద్గిరినితంబములలోని

దిగుడుబావులకు విద్యాధరస్త్రీలు జలకమాడుటకుఁ దగినంత నీరు ప్రతిదినముఁ జంద్రికిరణములచే ద్రవించు చంద్రికాంతశిలలే యొసంగుచుండును. ఓషధుల వాసనచేతనే విషము పిఱిగిపోయిన నల్లత్రాఁచులతోనిండియున్న చందనవనములందుఁ గొంతలు కాంతులతోఁగూడ నిర్భయముగ విహరింతురు. మేఘములవలె రమణీయములైన తద్గండోపలములయందుఁ గూర్చుండిన విమానచరుల దేహచ్ఛాయ మెఱపులవలె మెఱయుచుండును. నిముసములోనె సూర్యకిరణములచేఁ దప్తములైన సూర్యకాంత ప్రదేశములనుండి కుచభారముచేఁ గదలలేని గంధర్వ స్త్రీలు తమ యవయవములమీఁదనే కోపగించుకొనుచుండిరి. సురతాయాసముం బోనడంచిన తద్గిరి మందవాయువులకు స్వకీయ నిశ్వాసపరిమళ మొసంగి దేవతావనితలు ప్రత్యుపకారము చేయుచుందురు. ఆసవము త్రాగి యొకతెఱుంగక మనోవికారము బైలుపఱచుకొనుచున్న వేలుపుం బిన్నవయసువారికిఁ గొంతలను బతిమాలుకొనుటయం దచటి భృంగములుకూడ సహాయము చేయుచుండును. మొగులుఱిమినట్లు వినఁబడు సెలయేళ్ళ చప్పుడు విని నాట్యము సేయు నెమిళ్ళచ్చటి దేవతలను దివ్యాంగనా నృత్యమునం దాస లేనివారినిగాఁ జేయుచుండును. జలధారాపూరితములగు గుహలలో వేసవియందును, మంచుమాటయైన నెఱుఁగని గుహలలో శరదృతువు నందును నివాసముచేసి సిద్ధులేండ్లకేండ్లు గడపుచుందురు. సేవింపఁదగిన గుహలును, నెడతెగక పాఱు సెలయేళ్లును, విశృంఖలంబుగఁ దిరుగు నేనుఁగులును, నయనాభిరామంబులైన చమరీ మృగంబులును దేవతలచే నివాసములుగాఁ జేసికొనఁబడిన మాధవీమండపంబులును వికసితకమలంబులగు తటాకంబులును, నమలోపలంబులగు చఱియలును గలిగిన యా మణికూటపర్వతమును జూచిన నెవరికానందము గలుగదు! ఎవ్వరు విస్మయపడరు! తమ్మిపుప్పొడితోఁగూడఁ గలసిన తెల్లని యిసుము తిన్నెలతోఁ గూడిన నదీప్రవాహంబులను జూచిన వేడుకపడనివాఁడెవఁడు! అభూమీధరమునందు దిరుగు సురయువతులకు వదనాలంకారము చేసికొనుటకై చంద్రబింబమే యద్దమగుచుండెను. అందుఁ బూచని చెట్టును మణిదీపములు

లేని గుహలును, దేవతలచే సేవింపఁబడని చలిపందిళులును, గంధాలంకృత ములు గాని చెఱువులును లేవు. సువాసితములైన తెల్లని పట్టులు కట్టు కొని కామినులతో నవిరత సురతములఁ జేసిన విపిన సిద్ధులు మధుకర రుతములు వినుచు నందలి పడియల యందుండి మందమారుతమును సేవించుచుందురు. రత్నదీపము లాస్ఫటికశక్యములు గాని ప్రకటం జేసియుఁ దమ కితరగంతవ్య ప్రదేశము లేకుండుటంబట్టియుఁ గట్టుబట్ట లను లాగుచున్న ప్రియుల కన్నులు మూసియే పమస్కరలను గాపాడు కొనుచున్న ఖచరాంగన లింద్రనీలమయములగు తటస్థలముల యందుఁ బ్రతిఫలించిన పుష్పగుచ్ఛముల మీఁద వ్రాలుచున్న మధుకర నికరము లంజూచి విస్మయపడు చుందురు. తటగతములగు నల్లరాళ్ళ కాంతిచే నచటి మేఘములు శరత్కాలము నందును నీలచ్ఛాయఁ బాయకుండును. మధురములగు కోకిలా కుహూస్వరములు చైత్రారంభమందు మానవతుల మానము నుడిగించి పడుచువాండ్రతోఁ గలుపుటకు దూతీకృత్యము చేయు చుండును. ఆకసమునుండి పోవుచున్న పక్షుల ప్రతిబింబములను రత్న క్షోణి యందుఁజూచి యవినిక్కంపుఁ బిట్టలని వానింబట్టుకొనుటకై యెడుపు వేయుచున్న యడవిపిల్లిపిల్లంజూచిన దివ్యకాంతల దృష్టు లింకొక చోటికిఁ బోకుండెను. సమస్తపాపహరమై మహాముని నివాసమై యోషఁ గుల కాకరమై దేవతా దంపతులకుఁ గేళిభూధరమై మేరు పర్వతముతోఁ బోల్పఁ దగిన యా మణికూట పర్వతమునం దింద్రనీల మాణిక్య ముల కాంతులచే బలిసిన కటిక చీఁకటి గల గుహల యందు డాఁగుడు మూఁత యాటయందు డాఁగిన దేవతాస్త్రీలను నుచ్ఛ్వాస పరిమళితం బగు వాయువే భర్తలకుఁ దెలియఁజేయు చుండును. ఒడ్డయుందుఁగను మితఁబులై కలకలలాడుచుఁ దుమ్మెదలకు నివాసంబులైన నీటిప్రబ్బలి యెండవేఁడిమికి వాఁడిపోకుండ నెడనెడ నుప్పొంగు నదీ ప్రవాహమే రక్షించుచుండును. ఇందలి యోగులు వాయుపూరణము మొదలగు యోగ ములచే నాయువు పెంచుకొనుచు నాయు వున్నంతవఱకును సత్కర్మములు చేయుచుందురు. చెట్లకొమ్మల నడుమనుండి ప్రసరించు సూర్యకిరణము

లచే మండితంబు లైన యింద్రనీల శిలాకుట్టిమంబు లకాలముల యందు గూడ నీలకంఠములకు మెఱపుతోఁ గూడిన జలదంబులను భ్రాంతిని బుట్టించి యాడించుచుండును. మిన్నంటుచున్న మల్లితీఁగల కొనలకు రాత్రులయందుఁ దగులొ్కనిన నక్షత్రములే పుష్పగుచ్ఛ భ్రాంతిని గలిగించుచుండును. తామరకొలంకుల నుండి పైకెగురుచున్న కెందమ్మి పుప్పొడి దిక్కాంతల నెఱ్ఱచీరలు కట్టుకొన్న వారినిగాఁ జేయుచుండెను.

అని సేనాపతి వర్ణించిన పర్వతవర్ణనమును విని రాజు దానిరామణీయకమునకు సంతసించుచు నందుఁ గొన్ని దినంబులుండఁ దలంచెను. సేనా నివేశమునకుం దగినకుసుమిత వన ప్రదేశము కనుఁగొనుట కుదయము మొదలు మధ్యాహ్నము వఱకుఁ దిరుగఁగా దిరుగఁగా శ్రమపడిన యాభూపతికిఁ దుదనొక ప్రదేశమునందు నిలుపుటకుం దగిన బుద్ధి పుట్టెను. చెమటబిందువులచేఁ గై సేయఁబడిన ప్రియురాండ్ర గండస్థలము లాలోకించు నాలోక పాలునకు బాధాకరంబైనను సూర్యరశ్మి యభిమతమే యయ్యెను. ముందుపోయి పటమయంబు లగు గృహంబు లేర్పఱచుకొని యంగడిపెట్టి సమస్త పదార్థము లమ్ముచున్న కోమటి యంగళ్ళయందుఁ దిరుగులాడు సైనికుల కలకలము వినుచుఁ దోరణాలంకృతం బైన తన గుడారము నారాజు చేరెను. పెక్కు దిక్కులనుండి ప్రవహించుచు వచ్చిన నదులచే సముద్రమువలె నన్ని వైపులనుండి వచ్చిన సేనచే నాప్రదేశము మిగుల వ్యాకులంబయ్యెను. సేన విడిసిన యొక్కగడియలో రాజుగారుండుటకుఁ దగిన ప్రదేశంబును వారి యంతఃపురంబులు నిలుచుటకుం దగిన తావులును, బణ్యాంగనలు నిలుచుట కిక్కయు నేర్పఱచి, ధ్వజాదు లెత్తించి, తోరణంబులు కట్టించి, రాజధానివలె, దత్ప్రదేశము నలంకరించిన యుద్యోగుల చాతుర్యమునకు రాజు మిగుల సంతసించెను. వేశ్యలప్పుడే మార్గాయాస పడి వచ్చిన పరిచితుల కుపచారము చేయుటకై ద్వారములయందు నిలిచి యుండి లోనికిం దీసికొనిపోఁబడిన విటసైనికులకుఁ జిరకాలమునుండి యందే కాఁపురమున్నవా రను బుద్ధి పుట్టించిరి.

కొందఱు జనులు నడచివచ్చి యుండుటచేసి జంఘాబలము చాలక యొక్కఁడుగిడుటకైన నశక్తులై తమవారి పిలువఁబోయి తెలియక యున్న రుస్సురనుచు నడుమ నడుమ వంగి చేతులతోఁ బిక్కలు పిసికికొనుచుం దమవారిం బిలుచుచుఁ బోసాగిరి. సిద్ధపఱచిన వంటకములందలి యింగువ మొదలగువాని వాసనచే ఘుమఘుమ పరిమళించు దిక్కు లాయాసపడి నడచి వచ్చుచున్న కొందఱు కుక్షింభరుల పరిశ్రమమును బోఁగొట్టెను, సెలయేటి నీటితుంపురులచేఁ జల్లఁబడి వికసిత చేపవాటు వనంబులనుండి వచ్చుచున్న కొండగాలి గుడారముల యందు విచరించుచున్న రాజుల పరిశ్రమమును దొంగిలించెను. సుఖముగఁ గ్రిక్కిఱిచుఁ దమమీఁది బరువు దింపినవెంటనే నేలఁబడి దొరలుటకుం దగిన ప్రదేశము వెదకుకొని పొరలుచున్న గుఱ్ఱములచే నాశిబిరసముద్ర మావర్తవంత మయ్యెను. రవుతులు దిగినతోడనే సకిలించిన జాత్యశ్వముల ధ్వనులచే నాప్రదేశ మంతయుఁ గొంతకాల మితర ధ్వని వినఁబడకుండ నుండెను. ముల్లాడిం చుచు నీళ్ళుత్రాగుటకై కాసారమధ్యమునకుం దిగిన తెల్లని గుఱ్ఱములు చలత్తరంగమైన యాకొలనునం దగపడకయే యుండెను. నీళ్ళుత్రావిన పిమ్మట నశ్వము లన్నియు జాళ్ళేటి దాగుచేసిన మందురల యందుఁ బ్రవేశించినవి. ధ్వజపటములు మొదలగు బరువుదింపి జలపానమునకై చెఱువుదరికిం దోలుకొని పోఁబడిన యేనుఁగు లానీట దిగుటకు భయపడి యిట్టటు పరిభ్రమించు నపుడు ప్రళయాంత మారుతముచే విఱుఁగగొట్టఁ బడిన పర్వతశిఖరములో యనునట్లుండెను. నీటిలో మునిఁగి కడుపునిండఁ ద్రాగి మరల నాసారంధ్రములం బీల్చి పైకిఁ జిమ్ముచున్న యేనుంగులు తమ యాయాసముం బోఁగొట్టుకొనుటయే కాక యెుద్దునఁగల జనుల యాయాసమును గూడ జలబిందు వర్షముచేఁ బోఁగొట్టఁ సాగినవి. సంజ కెంజాయచే నెఱ్ఱబడిన మేఘము లాకాశమున కెట్టిసొంపు సంపాదించునో యట్టియందమును సిందూరంగాలంకృతంబులగు మాతంగము లాకాసారము నకుం దెచ్చినవి. దిగినపు డంతగా లోఁతులేని కొండకాల్వలు దిగిన వెనుక నాయేనుఁగుల మదప్రవాహముచే వెల్లివిరిసి యవి యూఁదులాడు

టకుం దగినట్లుండెను. ఇప్పగిది సేనాగజములన్నియుఁ బరిమితకాలము జలక్రీడఁ గావించినపిదపఁ జెట్లకుం గట్టఁబడినవి. ఒకచెట్టునకుఁ గట్టఁబడిన మత్తగజము దానియందుఁగల యడవియేనుఁగు మదము నాఘ్రాణించి తనకు నీడయిచ్చు దానికొమ్మలే విఱిచివైచెను. అసమయకోప మెన్నఁడును శ్రేయస్కరము కాదుగదా ! మదప్రవాహము కాల్వలై పాఱఁ జెట్టుచెట్టునకుం గట్టఁబడిన నల్లనియేనుంగులచే నాకొండ తనకుఁ గల్గిన మహావైభవము జూడవచ్చిన చుట్టపుఁబర్వతములచే నిండినట్లుండెను, గ్రాసముపెట్టునపుడు నడుమనడుమ రుచికొఱకై యందుగు చిగుళ్ళందించుచున్న హస్తిపాలకులపైఁ బూర్వవనస్మృతిచేఁ దిరస్కారము సూచింపసాగినవి. లొట్టిపిట్టలన్నియు భారము దింపఁబడుటచేఁ జులకఁబడి నీళ్ళుత్రాగి తమ యాయాస మడంచిన కొండకాల్వ లన్నియు బురద గావించెను. ఖలప్రియులకుఁ జేసిన యుపకార మపకారము కాకమానదు. వృషభము లన్నియు నీళ్ళుగ్రోలి పచ్చగడ్డి కడుపునిండఁ దిని చెట్లనీడఁ బరిశ్రమసూచకంబు లగు నరమోడ్పు గన్నులతో నెమరువేయసాగెను. గుహాలయందు సంగీతము పాడుకొనుచున్న కిన్నరుల చెవులకు క్షణకాలము లొట్టియల యఱపులచేఁ గొంత వికారము కలిగెను. పొడవైన తమమెడలు సాచి చిగుళ్ళు తినుచున్న యుష్ట్రములం జూచి పాలచెట్లు క్షీరమిషంబున సంతోషబాష్పములు విడువసాగెను. మహాత్ములు గ్రాసార్థులయెడలఁ బాత్రాపాత్రతల లెక్కింపరు. తెల్లని పటకుటీరములును రమణీయంబులగు తురంగంబులును మత్తగజంబులును గలిగినయాస్కంధావారమును నురుఁగు గుంపులును దరంగపంక్తులును నక్రచక్రంబులును గల పయోరాశి యపారమైనయెడల జయింపఁ గలదు.

ఈపగిది మణికూట పర్వతమున విడిసియున్న పద్మనాభ నృపాలుని రాకవిని పృథివిపాల నృపాలుఁడును యుద్ధ సన్నద్ధుఁడై యాగిరికి వచ్చెను. ఆయిరువురు రాజుల యుద్ధమును జూడవలెనను కుతూహలము చేతంబోలె శశాంక భూషితయు వికసిత తారానేత్రయు నగు రాత్రియుఁ

జనుదెంచెను. ఆరాత్రియందు శత్రుబలము కూడఁ జనుదెంచెనని వి
తనబలమునకుఁ గాపుదల చేసికొని సైనికుల కంపఱకు సంగ్రామచర
నుపదేశించి పద్మనాభ నృపాలుఁడు శయన గృహముం జేరి విలాసిన
లతో సుఖముగా నిద్రించెను. భువనత్రయ దీపమైన చంద్రుఁడు దై
యోగమున నస్తమింపఁ దారాలోచనములను మూసికొని రాత్రియు
దదీయ విరహపాండురమైన శరీరముతో వెడలిపోయెను.

ఇది చతుర్దశసర్గము.

## పంచదశసర్గము.

*

మరునాఁ డుదయమున నుభయ సేనాభాగములనుండి పటహధ్వని వెడలెను. మేఘ గంభీరమగు నాధ్వని దిగంతరములన్ని యువ్యాపించుటం జేసి యొక శత్రుసేనయేకాదు భూమియంతయుఁ గదలెను. దిగ్గజములు కూడ మదము వదలినవి. ఇఁక శత్రుకీటముల లెక్కేమి! యుద్ధము చేయుటకుం గుతూహలపడు భటుల మతులనిండఁ హర్షంబును శరీరము నిండ బులకలు నిండినవి. పోరునకుఁ గాలుత్రివ్వు వీరభటు లందఱును నుపకరణములు దాలిచి సన్నద్ధపడి యుండిరి. ఒకఁ డొడలుప్పొంగుటఁ జేసి బిగువైన కవచమును మరల వదలుట కిష్టపడకపోయెను. కరస్పర్శ వలన శరీరము పులకరించిన భర్తంజూచి 'నాథా! నీకు యుద్ధమందతి కుతూహలము లేనట్లున్న' దని భార్య యాక్షేపించెను. మఱియొకనాతి సమరోత్సాహమునం బులకరించిన భర్తమేను తన వలుదగుబ్బ లగపఱచిన మఱింత పులకరించునని యవి కనపడకుండఁ జేసెను. ఈపగిది రణరణరణ కంబున భటులందఱు ముందఱ నడువఁ బద్మనాభ నృపాలుండు పూర్వపుణ్యము కవచముగా నుండ మఱేల లోహకవచమన్న పగిది కవచము దొడుగకయే బయలుదేఱెను. మూర్తరకు అభేద్యంబై మూర్తి

మంతమైన తేజంబువలె నున్న తనుత్రాణ మలంకరించుకొని భీమరథుండు రాజునకుఁ దోడై నడచెను. భీమరథుని కొడుకుగూడఁ దండ్రి ననుసరించెను. ఈగతి సమరంబునకు వెడలి యాహవదోహలులగు భటుల నంచఱ నొక్కసారి ప్రసాద మకరందమును జిమ్ము కటాక్షకుసుమములచే గౌరవించి భీమునకుం బంగారు బట్టలును, సుభీమునకు మణికంకణంబులును, మహాసేనునకు మకుటంబులును, సేనునకు ముత్యాల దండలును, జితారింగునకుఁ జూడారత్నంబును, బరంతపున కొంటిపేట దండయు, గంతునకు రతనంపుం గంటియుఁ సుకుండలునకు మణికుండలంబులును, భీమరధునకు విలువలేని మణులుగల హారమును, మహీరథునకుఁ దనమేనగల నగలన్నియు నిచ్చి బహూమానించెను. మఱియుం గొందఱికి గుఱ్ఱము, లేన్గులును రథములు మొదలగునవి తగుగతి గానుకలొసంగెను. ఈప్రకారముగా నొడయనిచే సత్కరింపబడిన సేన చక్రములు బాణములు శస్త్రములు నస్త్రములు మున్నగునవి దాలిచి శత్రుభీకరముగా దాడివెడలెను. అరదమెక్కి తండ్రివెనుక నడచు యువరాజైరావతము నెక్కి నడచు దేవేంద్రు ననుసరించు సూర్యునివలెఁ బ్రకాశించెను. సమున్నతమైన గజేంద్రము నెక్కి భీమరథుండు నుసూర్యుని ప్రతాపమనుసరించిన వడుపున నతని ననుసరించెను. మహీరధుండును నిజమనోరథమువలె నుండు రథముమీఁదఁ బెక్కుసాధనముల నిడుకొని వెడలెను. మఱియు వేలకొలఁది రాజు లానృపాలు ననుసరించిరి. ఆరాజు ననుసరించిన చతురంగబలంబులు నదీప్రవాహములు సముద్రోదకమును వృద్ధిచేసినపగిదిఁ బద్మనాభ నృపాలుని సేనలను వృద్ధిపఱచెను.

ఈపగిదిఁ బృథివీపాల నరపాలుని పైకి వెడలిన పద్మనాభునకు శుభసూచకంబులగు శకునంబులు దీర్చెను. నక్క యెడమవైపు నుండి కుడివైపునకుఁ బోయెను. వామభాగమునం దొర్లుచు గాడిద యఱచెను. ఎచటనుండియో వచ్చి భరద్వాజపక్షి ప్రదక్షిణముగాఁ దిరిగెను. పాలచెట్టుమీఁదఁ గూర్చుండి కాకి కూసెను. దానంజేసి యేన్గులకొక యపూ

ర్యోత్సాహము కలిగెను. భటులందఱికి మేనులు పులకరించెను. ఈశకు నములచేతను సేనకుఁ గలిగిన సంతసముచేతను నృపాలునకు జయము లభించినట్లే సంతోషము వొడమెను. పద్మనాభుఁడు వెడలెనను వార్త విని పృథివీపాలుఁడును నిజసేన నాయత్తపఱచి వెడలెను. వెడలు నపుడు దక్షిణభాగమునుండి నక్క కూయుటయు మాటిమాటికి వేల కొలఁది తుమ్ములు వినఁబడుటయు పాము నడచిన త్రోవలు కానవచ్చు టయు ముండ్లచెట్లెక్కి కాకులు పరుషముగాఁ గూయుటయు గుఱ్ఱముతోఁక కాలిపోవుటయు నార్తనాదము వినఁబడుటయు ఘనమునందుఁ బ్రతికూల మగు వికారము లెన్నియో పొడముటయు మున్నగు దుశ్శకునము లెన్ని కలిగినను వానిని లెక్కింపకయె శత్రుసేనం దాఁకెను. ప్రళయ కాల వాయువులచే క్షుభితములగు పూర్వ పశ్చిమ సముద్రములవలెఁ దాఁకి యారెండు సేనలకును బరస్పర సంఘట్టము కలిగెను. గాని గుఱ్ఱపు డెక్కల తాఁకువలనఁ బుడమినుండి రేగిన పరాగము మాత్రము క్షణకాల మంతరాయముఁ గలిగించెను. కాల్బలము కాల్బలముతోడను, సాదులు సాదులతోడను, మావటీళ్ళు మావటీళ్ళతోడను, రథికులు రథికులతోడను, డీకొనిరి. అస్థిరములైన ప్రాణములచే స్థిరములైన కీర్తులు సంపాదింపఁ దలఁచి యుద్ధమార్గ విశారదులగు భటులు శరతాడితములగు శరీరముల బాధను లెక్కింపక పోరాడి గతాసులు కాసాగిరి. ఎవ్వని నెవఁడు శస్త్ర ముచేఁ గొట్టెనో వాఁడు మరల నొక్కింత సేదదీర్చుకొని వానిమీఁదికే పోసాగెను. విల్లు విఱిగి త్రాడు తెగి తూణీరము వట్టిదైనపిదపఁ గొంత తడవు కత్తులతోడను, గొంతతడవు చేతులతోడను, పోరాడసాగిరి. ఒకఁడు పగవానిచే విడువబడిన లోహమయ శరములు శరీరమంతట నిండినను గంపింపక చిలవలెత్తిన చెట్టువలెనే నిలువఁబడెను గాని పాఱిపోవుటకు యత్నింపఁడయ్యె. తెగిపోయిన యొకని తలఁజూచి యెన్నఁడుఁ జావె ఱుంగని సురలు విస్మయమును భయమును బొందసాగిరి. మాంసము నంజుకొనుచు రక్తము కడుపునిండ గ్రోలి నాట్యము సేయుచున్న ఢాకి నులకు నాట్యకోవిదములైన కబంధములు నాట్యము కఱపసాగెను. భయ

ముచే సూర్యుఁడు కూడ దాఁటిపోయెనో యనునట్లు రణరంగమంతయుఁ గటికచీఁకటిచేఁ గప్పఁబడెను.

ఆసమయంబునందుఁ బద్మనాభ నృపాలుఁ డొక్కొక్క వీరపురుషుని జయించినపు డెల్లఁ దన భటుల కొక్కొక్క బహుమతి యిచ్చుచుండెను. ఎదిరిం దెగఁగోయుటకై చేతఁగత్తి యెత్తుచుండఁగనె రెండవవాఁడు వాని శిరముం దెగనఱకఁ దత్కబంధము మాత్రి మట్లనే నిలువఁబడెను. కత్తులు జాఱిపోయినచోఁ జేతులతోడను, జేతులును దెగిపోయినయెడల గాళ్ళతోడను, గాళ్ళును విఱిగిపోయినపుడు మాటలతోడను నుభయసైనికులును బోరాడిరి. ఏనుఁగు లేనుంగులను, గాల్బలముఁ గాల్బలంబును, దురగంబులు తురంగంబులను దేరులు తేరులను బడఁగూల్ప సాగినవి. ఒకచో నేనికకళేబరంబును నొక్కవైపున వీర కళేబరంబును నొక చాయ దురంగ శవంబులు నొకచోట విఱిగిన యరదఁబులును గల యారణభూమి యడుగు మోపుట కెడము లేకుండ నుండెను. ఇప్పగిది ఘోరయుద్ధంబు జరగఁగాఁ బృథివీపాల నరేంద్రుని సేనాధిపతి తనబలం బంతయు రూపఱుటయు హతశేషులు వెన్నిచ్చుటయుఁ జూచి తాను ధీరము తెచ్చుకొని "ఓ సైనికులారా ! మీరేల పరుగెత్తెదరు ? మీకిది న్యాయమార్గము కాదు వ్యసనము దొరఁకొన్నపుడే ధైర్యమును శౌర్యమునుఁ జూపవలయును. మీరెన్నఁడును శత్రువులకు వెన్నుఁజూపినవారు కారు, కావునఁ బిఱికితనముం బూనకుఁడు. నేనిదే రణభారము వహించితిని. అస్థిరంబులగు నసువులచే స్థిరమైన యశము నార్జింపుఁడు. మిమ్ము నమ్మిన ప్రభువు కార్యమును నెరవేర్పుఁడు. రణమందు మరణమైనను మేలుగాని పలాయనము మేలుగాదు" అని హెచ్చరించుచుఁ జండంబులగు భుజాదండంబులఁ గోదండంబు సారించుచుఁ మార్తురందాఁకెను. తాఁకుటయేకాదు, త్రుటికాలములోఁ శత్రువాహిని నంతయుఁబంచబంగాళముఁ గావించెను. ఇట్లు విజృంభించిన పృథివీపాల సేనాధిపతియగు చంద్రశేఖరునిరాహువు సూర్యునిఁ బొదివినపగిదిఁ బద్మనాభసేనాపతి యగుభీముడు

తాఁకెను. వారియుభయులకును భయంకరంబగు సంగ్రామము జరగెను. అవిచ్ఛిన్నపాతంబులగు వారి శరములు తాఁకలేనేమో యని జడుపున వేల్పులు నైతము మింటనుండి దూరముగాఁ బాఱిపోయిరి. ఒండొకళ్ళ తూపులరాపిడి వలన చిచ్చుమంట రేగెను, రేగిన యంబావకుల తాఁకున జెండాలు కూలఁ, గూలిన జెండాలు ధనుష్టంకారకుపితంబులగు కుంజరంబులకు మఱింత బెదరు గలుగఁజేసె. భీమచంద్రశేఖరులు పోరాడుసమయంబునఁ బృథివీపాలసేనాని పద్మనాభ సేనాపతి కిరీటం బీవలనుండి యావలకుఁ దూఁడుపడునటులఁ గాఁడనేసి నేలఁబడఁగొట్టెను. భీముండును దన శక్తికొలఁది వాఁడియమ్మున వాని రొమ్మున నొమ్మ సిలఁ దాడించెను. మూర్ఛవోయిన చంద్రశేఖరుంజూచి యురిధూమకేతు వగు కేతుండు బయలుదేఱి శాత్రవబలమును దూలించుచుండ భీముఁడు దుర్మదవిషదూషితంబగు నా కేతుమహాసర్పంబునకు గరుత్మంతుఁడై యతని శరీరం బాపాదమస్తకంబుఁ గంకర జిహ్వకఁ బొడిచినపగిదిఁ జిదుకఁబొడిచె. పిదప నాతనియవస్థఁ జూచి ప్రతాపవిరోచనుండను విరోచనుండు తేరెక్కి రా, నేనుం డిభరాజమునెక్కి వానినెదిరి పలాయమానుం గావించెను. తరువాత మహారథుఁ డనువాఁడు విల్లువిదిర్చికొనుచు వచ్చి శత్రుపతాకినిపై శరవర్షంబుం గురిపింపఁ బద్మనాభుఁ డెవ్వనిబలమున జయ మభిలషించుచున్నాఁడో యట్టి భీమరథుఁ దేవదత్తుఁ బాఱిపోయెనో తెలియకపోయెను. కాని కొంతవడికి మరలివచ్చి యమ్మహారథుం దాఁకెను. పదంపడి వారిద్దఱకుఁ బెద్దపోరు తటస్థించె. దేవతలంత యబ్బురపడి చూచుచుండ వారియువు రక్షతశరీరములతోఁ గొంతసేపు పోరిరి. నానాదిగంతములకు వ్యాపించు వారిబాణములు తాఁకుననియే. యాకాశము మూర్తిమంతము కాకయుండెను. జయలక్ష్మియు వరాభిలాషచే గతాగత పరిశ్రమమైనఁ దలపోయక వానిదగ్గఱనుండి వీనిదగ్గఱకు, వీనిదగ్గఱ నుండి వానిదగ్గఱకును దిరుగసాగెను. ఇట్లు కొంతవడి గడచిన యనంతరము మహారథుఁడొక శంకువుచేఁ దలపైఁ దాడించినంతమాత్రమున కేమంత్రముచే మహాసర్పము పగిది భీమరథుఁడు మూర్ఛజెందియు నిహా

సమునకుఁ గ్రమ్మఱ క్షత్రియధర్మ మవలంబించి యౌడుకఱుచు లేచి పగవానిం దాఁకి జీవగ్రాహముగా నొడిసి మెడఁబట్టుకొనియె. తండ్రికి జరిగిన పరాభవము సైపక మహారథునికొడుకు సూర్యరథుఁడు భీమరథుం దాఁకి తండ్రికన్న మిన్నయగు భుజాబలముం జూపుచుండ వారిలో మహీరథుఁ డడ్డపడియెను. సూర్యరథుఁడును బదాఱువన్నె బంగారుం బురణించు మహీరథుని యురస్థలంబున బదాఱుశరంబులు గీలింప వాఁడును వికట భ్రుకుటియగుచు నొక్కవాఁడితూపున నేపెడలింప సూర్యరథుండు సొమ్మసిల్లె. సారథియు నా యరదముందోలికొని యెటకేనిం బోయెను. దేవతలు మహీరథుని రథమునం బూలవాన కురిపించిరి. దిగంతములన్నియు స్తుతిపాఠములచే నిండె. సేనయంతయుఁ జెల్లాచెదరై కలవరింపసాగెను.

ఇట్లు తండ్రికొడుకులగు మహారథసూర్యరథు లిరువురు గతించుటయు సేన వ్యాకులపడుటయుఁ జూచి పృథివీపాలనందనుండగు ధర్మపాలుఁడు కోపముచే నొడలెఱ్ఱఁబాఱ శరాసనముఁ గేలం గీలించి చిచ్చరకన్ను విప్పిన త్రిశూలివడువున రణభూమి కేతెంచి యెదిరిన రాచగిత్తల మీఁదఁ బ్రళయకాలవారిదముచాడ్పున శరధారలు మొత్తెను.ధర్మపాలునిచే నిట్లు సేనలన్నియు గచ్చువిచ్చగుటయు సామంతులెల్లఁ బలాయనధీమంతులగుటయు నారసి పద్మనాభుని కుమారుఁడు సువర్ణనాభుఁ డతనిం దాఁకెను. ఆ యువరాజు లిరువురుం దార్కొనుట చూచువారికి మిగులఁ గన్నులపండువయ్యెను. ధర్మపాలుండును సువర్ణనాభునిపై విజృంభించి "ఓరోరి సువర్ణనాభ! పాఱక యేల నాముందఱ నిలవఁబడియెదవు, నీవంటి యనదమీఁదికి నాకత్తి పాఱకున్నది. నీతండ్రికి నీమూలముననే జయము గలుగు ననునాశ యెన్నఁడును లేదు. నీయంత నీవైన యోజించుకొనుము, అసమానకక్ష నీకేల. నీ వెంతటివాఁడవు? మీభీమరథుఁడును నీతండ్రియు నీవును గలసి నన్నెదిరినను నాకు జంకులేదు" అని నీచులకుపదేశించినమాదిరి నుపదేశింప యువరాజును నారిసారించుచు

"ఓరోరి యధమ ! యీ యధమాలాపములతోనేమి ? రాజబీజమునకుం బొడమిన వానిపగిది నేలపేర్చెదవు ! నీకభిమానమున్నచో రమ్ము. మాటలవలని విలంబమెందులకు ? నీయన్నపల్కులవంటి పల్కులు నాకును జేతఁగాకపోవు. మహానుభావులు తమ్ము నీచులతో సరిచేసికొనరు. ఎవరుచేసిన పాతకము వారినే కట్టికుడుపును. సుజనుఁడెన్నఁడొరుల నవమానింపఁ జూడఁడు" అని పరలఁ బ్రిత్యుత్తర మీయఁ బృథివీపాల నందనుం డవమానపడి తొడుటయు విడుటయుఁ దెలియకుండునటుల వేలకొలఁదిశరములు గుప్పించెను. యువరాజును వానిని మధ్యేమార్గంబు ననే తుత్తునియలు గావించెను. ఈ పగిదిఁ గొంతవడకు శరయుద్ధం బొనరించి యవి ముగిసినపిదపఁ గుంతములతోడను బ్రాసములతోడను గత్తులతోడను బోరాడిరి. ఇరువురు బలముకలవారే. యిరువురు శస్త్రాస్త్ర వేత్తలే. యిరువురు ధనుర్విద్యావిశారదులే యగుటంబట్టి జయమెవరికో తెలియక యుభయ సేనలును తత్తరపడసాగెను. చిరకాలమునకుఁ బోరిపోరి యలసిన పృథివీపాలనందనునే సువర్ణనాభుఁ డసిచేగరచ్ఛేద మొనరించి బందీకృతుం జేసిన యతనితోఁ గూడఁ దండ్రియంతికమునకుంజేరెను. పరంతపునిచేఁ దటిద్వక్త్రుండును, జితాంగుచే సింహవిక్రముండును, గంతునిచే వరుణుండును, సుకుండలునిచేఁ జంద్రకీర్తియు జయింపఁబడిరి. మఱియుం బెక్కుమంది పద్మనాభసామంతులు పృథివీపాల సామంతులం బెక్కుమందిని జయించిరి.

ఇప్పగిదిఁ దనమూలబలంబంతయుఁ నిర్మూలం బగుడుఁ, బృథివీ పాలనరేంద్రుండు కరాళవిలోచనుండై తానే దురమ్మొనరింప బయలు దేఱినాఁ డనువార్త మంత్రులు విని బద్మనాభునితో "దేవా ! యీదుర్జ నుఁడు కపటోపాయ ధురీణుఁడని కొనియాడఁబడుచుండుఁ గావున వీనితోఁ బోరునపుడు దేవర యప్రమత్తులై యుండవలయుఁ జుఁడీ !" యని విన్నవింప నరేంద్రుండును భయములే దని వారికిఁ బ్రత్యు త్తరమిచ్చి భద్రగజమెక్కి విద్వేషిపైకి వెడలెను. ఇరువురుం దార్కొన్న

పిదప, నితరబలములను బోరకుఁడని నిషేధించి. పరస్పర వినిర్ముక్త శరచ్ఛాదితతపనమండలంబుగా మింట దేవతలును మంట మానవులును నబ్బురపడఁ, జలనముఁ, వలనము, వల్గనముఃస్థానము. మర్మవంచనము మున్నగు నుపాయములతోఁ బోరాడిరి. శక్తిత్రియాకాంత్రభువనత్రయుం డగు పద్మనాభుఁ దాక శక్తిగైకొని విసరిన నది పృథివీపాలుఁడు మార్గ మధ్యంబుననే వంధ్యముగాఁ జేసెను. పిదప సోమప్రభామనోహరుఁడు శంకువు విసరఁ జక్రింబుచే విచ్ఛిన్నంబుసేసిన పృథివీపాలుని నందఱుం గొనియాడిరి. తరువాతఁ బద్మనాభుఁడు చక్రింబుం బ్రియోగించి యా యరాతిశిరము నేలకుం బలియిచ్చెను. దేవతలు పూలుగురిసిరి. ఇట్లు జయంబువడసి పద్మనాభనృపాలుండు సేవకునిచే నెదుటికిం దేఁబ డిన పృథివీపాలుని శిరంబుం గగుంగొని నిర్విణ్ణహృదయుఁడై యిట్లు తలపోసె.

"అక్కటా! క్షణక్షణమైన చిత్తము కల లక్ష్మికులటవలనం బ్రేరితుఁడై మానవుఁ డిట్టి దుష్కరకర్మము నైతము చేయుచున్నాఁడు గదా! సంపత్తునకు విపత్తును, యౌవనమునకు ముదిమియు, నాయువు నకుం జావును, బ్రియసంయోగంబునకుం బ్రియవియోగంబును గాచి యున్నవి. వియోగములేని సుహృత్సంగ మంబును. చావులేని పుట్టువును, ముదిమిలేని పడుచుదనమును, విపత్తులేని సంపదయును జగంబునలేవు. ప్రజాసంరక్షణార్థము జీతమువలె రాజులకు షష్ఠాంశము విధించిరి. అంత మాత్రమునకే పృథివీపతులు మేమే రాజులమని విఱ్ఱవీఁగుట యను చితము. అలుక మున్నగు కటికిగొనములవలనం గలుషితుండైన జీవుం డెఱుంగక తనకుఁగూడ భయప్రదంబగు దుష్కృత్యము లాచరించు చున్నాఁడు. తమ్ములనొండెఁ, దండ్రులనొండె. బాంధవులనొండెఁ,దమ్ము నొండెఁ, గోధావిష్టులగు నరులు చంపుటకు వెనుదీయరు. కటకటా! కోప మెంతచెడ్డదో! ఇప్పుడు నేనువీనికెట్లు హంతనగుచున్నాను అట్లేమతొక్క ప్పుడు నాకు వీఁడు మారకుఁ డగును, సంసారచక్రంబున బలవీర్యవిభూ

తులు మాఱుచుండునను జ్ఞానముండక కట్టా! పరమదారుణంబగు హింసఁ గావించుచున్నారు. చీ! చీ! భోగములు. సీ! సీ! ధనము ఇస్సిరో! యింద్రియజన్యమగు సుఖము. కటా! పరోపఘాతమునకై భయపడరు. అయ్యో! విషయజన్యములగు పాపిసుఖములచేఁ బాపాత్ముఁడు వంచింపఁ బడుటయే తెలియనేరకున్నాఁడు. ఒకరి నననేల, సంసారమునందలి చిక్కులన్నియుఁ దెలిసియు నింద్రియసుఖముల కాసపడి యెట్టి పాపకార్యముఁ గావించి నాఁడనో! ప్రేమకన్న బంధనములేదు. విషయసుఖముల కంటెవిషములేదు. కోపముకన్న శత్రువులేఁడు.జన్మముకంటె దుఃఖము లేదు.దుర్లభమైన మనుష్యజన్మమెత్తియుఁగుకర్మమువలననింతదనుకపడిన గతాగతపరిశ్రమ మంతయు వమ్ముగావించుకొనుచున్నాను'' అనుచుఁ బెక్కువితముల సంసారదౌర్భాగ్య మాలోచించి నరేశ్వరుండు సువర్ణనాభునకుం బట్టముఁగట్టి పృథివీపాలనందనునకుఁ దంద్రిరాజ్య మొసంగి మఱియుం బాదానతులగు సామంతులమాటలు నిరాకరించి శ్రీధరమునీంద్రునియొద్దకుం జని శ్రమణసన్యాసమును స్వీకరించెను. పరిపక్వమైన హృదయము కలవాఁడగుటంజేసి యతనికి దీక్షాసమయమే శిక్షాసమయమయ్యెను. ద్వాదశాంగములును ధరణిమోపి చేయు ద్వాదశవిధమైన తపంబును బ్రతిదినముఁ చేయసాగెను. సింహనిష్క్రీడితము మున్నగు విధులన్నియు విధ్యుక్తములుగా నెఱవేర్చుటంజేసి యారాచతబిసి నానాఁటికి శరీరసౌష్ఠవముచెడి చిక్కిపోయెను. సందేహశూన్యమగు శాస్త్రజ్ఞానంబును, ధర్మము గురువు వృద్ధులు శ్రుతములు నీ నాల్గింటి యందుఁగల గొప్ప వినయంబును, నహింస మొదలగు వ్రతముల యందలి పట్టుదలయుఁ, దదంగములగు క్రోధత్యాగము మున్నగు శీలములయందుం బరకాష్ఠయు, నుపధానాదిపూర్వకమగు జ్ఞానోప యోగంబును, సంసారభీరుత్వలక్షణమగు నుద్వేగంబును, నభయప్రదానము మొదలగు భేదములుగల త్యాగంబును,సామర్థ్యము చెడకుండ శరీరముమాత్రము కృశింపఁజేయఁజాలిన తపస్సును, నెందేని తపోవిఘ్నములు దొడరిన వానిని మరలింపఁజాలిన శక్తియు, సజ్జనులకు దుఃఖము సంభవించిన

దానికి వ్యావృత్తి యొనర్చుటయు, నాచార్యాను రాగలక్షణమైన భక్తి యోగంబును, సకల శాస్త్ర పారంగతుల యెడల గౌరవంబును, ద్వాద శాంగాది భేదసంయుతంబగు శాస్త్రంబునం దాదరంబును, నవశ్య కర్తవ్యములగు షట్క్రియల యందును బరిచ్యుతి లేకపోవుటయు, మంచి మార్గము మంచి భావనయు మంచిజ్ఞానమును మంచి తపంబును గౌర ణంబులు గాఁగ ధర్మస్నేహరక్షణ మగు దర్శనవాత్సల్యంబు నను షోడ శావదానంబులు గలవారికి లభించు తీర్థకరపదంబునకుం బాత్రుఁడై క్రమ ముగ నారాజ సన్యాసి దేహత్యాగము గావించి యపరజన్మంబున నహ మిందుఁడను రాజై జనియించి ముప్పదిమూఁడు సంవత్సరము లాయుః ప్రమాణము కలవాఁడై జగతి యేలెను.

ఇది పంచదశసర్గము.

## షోడశసర్గము.

★

ఈభరతఖండమున సమస్తదేశములకుఁ దలమానిక మనందగు పూర్వదేశ మను దేశమొకటి కలదు. అందు వరి విస్తారముగాఁ బండును. చెఱకుతోఁటలు విస్తారముగా నాటుదురు. స్తనజఘనభారంబునం గదలుట కాయాసపడు మందయానలగు శాలికాపాలిక లందు హరిణాది మృగ ములు చేలు తినకుండ మధురమగు సంగీతము చేతనే వ్యామోహపఱచి యాకర్షింపఁజాలుదురు. చీత్కార ముఖరిత దిగంతరంబులగు చెఱకుఁ దోఁటల నడుమ నడుచు తెరువరు లాదేశమునం దడుగిడుగునకుఁ జెఱకు పాలు గ్రోలుచు నాయాస మనుమాట యెఱుఁగకుందురు. పథికుల మార్గాయాసములు తొలగించుచు నున్నతములయ్యు ఫలసంపదచేనతము లైన యచటి మహీ రుహంబులకును సజ్జన కదంబంబులకు వించు కయు భేదములేదు. దున్నకుండ నాటినను దళముగా నలముకొని

పెచ్చు పంట పండుటయం దుత్తర కురు భూములను బోలిన యాదేశ భూము లవగ్రహములు గావు. అయినను నా యవ గ్రహముల నిర్దోషునిపై దొరలించిన దుర్జనాపవాదముల వలెఁ గార్య కారుల కావు. ఏతాదృశంబగు దేశంబునఁ జంద్ర పురియను నొకవీఁడ కలదు. అందలి సౌధము లెక్కాలమందును సంగీత ముఖరములై యుండును. వానిశిఖరములు మిన్నంటు చుండును. జెండాలచే నలంకరింపబఁడిన గోపురాగ్రంబులును నిరాశ్రయమగు మింటికిఁ జేయూఁత యొసఁగుచున్నవో యన నొప్పు శిఖరంబులును గల తత్పురీ ప్రాకారము చుట్టుఁ దద్రత్నముల నభిలషించు పయోనిధియో యన విశాలంబై లోతై కొండలఁబోలు తరంగములచే నలంకృతంబై యున్న కందకము నందము వర్ణింపనలవికాదు. అందు వియోగిత్వము చెట్లయందును, విలాసిత్వము సర్పాదులయందును వైరస్యము చెఱకుగఱ్ఱలయందును, గదాభిఘాతము సంగ్రామమందుం దప్ప మఱెందును గానరావు. సజ్జన హృదయము వలెవిశాలమై,పాతాళలోకము వలె సహస్రనాగ సేవితంబై,శాక్యమతమువలె బహు భూమి కాలంకృతంబగు నందలి రాజగృహము సాటి లేనిది. సమస్తభువనంబుల యందుసు బేరుమోసిన గుణముకలిమి నిక్ష్వాకు కులంబున కంతయు వన్నెతెచ్చు ప్రఖ్యాతియు దాంతియు శాంతియు వితీర్ణియు శౌర్యంబును గీర్తియుఁగల మహాదిసేనుఁడను రాజాదేశ మేలుచుండును. మాఘమాసమునాఁటి మల్లెమొగ్గలకు సాటియగు కీర్తిచే సకలరాజకము నధఃకరించిన యానృపాలుఁడు కళ్యాణ ప్రకృతిచేతనే కాక స్థైర్యముచేతఁగూడ మేరువుతలదాఁచెను. లావణ్యము చాలకలదు, హృదయమగాధమగును. రత్నములు విస్తారముగానున్నవి. కాని సముద్రుఁడు తనదేశముదాఁటి యొక యడుగు రాలేని వాఁడారాజేంద్రునితో నేపగిది నుపమానముఁ జెందఁగలఁడు? నయహీనంబగు శౌర్యంబును, శాంతములేని ప్రభుత్వమును, వినయంబులేని విద్యయు, దానభోగంబులు లేని ద్రవ్యంబును లేని యానరపాలుని యెడల నేను వర్ణించు వర్ణన చాలదు. కమలమునందలి చనుదెంచిన కమలాలయయోయనఁ బాతాళ

లోకము విడిచివచ్చిన నాగకన్యకయో యనఁ దనరారు లక్ష్మణయను సతీతిలకము భార్యగాఁగ సమస్తరాజతిలక మనిపించుకొను చుండెను. సువంశజాతయగు ధనుశ్రీవలెఁ జారువర్ణబంధయగు కవిత పగిదిఁ బ్రకాశించు నాసాధ్వీమణి యారాజన్యు నాశ్రయించి కల్పవృక్షముమీఁదఁ బ్రాఁకిన మాలతీలతవంటి ప్రతిష్ఠవహించెను. ఆమెకుం జాంచల్యము కన్గొనలయందుఁ గాని చిత్తమునందులేదు. మాంద్యము గమనమునందుఁ గాని పరోపకారమునందులేదు. కాఠిన్యము కుచయుగమునందుఁగాని వాక్కునందులేదు. భంగము తలవెండ్రుకలయందుఁగాని స్వభావము నందులేదు. సౌభాగ్యమున్నచోట రూపముండదు; రూపమున్నచోట వినయము సున్న. వినయమున్న శీలము హుళక్కి, కాని యీలక్ష్మణాదేవి యందుమాత్ర మన్నియునుంగలవు. ఏతాదృశమగు సృష్టి యెన్నఁడును విధాత చేసియుండఁడు, చేయఁబోఁడు. సకలతమోదూరుండును దీర్ఘకరులలో నెనిమిదవ వాఁడు నగు మహానుభావుఁ డహమింద్రుఁ డాయమ్మ గర్భంబునం దవతరించెననుటయె యామె సుగుణసంపత్తిని వేనోళ్ళఁ బొగడుచున్నది. మనుష్యజన్మము వహించివచ్చిన భూమియో యనఁ దగు లక్ష్మణాదేవి కతంబుననే యా మహారాజు సార్వభౌములలోఁ దన్నగ్రగణ్యునిఁగా భావించుకొను చుండెను. నిర్జితేంద్రియుఁ డయ్యు నా రాజేంద్రుఁడా లక్ష్మణాధరసుధాస్వాదమునందలి యాదరంబున రాజ్యచింతను గూడ శిథిలముఁగావించెను. ఇప్పగిది రాజ్యతంత్రవిముఖుండై యుండ నతని మండలమునందలి ప్రజలందఱును స్వాతంత్ర్యము వహించిరి. శత్రురాజులందఱును దాడివచ్చుటకై యత్నింపసాగిరి. అట్టిసమయంబున మంత్రులొకనాఁ డా వృత్తాంతము విన్నవింప రాజు తన ప్రమత్తత్వము నిందించుకొని, దశదిక్కులను జయించుటకై యపరిమితమగు సేనం గూర్చుకొని,ముందుఁ దూర్పుదెసకుంబోయి యంగరాజుం జయించి, శరణుఁజెందిన యతని కుమారున కాయంగరాజ్యమభిషేకించి, పిదపఁ గళింగదేశ రాజకాంతల చేతుల యందలి గాజులు పగులఁ గొట్టించి గండ్రగొడ్డలి మెడమీఁదం గదియించు

కొని పాదములపైఁ బడిన మాళవాధిపతి ద్రవ్యమంతయుఁ గొల్లఁ గొని శరణుఁజెందిన యతని ప్రాణములు కాపాడెను. మహాత్ములు శరణాగతవత్సలులుగదా! తరువాతఁ జేదీశవృక్షము సమూలముగాఁ బెకలించుటలోఁ బ్రళయవాయువై పూర్వవారిరాశితీరంబునకు వాహినుల నన్నిటినిఁ జేర్చెను. తరంగములచే నిట్టటుఁ గదలుచు విడిపోయియున్న ముత్తెపుఁజిప్పలను వానినుండి క్రిందికి దొరలిపడిన ముక్తాఫలంబులను సంగ్రహించుచు శత్రురాజులను జంపి వారి యుసురులు గ్రోలినపగిదినే టెంకాయలు పగులఁగొట్టి యాయెళనీరు డ్రావుచుఁ గంకేళివాయులచేఁ బరిశ్రమ వాపుకొనుచు వేలావనంబులయం దా రాజసైనికులు స్వేచ్ఛా విహారముఁ గావించిరి. రాజేంద్రుండును దద్వేలాగిరియందు జయ స్తంభము నిల్పి యచ్చోటుకదలి దక్షిణదిక్కునకు మరలి రణనిహత ప్రియులగు నాంధ్రదేశస్త్రీల ముఖచంద్రబింబంబులకుఁ దద్గండస్థలంబు లను గళంకములుగాజేసి లంబాలకంబులను మేఘంబులమాటున మాటు పఱచెను. తరువాతఁ దత్ప్రతాప భాస్కరుని కాంతి నడుమనడుమ నున్న గాజురాళ్ళంబోలు చిన్నతేండ్లమీఁద నంతగా మండకపోయినను గర్ణాట సూర్యకాంతములమీఁద మాత్రము బిట్టుమండెను. పసంపడి సైనిక లుపయోగించుటంజేసి నీరు తఱిగిపోయిన యఱవనాఁటి చెఱువు లన్నిం టిని రాచతెఱవల కన్నీటిచే మరల నింపించెను. తద్గజకంఠాలంకార ముల రాపిడిచే గీతలు గీయఁబడిన మలయజవృక్షములన్నియు నతని దక్షిణదిగ్విజయయాత్రకు సాక్షులయ్యెను. తమలపాకులు పోఁకలు మంచి గందము మున్నగు శృంగారోపకరణములు సిద్ధముఁ గావించుకొని వేచి యున్న చోళరాజ్యలక్ష్మిని వారాంగనంబోలె ననుభవించి పశ్చిమదిక్కు నకు మరలెను. "దక్షిణదిక్కునందున్న యముఁడే యానరేంద్రుని ప్రతాపమున కాగలేకపోయె. నిఁక నీవా యాగువాఁడ" వని కొందఱు విన్నవింప వరుణుండు పాఱిపోవఁబోలు. లేదేని యతనికిఁ దదర్థబోధకం బగు నపసారసంజ్ఞ యెట్లుకలుగును. తమ కామినుల గట్టిచనుగుబ్బల తాఁకుడుచేతనే నలిగియున్న లాటదేశపు రాజుల హృదయములు భేదిం

చిన మహాదిసేనుని శరములకు మాత్రమది కీర్తికారణము కాకపోయెను. పిదపఁ బారసీకులను జయించి పశ్చిమ సముద్రమునకుం జేరి యారాజేంద్రుఁడు కొంతతడవా వేలా వనాంతములయందుఁ గ్రీడించి కుబేరపాలిత మగు నుత్తరదిక్కునకుఁ జేరెను. దెసలన్నియు జయించి యందలిరాజులచేఁ గప్పములు గొనుచుఁ దద్దేశ సైనికులను గూడఁ దన సేనల యందుఁ గలుపుకొనుచుఁ దుద కనంతమగు నుత్తర దిక్కునకు వచ్చుటచేతనే యాభూపాలుని సేనలకు నిలువఁ దావుదొరకినది కాని లేకపోయిన దొరకుటయే దుష్కరమగును. ప్రవృద్ధ కటకంబులగు కాశ్మీరదేశ ధరణీభృత్తులకు వజ్రమైన యాభూవరుని ప్రతాపము వలనఁ దన నాధున కేమి విపత్తు కలుగునో యని కుబేరదిక్కు వ్యసనపడుచుఁ గన్నీరు నించుచున్నదోయనఁ దద్గజ పీతముక్తంబులగు హిమాంబు శీకరంబులు జెలంగెను. పావురా వెండ్రుకలవంటి రంగుగల తచ్ఛమూపరాగము ఖశదేశమునందలి దోమలకు ధూమమయ్యెను. ఇట్లు సమస్త దిగ్విజయ యాత్రఁ గావించి కస్తూరీ మృగములచేఁ బరిమళించుచుఁ జఱియల నుండి సర్వదా జలధారలను స్రవించు హిమవత్పర్వతంబున సైన్యము నంతయు నిలిపి కిన్నరులు మున్నగువారిచేఁ బాడఁబడు తనకీర్తిని వినుచుఁ గొన్నిదినములు సుఖముండెను.

ఇప్పగిది దిక్కులన్నియు జయించి, ప్రమదలకుంబోలెఁ గరగ్రహణము గావింప రాజు వచ్చునను సంతోషముతో నలంకరింపఁబడిన తన పురమునకు విచ్చేసెను. పిదపఁ గూడవచ్చిన సామంతరాజుల కందఱకు జామారుల బహుమతు లొసఁగి యథాన్యాయముగ వారల నంపించి చాలకాలము సామ్రాజ్య మనుభవించెను. కుబేరుఁడు దేవేంద్రు నానతి చొప్పున నాఱుమాసములు దినమునకు మూఁడుకోటుల యేఁబదిలక్షల సువర్ణమును వర్షించెను, మఱియు నతని శాసనముననే యష్టదిక్పతుల భార్యలును బద్మనాభనృపాలుని భార్యయగు లక్ష్మణాదేవికి గర్భశోధనాది కముం గావించుచుండిరి. ఒకనాఁడు మేడమీఁద నాకల్యాణి తెల్లవారు

జామున సుఖసుప్తయై యుండ జినజన్మసూచకములగు కొన్ని స్వప్న
ములు వచ్చినవి. శైలేంద్రమువంటి యైరావతమ్మును, మదించి
యాఁబోతును, నేనుఁగులను బయవెత్తించు సింగంబును, లీలారవిందము
చేతఁగలిగిన లక్ష్మిని, దుమ్మెదలచే సౌరభమానఁ బడుచున్న రెండుపూ
దండలును, దళపి వెన్నెలకాయు సంపూర్ణచంద్రుని సర్వ దిగంత
ములఁ బ్రకాశింపజేయు సూర్యుని, సయ్యాటములాడు రెండు చేఁపలను
జలపూర్ణములై తమ్మిపూవులచేఁ గప్పఁబడిన పూర్ణకుంభములను, తెల్లని
తామరపూవులచే నొప్పుతటాకంబును, సింహాసనంబును, దేవతలెక్కితిరుగు
విమానంబును, నాగకన్యకలచే మనోహరంబగు పాతాళలోకంబును, మెఱుం
గుల మిఱుమిట్లు కొలుపు రత్నంబులును, పొగలేని మంటమండు నగ్నిని
గన్గొనియెను. కళ్యాణకారంబు లగునీ శుభ స్వప్నము లన్నియుఁ బ్రొద్దుటఁ
గనుదమ్ములు వికసింప దేవి రాజునకుఁ దెలియఁజెప్పెను. అతండు
నాస్వప్నంబునకు మంచిఫలము కలుగఁగలదని యామెకిట్లు తెలియఁబఱ
చెను. "ఐరావతము కనఁబడుట కల్యాణమునకు హేతువు; ఆఁబోతు
పుత్రోదయ సూచకము; సింహముదయించు కుమారుని విక్రమంబుఁ దెలుపు
చున్నది; లక్ష్మి యతని మహాసామ్రాజ్యమునకు గుఱుతు; సూర్యచం
ద్రులు వానిప్రతాప కీర్తులకు నానవాళ్ళు; వెన్నెల ప్రజారంజకతకుఁ
జిహ్నము; చేపలు సుఖములు తేనివాఁడనుటకును, సింహాసనము సింహా
సన మెక్కువాఁ డనుటకును, పూర్ణకుంభములు సర్వలక్షణ పరిపూర్ణుఁ
డనుటకును, తటాకము తృష్ణాదూరుఁ డనుటకును, దేవతలు దేవాంశ
సంభూతుఁ డనుటకును, నాగలోకము ధర్మతీర్థమునకుఁ గర్త యనుట
కును, వహ్ని శత్రుభీకరుఁ డనుటకును" సూచకంబులని స్వప్నంబునకు
ఫలంబువేర్వేఱ వక్కాణించి రోమాంచకంచుకిత శరీరంబుతోఁ గౌఁగిలించు
కొనిన దైతను మాటలచే నుడువరాని యానందమును బొందించెను.
మనోరథ సంప్రాప్తి యెవ్వరికి సంతోషకారణము కాదు! అహమిం
ద్రుఁడు తర్వాత నవతారముఁ జాలించి మరల జినుఁడై యుదయించు
టకై లక్ష్మణాదేవి గర్భమును శుక్తిపుటమందు ముత్తెము వొఁగల వారి

బిందువువలెఁ బ్రవేశించెను. భువనక్షేమంకరుఁడైన జినేంద్రుఁ డిప్పగిది లక్ష్మణకుం జూలై నిలిచెనను వార్త విని దేవతలు రాక్షసులును బద్మనాభనృపాలుని పురంబున గొప్ప యుత్సవములు గావించి వేణువీణాభిరామముగా నృత్యముచేసి జినేంద్రునకుఁ దల్లి కాఁబోవు నాదేవి పాదపద్మములకునమస్కరించి తమతమ నివాసములకుఁ బోసాగిరి. శ్రీ హ్రీ ధృతి కాంతి లజ్జ మొదలగు దేవతలందఱు శరీరములు ధరించి యాలక్ష్మణను సేవింపసాగిరి. ప్రతిదినము సూర్యోదయమున సురలు పుష్పవర్షముఁ గురిపింపసాగిరి. ఇట్లు పరమోత్సాహమున సమస్తలోక సేవ్యమానయై లక్ష్మణాదేవి సుఖముగ నవమాసములు గడపెను.

ఇది షోడశసర్గము.

---

## సప్తదశసర్గము.

★

అనంతరమున సమస్త తిథులయందుఁ బుణ్యతిథి యగు పుష్యబహుళైకాదశి లక్ష్మణాదేవికి జినేంద్ర ప్రసూతి సమయమయ్యెను. దిక్కులు ప్రసన్నము లయ్యెను. ఆనాఁ డాకసమంతయు నిర్మలమయ్యెను. చల్లని సురభివాయువులు విసరెను. దిగంగనకుఁ గ్రొత్తవలపు గలిగెను. సంతుష్టులగు దేవబృందము గగనమునుండి దివ్యపుష్పములచే భూమండలమంతయు ముంచిరి. ఊర్ధ్వలోకముల యందున్న వారి యిండ్లలోఁ గొట్టకుండఁగనే గంటలు మ్రోగినవి. స్వర్గలోకమునఁ గాంతి విస్తరించెను. సింహము లూర్జితరవముగా ధ్వనిచేయసాగినవి. మేఘము లుఱుమసాగినవి, శంఖము లూఁదఁబడకయే తమంతట మ్రోయఁదొడగినవి. పటహధ్వనులు పర్వత గుహలలో సహితము ప్రసరించి ప్రతిధ్వను లీయసాగినవి. ఇత్యాది హేతువులచే జినేంద్రుని యుదయమును దెలిసికొని పెద్దలు సంతసించిరి. ఎడతెగక యాబాలుని జూచుటకై వచ్చు సురాసు

రాదులకిరీట మణికాంతులచే దిక్కాంతలు క్రొత్తక్రొత్తనగలు ధరించు కొన్నట్లుండిరి. మహాత్ముల పుట్టుక లెవ్వరికి వృద్ధి నొసగవు? ఈభువనమంతయు జినేంద్రుఁడే వెలిగింపఁ గలఁడు. మన మెందుల కని యంతట దినకరుఁ డస్త మించెను. దేవ లోకము నందలివా రెల్లరు నా నృపతి గేహమునందే యుండుటచే బ్రహ్మదేవునంత. వానికి భూమి యేదియో తెలియఁజాలక మానభంగము కలిగెను. పద్మనాభనృపాలుని యిండ్లన్నియు రత్నభాసురము లయ్యెను. పిదప నొకనాఁడు శచీదేవి యాబాలకునిఁ జూడవచ్చి యుపలాలించుచున్న ట్లుండియుండి తల్లిబొమ్మ మీఁదనున్నవాని నపహరించి సూర్యకిరణ ములు పద్మవనముంబోలెఁ బ్రియుని వేయినేత్రము లొక్కసారి విక సింపఁజేసెను. జయజయధ్వనులు స్వర్గమున నిండెను. ఇంద్రుఁడును ముందాబాలునిఁ దన యైరావతముపై నెక్కించెను. ఇతరు లంద ఱా పిల్లవానికి మ్రొక్కిరి. పెద్ద పెద్ద వేల్పులెల్ల రాతపత్రఛత్ర చామరాదులచే సేవించిరి. కొందఱు కొంత లాఁడుయేనుఁగులనెక్కి ముందు నడచిరి. ఇట్లు పరివారంబుతో సురనాథుఁ డాకుమారుని మేరుపర్వతమునకుం గొని పోయి యందు మహోత్సవము చేయించెను. ఏలోకమం దెవ్వరికిని లేని సౌందర్యముగల యాబాలుని రూపుఁజూడ నభిలాషపడుచు నడచు చున్న సురల కా మేరుపర్వతమునఁ గడచిన దారియెంతయో యేదియో తెలియకుండెను. ఇప్పగిది సువర్ణశైలమునకుంజని దేవేంద్రాదు లొక్క రమ్యప్రదేశంబునం దబ్బాలుని సింహవిష్టరంబునం గూర్చుండఁబెట్టి పాలసముద్రములోని పాలతో నభిషేకము గావించిరి. నృత్తగీతవాది త్రములతో సేవించిరి. వజ్రమయమగు సూదితో నయ్యనఘుని చెవులకుఁ గుట్లుకుట్టిరి. మణికుండలము లంగదములు కిరీటము కటకములు మొల నూలు మొదలగు నగలుపెట్టిరి. దివ్యపుష్పమాలికలు రై సేసిరి. సువర్ణ వస్త్రంబులు కట్టించిరి. ఇట్లు కొన్నినాళ్ళమ్మేరుశృంగంబున సుఖమున్నం తట నొకనాఁడు పదిమందియుఁ జేరినపుడింద్రుండిట్లు సన్నుతింపఁ దొడంగెను:— సకలావబోధకుండవై యకలంకుండవై యమేయుండవై భ

వుండవై యనుపముండవై జితమత్సరుండవై జన్మరహితుండవై యజరా మరణుఁడవై చెలఁగు నష్టమతీర్థకరుండవగు నిన్నుఁ గొనియాడుచున్నారము. మాకు నిన్నుఁ గొనియాడునంతటి శక్తిలేదు. అయినను దోఁచినట్లు హితకాంక్షచే స్తుతిఁచుచున్నారము. సింహాసనముమీఁదఁ గూర్చున్న నీసమస్తజననయనానందకరమైన శరీరము ప్రకాశముచే నుదయాద్రి శిఖరముననున్న చంద్రమండలమువలెఁ గన్పట్టుచున్నది. అఖిల జన వత్సలుండవైన నీమార్గము నెవ్వ రనుసరింతురో వారికి మరల సంసార భయము లేదు. ఓడయెక్కినవాఁడు సముద్రములో మునుఁగఁడుగదా! అధికభక్తిని నీచరణయుగ్మము నెవఁడు సేవించునో వానిని యముఁడేమి చేయఁగలఁడు? అగ్గినగ్గఱ నున్నవానిని మంచేమిచేయఁగలదు! జగదధీశ్వర! నిన్నుఁజూచినవారికి జరామరణంబులుండవు. నీచరిత్ర మమంగళప్రదులకుఁదప్ప రసాయనముకానివారెవరు? జిననాథ! కోరఁబడకయే నీ యాశ్రితులకు నిర్వాణసుఖమిచ్చుచున్నాఁడవు. ఏతాదృశమైనశక్తి నీకు సహజమైనదే. మంచిగంధమున కాయాసముఁ బోనడచుట సహజమేకదా! ఎవ్వనిహృదయసరస్సునందు దేవర పాదపంకజము వికసించు చున్నదో వాఁడుకృతి. వాఁడుపుణ్యాత్ముఁడు. వానిజీవితము సార్థకమయినది; సురపూజ్యుఁడా: ఎవ్వఁడు సర్వదా నీ పేరు జపించునో వాని నాపదలేమియుఁ జేయలేవు. ఏనరుఁడు సదా నీచరణపంకజ సేవ గావించుచుండునో వాఁడు సుమతి. వానియొద్దకుఁ బాపములు చేరవు. సంపదల కతఁడే నిధానమగును. అందఱేదియో యొక ప్రత్యుపకారము నపేక్షించియే యుపకృతిగావింతురు. నీవో యేదియు నపేక్షింపకయే భక్తుల కుపకారము గావింతువు. నీకుఁగల యుపకారశీలత యెచటను గానము. శచీదేవి యనుదినము నీకభిషేకోదకము తెచ్చి యిచ్చుచున్నది. దేవతలు సేవఁ జేయుచున్నారు. నీమహిమకాక యితరుల యెవరిమహిమ యిట్లు శచీముఖులచే నూడిగము చేయించుకోఁ గలదు? దేవా! పశువులు నైతము నీసన్నిధికిఁ జేరినంతనే భక్తివివశములగును. మనుష్యజన్మ మెత్తియు నెవఁడు నీయందు మతిపూనఁడో వాఁడుపశువులకును బశువు.

భయరోగశోకమరణంబులును మఱియు సంసారమునందలి చిత్రవిచిత్రము లైన వేదనలును నీయందుఁ జిత్తము లీనముఁ జేయునందాకనేకాక తరువాతనుండవు. నీయెడల "నమః" అనుపద మొకటియే మనుజుల సర్వపాపములడంచునది. తక్కిన వాచావిభవము వాగాడంబరము మాత్రమే తెలుపును. కావున నీకు నమస్కారము." అని నుతించి గౌరవప్రపత్తులతోఁ బురందరుండు బాలునిఁ జంద్రపురికిఁ దోడ్కొని వచ్చి యచట మరల దేవతాగణములతో గొప్ప యుత్సవము గావించి తనరాజధానికి విచ్చేసెను. సురలోకంబున నమృతములో ముంచఁబడిన తన చేతివ్రేలు నోటఁబెట్టుకొని కుడుచుచు నాబాలుఁడు తల్లిపాలు గుడుచుటయు మానివైచెను. బాలచంద్రునివలెఁ గ్రమక్రమముగా వృద్ధిఁ జెందుచున్న యా యర్భకుండు సమస్త జనలోచనానందకందమై తోడి బాలురతో బాలక్రీడలారంభించెను. ప్రాకృతునిబోలెఁ జేబంతియాట మొదలగు క్రీడలాడుచు నందఱికిఁ గన్నులపండువయ్యెను.

ఒకనాఁడు నిండోలగంబుననున్న యా జినేంద్రుని యొద్దకు మూఁడుగాళ్ళముసలి యొకఁడు చనుదెంచి యుస్సురనుచు నిట్టూర్చి, "దేవా! సురబృందవందిత! కరుణార్ద్రహృదయ! లోకవత్సల! సమస్త జగద్రక్షక! నిరస్తభయ! సంసారభీతుండనగు నన్నుఁ గాపాడుము, కాపాడుము. నిన్నటిరాత్రి యొక దివ్యపురుషుఁడు నాకలలోఁ జనుదెంచి నాతో "నీవు జినేంద్రుని శరణుచెందు. మతఁడు నిన్నుద్ధరించి భవభయ విముక్తునిఁ జేయఁగలఁడు" అని నుడివెను. కావున నిన్ను శరణన వచ్చితిని నన్నుఁ బ్రోచుటకుం దగుదువు; ప్రోవుము" అను నీ నాలు గైదుమాటలని యావృద్ధుఁడు కన్మొరంగెను. తరువాత "దేవా యీ ముదుసలి యెవరు? ఇట్లనుటకుం గతమేమి" యని సభ్యులు తన్నడుగ నవ్వుచు ధరణీవరకుమారుండిట్లనియె. విషయాభిలాష యెఁకఁ గట్టిపెట్టు మని దేవేంద్రుఁడు నాకడ కితనిచే వార్తనంపెను. ఇతఁడు ధర్మరుచి యను దేవత. ఈరీతి ముసలిరూపువాలిచి వచ్చినాఁడని సభాసదులకు

నెలవిచ్చి సంసృతిబంధవిముక్తికై యిట్లు యోజించెను. ధనము యౌవనము మున్నగునవి యన్నియు శరీరధారుల కభిమతములే కాని పరిశీలించినచో శాశ్వతములుకావు; పూర్వజన్మకృతశుభా శుభంబులు గలుగుచుండును బోవుచుండును. ఇంద్రియములు నిజముగా శత్రుప్రాయములు. పరితాపకారణములు. తెలివిమాలినవాఁడు తప్ప బుద్ధిమంతుఁడా యింద్రియములయందు విశ్వాస మునపఁడు. పెక్కు మేనులందుఁ బెక్కురూపంబులఁ బుట్టుచు విషయములకు లోఁబడి జంతువులు కష్టపడుచున్నవి. నేనును వానిచే వచింపఁబడి పెక్కుపుట్టువులొందితినిగాని వానినన్నింటి నీజన్మముతో మొదలంటఁ బెకలింతును. అని యోజించి తనకుఁ గలిగిన యభిప్రాయ మందఱకు వెల్లడిపఱచెను. వారును మేలుమేలని కొనియాడిరి. దేవనాథుండును విమలమను పేరుగల విమాన మెక్కివచ్చి యతని సేవించెను. తరువాత నఱువదిమంది సిద్ధులతోడను పదివేలమంది రాజులతోడను దపమాచరించుటకై చనెను. బోడియైనపిదప నైదుగుప్పెళ్ళ పరిమాణముగల యతని తలవెండ్రుకలను సురనాథుఁడొక మణిమయంబగు హరివారణంబునందుంచి తీసికొనిపోయి పాలవెల్లిలోఁ గలిపి యచట సురగణములతోఁగూడ గొప్పయుత్సవ మాచరించి నిజనివాసంబునకుం బోయెను. తెల్లనిపటికంపుఱాలచేఁ గుట్టింతంబగు నేలఁ బరిజనుల గరాంగుళులూఁతఁగొని నడచునపు డయ్యర్భకుండు విమలసరోవరంబునం దిరుగు రాజహంసమువడువునఁ బ్రకాశించెను. దేవేంద్రుని యానతి చొప్పునఁ గుబేరుం డాకుమారుండు బాల్యమునఁ దాల్పఁదగిన మురుగులు బాహుపురులు మొలనూ లుంగరములు మొదలగు నగలు తెచ్చి యిచ్చెను. ఈఁతయు గజారోహణము తురగారోహణము మున్నగు విద్యలయందు నా జినేంద్రుఁడు యౌవనము రాకమున్న మెప్పువడసి యనన్యసామాన్యమైన ప్రతిష్ఠవహించెను. తరువాతఁ దండ్రియు ననేక సామంతరాజసమక్షమున సింహాసన మధిష్ఠింపఁజేసి వివాహముగావించి పట్టముగట్టెను. విషయాభిలాష లేనివాఁడయ్యుఁ బూజ్యులగు తండ్రిగారి యెడల గౌరవమున భూమియేలెను. మహానుభావులు సంసారమునం దంటి

నట్లుండియు సంటకయే యుందురు. ఆయువరాజు రాజ్యమేలుచుండఁ జతుస్సముద్రముద్రితంబగు ధరావలయంబున సంతోషింపనివారు లేరు. మహాత్ము లుదయించుట ప్రజాసంతోషముకొఱకేగదా ! అయ్యనఘుఁడు జగతియేలుచుండ నకాలమరణంబులులేవు. అతివృష్టియు ననావృష్టియు జనులను బాధింపవయ్యె. చెవులు గింగురుమన విసరు వాయువులు సున్న యయ్యె. అతిశీతముగాని అత్యుష్ణముగాని రోగములుగాని నామావశిష్ట ములయ్యెను. వెయ్యేల ? ఈతిబాధలులేక క్రూరమృగభయములేక పర హింసా పరాపకారపరాయణులు గాక జనులు సుఖింపసాగిరి. మార్తురు గూడఁ గప్పములుగైకొని ద్వారపాలకులచే ముందుఁ గులగోత్రములు తెలిపించి పిదపఁ జూడఁబోయి కిరీటమాణిక్య నిగనిగలచేఁ బాదపీఠము నకు వన్నెబెట్టఁదొడఁగిరి. రాత్రియుం బవ లెనిమిదిభాగములుగావించి యథోచితంబులగు కార్యములచే జాగరూకతతోఁ గడపసాగెను. సప్తాంగ ములతో నిండిన పేరోలగంబున నున్న యా జినేంద్రచర్యలు వేలుపు తేని యానతిచొప్పున వచ్చి సేవించుచుండిరి. ఈప్రకారముగ జగదేక నాయకుండగు నామహానుభావుఁడు కమలప్రభ మున్నగు కళత్రములతో భోగసుఖములనుభవించుచుఁ జిరకాల మిలయేలెను.

పదంపడి జినేంద్రుఁడు నలినపురమునేలు సోమదత్తుఁడను రాజేం ద్రునియింట మొదట సువర్ణవృష్టియుఁ బూలవానయు గంధోదకవర్షం బును గురిపించియు సురభిళంబగు వాయువు విసరించియు దేవదుంధుభు లను మ్రోగించియుఁ దన మహిమము ప్రకటించెను. శాంతిదాంతి మొద లగు గుణములచే నయ్యనఘుఁడు క్రోధమానమాయాలోభములను జయించి తపస్విజనయోగ్యములగు ధామములందు నివసించుచుండెను. ధైర్యశాలియగు నమ్మహాత్ముని నాఁకలియు దప్పియు నవనిశయనంబును మున్నగు మున్నెన్నఁడెఱుగని బాధలన్నియుఁ గవచంబుఁ బూనిన రథి కునిఁ బగరయమ్ములంబోలె బాధింపలేకపోయెను. ప్రతిదిన మనేకులు జడదాదు లమ్మునీంద్రుండు తత్త్వదృష్టియై యున్నయెడల వచ్చి సంశ

యములడిగి మాపుకొనుచుందురు. ఇట్లుండ నుండఁగాఁ గొన్నినాళ్ళకు వనంబున నొకవృక్షముక్రింద మునీంద్రులతోఁగూడి తప మాచరించుకొను చుండ నమ్మహానుభావునకుఁ గైవల్యప్రాప్తి చేకూరెను. పదంపడి దేవేంద్రుండు నమ్మునీంద్రుఁడు నివసించుటకై కుబేరునితోఁజెప్పి యెనిమిది యోజనముల యొకక్రోసు చదరముగల (సమవశరణమును) జినాలయమును నిర్మింపఁజేసెను. ఆ జినాలయంబునకుఁ జుట్టు మణిచూర్ణమయం బగు ప్రాకారముకలదు. దానికి నాలుగువైపుల నాలుగు బురుజులును కలవు. ఆప్రాకారమునడుమ నాలుగు దెసలను వికచ కమలాకరంబులగు చెఱువులును దిన్నని నీటిబోదెలును, జక్కనిబ్రోదెలును గలిగి యనేక విధకుసుమజాతి లతలతో మనోహరంబులగు నుపవనంబులును నిండి యున్నవి. మఱియు నందు నాలుగు గోపురంబులును నందుఁ బ్రతిద్వారంబునకు రెండువైపులను రెండురెండు నాట్యశాలలును ప్రకాశించుచుండెను. ఇంకను జతుర్దిశలందును సుందరములగు నాల్గు ప్రతిమలును యాగవృక్షబహుళంబులగు నాల్గువనంబులును నావనములందు మూఁడు మూఁడు దిగుడుబావులును సభామంటపంబులును గ్రీడాశైలంబులును వాని నిండ ధారాయంత్రములును విరాజమానంబులై యుండెను. అవి దాఁటిపోయినతరువాత మణిమయంబులగు నాలుగు తోరణంబులచే రాజిల్లు వేదికయు నా యరఁగుమీఁద విచిత్రమగు కేతుమాలికయు నది దాఁటినపిదప మణిమయంబులగు నాలుగు గోపురంబులుగల సువర్ణప్రాకారంబును దానినడుమఁ గల్పద్రుమ వనంబును దానిమధ్యంబునఁ జతుర్గోపురం బగు బంగరు టరంగు నాయరఁగునకుఁ దొమ్మిదివైపులఁ దొమ్మిది ద్వారంబులును నా ప్రతిద్వారంబునకుఁ దొమ్మిదితొమ్మిది స్తూపంబులును దానినడుమ నున్నత శృంగంబులు గల యొక సభామండపమును కలదు. దానినడుమఁ గంధకుటియను నొక నున్నతస్థానంబును, దానినడుమ మణిమయంబగు సింహాసనంబును జెలువారుచుండెను. ఆ సింహాసనమున యోగముద్రఁబూని శిష్యులకుఁ దత్త్వోపదేశము చేయుట కభిముఖుఁడై జినేంద్రుఁడు నివసించెను. దత్తాదులగు మునీంద్రులును మఱియు

బెక్కుమంది స్త్రీలును నింకను బహుపక్షిమృగాదులును జినావాసమగు ప్రాకారమునకుఁ జుట్టునున్న పండ్రెండుకోష్టములయందును దత్త్వాకాంక్ష మెయిఁ బ్రతీక్షించుచుండిరి.

ఇది సప్తదశ సర్గము

## అష్టాదశ సర్గము

★

సమస్త భాషాసులభమగు ధ్వనితో జగద్గురువైన యాజినేంద్రుఁడు దగ్గఱనున్న గణములకుఁ దమమతమిట్లు బోధించెను:- జీవ, అజీవ, ఆశ్రవ, బంధ, సంవర, నిర్జర, మోక్షములను నేడు తత్త్వములు. పుణ్యాపాపములు బంధమందంతర్భూతములే. కావనువారి పక్షమున వారితోఁ గూడఁ దత్త్వములు తొమ్మిది. జీవుఁడనఁ జేతనారక్షణము కలవాఁడు. అతఁడే సర్వకర్మలకుఁ గర్త. కర్మజన్యమగు ఫలము ననుభవించు వాఁడు నతఁడే. స్థిత్యుత్పత్తిలయ ములు కలవాఁడు; శరీర మున్నంత వఱకు నుండువాఁడు: శరీరమంత ప్రిమాణము కలవాఁడు; ఈజీవుఁడు భవ్యుఁ డనియు నభవ్యుఁడనియు రెండువిధములు. నారకాది భేదములచే నా భవ్యా భవ్యులు నాలుగునాలుగు విధములు కలవారు.పృథివ్యాది భేదములచే నా రక మేడువిధములు. పృథివి రత్నప్రభ, శర్కరప్రభ, సికతాప్రిభ, టంకప్రభ, ధూమప్రభ, తమఃప్రభ మహాతమఃప్రభ యని సప్తవిధములు. ఈసప్తపృథు వులయందుఁగల నరకముల ప్రమాణములు చెప్పుచున్నాను. ప్రథమపృథివి యేడువిండ్ల పెట్టుమీఁద మూఁడుమూరల యాఱంగుళములు: రెండవపృథివి పదేనువిండ్లు నేడుమూరలు పదుమూఁడంగుళములు: మూఁడవది ముప్పది రెండు చాపములు నొకమూరెఁడు. నాల్గవది యఱువదియైదు చాపములు రెండుమూరలు. ఐదవది నూటయిరువదియైదు చాపములు. ఆఱవది రెండువందల యేఁబది ధనుస్సులు. ఏడవది యైదువందల ధనుస్సుల

పెట్టు. 1, 3, 7, 10, 17, 22, 33, ఆప్పృథువు లేడింటికిఁ గ్రమముగా నాయుర్దాయము. ప్రథమక్షితికిఁ బదివేల సంవత్సరము లధమాయుర్దాయము. మొదటిపృథివి యధమాయుర్దాయము రెండవపృథివి కుత్తమాయుర్దాయము. ప్రథమ పృథివియందు ముప్పది లక్షలును, రెండవ దాని యందిరువదియైదు లక్షలును, మూఁడదానియందుఁ బదేను లక్షలును, నాల్గవదానియందుఁ బదిలక్షలును, నైదవదానియం దేడు లక్షలును, నారవ దానియందొఱులక్షలుసు జరమపృధివియం దైదు లక్షలును నరకములు గలవు. పెక్కువిధములగు నారంభములవలనఁ గలిగినపాపములచేఁ బరవశీకృతులై జీవులానరకము లందుఁ బడి దుఃఖమనుభవింతురు. నరకభేదములును జీవభేదములు నిప్పగిది వర్ణించితిని. ఇఁకఁ దిర్యగ్గతి కృతంబగు భేదముఁ జెప్పెదను. తిర్యగ్జీవుఁడు త్రసస్థావర భేదములచే రెండువిధములు. అందుఁ ద్రసము రెండింద్రియములు మొదలుకొని యైదింద్రియముల వఱకుఁ దనరారునది. స్థావరము పృథివీకాయిక మనియు, జలకాయిక మనియుఁ, దేజఃకాయిక మనియు, వాయు కాయికమనియు, వనస్పతి కాయికమనియు నైదు తెఱంగులు॰ పంచేంద్రియ శరీరమునకుఁ బొడవు సహస్రయోజనములు. ఏకేంద్రియమునకంటె దీని కిందుచేతనే యుత్కర్ష కలదు. ద్వీంద్రియములు పండ్రెండు యోజనముల ప్రమాణము కలవి. త్రీంద్రియములకు మూఁడును జతురింద్రియము లకు నాల్గును యోజనములు ప్రమాణము. స్పర్శనము, రసనము, ఘ్రాణము, చక్షుస్సు, శ్రోత్రము నని యైదింద్రియములు. ఏకేంద్రియమన స్పర్శనేంద్రియము కలది, ద్వీంద్రియము త్వగ్రసనలుకలది, త్రీంద్రియము త్వగ్రసనాఘ్రాణము కలది, చతురింద్రియమునకుఁ ద్వగ్రసనాఘ్రాణ చక్షుస్సులును, బంచేంద్రియము లకుఁ ద్వగ్రసనాఘ్రాణ చక్షుశ్శ్రోత్రములును గలిగియుండును. ఇరువదిరెండువేల సంవత్సరములు పృథివీకాయికమున కాయుర్దాయము. ఆప్కాయికమున కేడువేలు, మారుతకాయకమునకు మూఁడువేలు, వనస్పతి కాయికమునకు బదివేలు, దేజఃకాయికమునకు మూఁడు పగళ్ళే

ద్వీంద్రియమునకుఁ బండ్రెండు వత్సరంబులును, త్రీంద్రియములకు నలువది తొమ్మిది దినములును, చతురింద్రియముల కాలుమాసములును, పంచేంద్రియములకుం గోటియు నాయుఃప్రమాణము. తిర్యగ్జాతి ప్రభేదముల క్రమమిపుడు చెప్పినాఁడను. ఇఁక నరులఁగుఱించిచెప్పుచుంటిని.

భోగభూములనియుఁ గర్మభూము లనియు మనుజులు రెండుతెగలవారు. అందు భోగభూములు దేవకుర్వాది భేదములచే ముప్పదితెఱంగులు. మధ్యోత్తమ జఘన్యభేదముచే వీరంతటికి మూఁడు భేదములు కలవు. అందుత్తమ భోగభూముల కాలువేల చాపములును, మధ్యమభోగభూములకు నాల్గువేల చాపములును, జఘన్యభోగ భూములకు రెండువేల చాపంబులును, బ్రమాణము. కర్మభూములగు మనుజు లార్యులనియు మ్లేచ్ఛులనియు రెండువిధములవారు. అందార్యులు భరతాది భేదములచే పదునేను తెఱంగులు. కర్మభూముల కాయుర్దాయ మైదువందల యిరువదియైదు చాపములు. భరతైరావత ఖండములు వృద్ధిహాసెను లనియుఁగాలభేదంబున నుత్సర్పిణ్యవసర్పిణు లనియుఁ జెప్పఁబడును. అవసర్పిణి పది సాగరకోటుల ప్రమాణము కలది. ఉత్సర్పిణియు నంతియ యని చెప్పుదురు. సుషమ, సుషమాసుషమ, సుషమాదుఃషమ, దుఃషమాసుషమ, దుఃషమ, అత్యంతదుఃషమ యను నాలుభేదంబు లారెంటికిని గలవు. మ్లేచ్ఛులును ఖండభేదములచే నైదు భేదములు కలవారు. ఆర్యులును షట్కర్మభేదములచే షట్ప్రకారకులును గుణస్థాన భేదముచేఁ బండ్రెండు భేదములు గలవా రగుచున్నారు. ఇప్పగిది మనుష్య భేదముచేఁ జీవనిరూపణము చేసితిమి. ఇఁక దేవభేదముచేజేయు చున్నారము. ఆదేవతలు భావనులనియు, వ్యంతరులనియు, జ్యోతిష్కులనియు, వైమానికులనియు- నాల్గుతెగలవారు. వారికి నలువురకు భిన్నభిన్న శరీరములుకలవు. అందు అసురులు, అహికుమారులు మొదలగు పదిభేదములు కలవారు భావనులు, కిన్నరులు మున్నగు నెనిమిది తెఱఁగులు గలవారు వ్యంతరులు, సూర్యచంద్రాదులు జ్యోతిష్కులైదువిధము లైనవారు. వైమానికులు కల్పాతీతులనియుఁ గల్పజులనియు నిరుదెఱఁగులు. సౌధర్మాది

కల్పములం దున్నవారు కల్పజులు, గ్రైవేయకాది స్థానములయందలి వారు కల్పాతీతులు తొమ్మిది విధములవారు. మఱియుం గల్పాతీతులు సర్వార్థసమృద్ధియు సర్వముం జూడఁగల నేత్రములును గలవారు. భవ ముల నాశ్రయించియుండు భావనులలో నసురకుమారకులకు మాత్రము పదేను చాపంబులును దక్కినవారికిఁ బదిచాపంబులును మానము. వ్యంతరు లకుఁ బదేడు ధనుస్సులపెట్టు ప్రమాణము. జ్యోతిష్కులకును నంతియే, సౌధర్మేశానులకుఁ బదేడుచేతుల నిడుపు సనత్కుమార మహేంద్రకల్ప ముల నుండువారికి నూఱుచేతుల పెట్టుప్రమాణము. బ్రహ్మకపిష్ఠులకును దన్మధ్య పతితుల్కును బంచహస్త ప్రమాణము శుక్రుఁడు మొదలగు నాకృతులకు నాల్గుచేతులు పెట్టు. ప్రణతులకు. సార్థహస్తత్రయము. అరు ణాచ్యుతకల్పములం దుండువారికి మానము మూఁడు హస్తములు. గ్రైవేయ కల్పమునకుఁ గ్రింద నుండువారందఱకు రెండున్నరచేతుల పెట్టు. దానికూర్ధ్వము నందుండువారికి మూఁడుచేతులపెట్టు. భవనవాసుల కాయుస్సు సాగరోపమము. వ్యంతరులకుఁ బల్యోపమము. ఈ యిరుతెగల వారికి నధమాయుర్దాయము పల్యములో నెనిమిదవ వంతు. సౌధర్మే శాన కల్పములలోని వారలకు రెండుసాగరముల యాయుర్దాయమని సమస్తపదార్థములును గరతలామలకముగాఁ జూచుజినులు చెప్పుచున్నారు. బ్రహ్మబ్రహ్మోతర కల్పములలోని వారికిఁ బదిసాగరములును రాంతవ కాష్ఠ కల్పముల యందుండువారికిఁ బదునాలుగును శుక్రమహాశుక్ర కల్ప ములలో వసించువారికిఁ బదియాఱును శతారసహస్రారములయం దుండు వారికిఁ బదునెనిమిదియు నానతప్రణతస్థుల కిరువదియు వారణాచ్యుత కల్పస్థుల కిరువదిరెండును తక్కిన కల్పములవారి కొక్కరి కంటె నొకరికొక్కటి యెక్కువగా సాగరము లాయుర్దాయము. ఈరీతి జీవ నిరూపణముఁ గావించితిమి. ఇంక నజీవనిరూపణ మొనర్చెదము.

ధర్మము, అధర్మము, ఆకాశము, కాలము, పుద్గలము నని యజీవ భేదములైదు. ఇందు జీవుఁడుఁ గూడఁ జేరినచో వీనినే షడ్ద్రవ్యము లని

చెప్పుదురు. కాలము తప్పఁ దక్కిన యైదుద్రవ్యములు నస్తికాయంబు లనఁబడును. చేఁపలు నడచుటకు జలమెట్లు సాధనమో యట్లు జీవాదులగు పదార్థములు నడచుటకు సాధనమైనదే ధర్మమనఁబడును. నిత్యమై శరీరము లేనిదై సర్వజ్ఞుల జ్ఞానమునకు మాత్రమే గోచరమై యుండునది యాకాశమనఁబడును. పుద్గలాది పదార్థములు నడచుటకుఁ కారణమైనది యధర్మ మనఁబడును. చరాచరాది భూతములన్నియుఁ బరస్పర సంబంధము లేకుండ నెందు నివసించఁగల్గునో సర్వవ్యాపకమగు నదియే యాకాశమని కొందఱు చెప్పుచున్నారు. కాలమనఁగ వర్తనమే లక్షణముగాఁ గలది. అదియే సకల పదార్థముల యాయుర్దాయ ప్రమాణమును సూచించుచుండును. సూర్యచంద్రాదుల యుదయాస్తమయాది క్రియలు తప్పఁ గాలము వేఱలేదని కొందఱు నుడువుచున్నారు. కాలమనఁ గ్రియలే కావు. కేవలము కాలమని వ్యవహరింపఁ బడుచున్నవి కాని క్రియాభిన్నమగు కాలమను పదార్థమొకటి కలదని ధ్వనివేత్తలు చెప్పుచున్నారు. గౌణవృత్తిచే దానియందే కాలవ్యవహార మనియు, ముఖ్యములేనిదే గౌణవృత్తి యుండదు గావునఁ గ్రియలకంటె భిన్నమగు కాలపదార్థముండక తీరదు. నరసింహుఁడను నప్పుడు నరునియందు సింహత్వ మారోపించినను సింహమను జంతువు వేఱుగా లేని యపుడట్టి యారోపము యుక్తము కాదుగదా! కావునఁ గాలమను ద్రవ్యము వేఱుగ నొక్కటి కలదు. రూపగంధ రసస్పర్శ శబ్దములుగలది పుద్గలమనఁబడును. అది యణుస్కంధ ప్రభేదములచే ద్విస్వభావము కలది. మఱియుఁ బృథివ్యాది రూపములచేతను స్థూలసూక్ష్మాది భేదములచేతను, ఛాయాతపాది ప్రకారముల చేతను బెక్కువిధములుగా నున్నది. శరీరేంద్రియ రూపముచేతను బ్రాణాపానాది పర్యాయముల చేతను బ్రాణవంతుల కుపకారము చేయునది యాపుద్గలమే. ఆజీవుని రూపము విరక్తమని యాగవిదు లనుచున్నారు. ఇఁక నాశ్రవతత్త్వ రూపమును జెప్పుచున్నాఁడను.

ఆశ్రవమనఁగాఁ గర్మములు వచ్చు ద్వారము. కర్మములు మనోవాక్కాయ పూర్వకములు. పుణ్యకర్మము శుభమనియుఁ బాపకర్మ

మశుభమనియుఁ జెప్పుదురు. సకషాయుఁడనియు నకషాయుఁడనియు శుభాశుభ కర్మముల కిరువురు ప్రభువులు కలరు. అం దాసాధనము, మాత్సర్యము, గురునిహ్నవనము మొదలగునవి జ్ఞానావృత్తి దృగావృత్తుల యాశ్రవము లని వర్ణింపఁబడుచున్నవి. పరిదేవనము, సంతాపము, శోకము, ఆక్రందనము, వధము మొదలగునవి సాతవేద్యము కాని కర్మమునకు ఫలములు. రాగసంయమము శౌచము, దానము, శాంతి, అనుకంపనము మున్నగునవి సాతవేద్యమగు కర్మమునకుఫలములు. విసంవాదనము, అత్యంత యోగవక్రత్వము మొదలైనవి యశుభమను పేరు గల కర్మమునకును విపరీతమైనది శుభకర్మమునకును ఫలములు. స్వప్రశంస. అన్యనింద యీరెండును నీచగోత్ర జనితులకు లక్షణములు. స్వనింద యన్యప్రశంస, యుత్తమగోత్ర జనితులకు లక్షణములు. దానాదులకు విఘ్నము చేయుటయే యంతరాయ మనఁబడును. ఇట్లాశ్రవ తత్వమును వర్ణించితిని. ఇఁకముందు బంధతత్త్వమునకు వ్యాఖ్యానము చేయుచున్నాఁడ.

అసమ్యగ్దర్శనము, యోగవిరతి, విపర్యయము, ప్రమాదము. కషాయము నను నీయైదును బంధమునకుఁ గారణములు.సకషాయమగుజంతువునకుఁ గర్మయోగములగు పుద్గలములతోడి సంబంధమే బంధమనఁబడును. ప్రకృతియు, స్థితియు, విభాగము, ప్రదేశమునని యాబంధము చతుర్విధము. జ్ఞానావృత్తి, దృష్ట్యావృత్తి, వేద్యము, మోహనీయము, ఆయుస్సు, నామము, గోత్రము, అంతరాయమునని ప్రకృతు లెనిమిది. అయిదు, తొమ్మిది, రెండు, యిరువది యెనిమిది, నాలుగు, నలుబదిరెండు ఏడుభేదము లాయష్ట ప్రకృతులకు వరుసగాఁ గలవు. జ్ఞానావృత్తి దృగావృత్తులకును వేదనీయాంత రాయంబులకును ముప్పదికోట్ల సాగరములును, మోహనీయము నకు డెబ్బదికోట్లును నామగోత్రముల కిరువది కోట్లును ఆయుష్షునకు ముప్పదిమూఁడు కోట్లును సాగరముల స్థితికలదు. కర్మవిపాకమే యను భావమనఁబడును. యోగభేదముచేఁ గర్మముబంధు

స్థానములన్నియుఁ బ్రదేశము లనఁబడును. ఇది బంధ నిరూపణము. ఇంక సంవరము నిరూపింతము.

కర్మము నిరోధించునది కావున సంవరమనఁ బడును. చరిత్ర గుప్తి, అనుప్రేక్ష. మొదలయిన భేదములు కలది సంవరతత్త్వము, ఇంక నిర్జరానిరూపణము చేయుచున్నారము.

నిర్జర,అకాలకృతయనియు నుపక్రమకృతయనియు రెండు భేదములు కలది. నరకమునందుఁ గర్మములనుభవించుట యకాలకృత నిర్జరయనఁ బడును. తపస్సు చేత నైనది యుపక్రమకృత యనఁబడును. నిర్జరాకారణమగుతపస్సు పండ్రెండు తెఱఁగులుకలది. బాహ్యమనియు నాభ్యంతరమనియు మొదటఁ దపములు రెండు విధములు. అవి ప్రత్యేక మాఱేసి తెఱఁగులు కలవి. ఉపవాసము, అవమోదర్యము, వృత్తిసంఖ్య, రసోజ్ఝనము. వివిక్తవాసన, కాయక్లేశమునను నీయాఱును బాహ్యతపోభేదములు. స్వాధ్యాయము, సంవృతి, ధ్యానము, వ్యుత్సర్గము, వినయము, ప్రాయశ్చిత్తము నను నీయాఱు నాంతర తపోభేదములు. ఇందు సుబోధములగు స్వాధ్యాయానశ నాదితపఃప్రపంచమును వదలి దుర్బోధనమగు ధ్యానప్రపంచమును జేయుచున్నారము. ఆర్తి యనియు రౌద్ర మనియు ధర్మమనియు శుక్లమనియు శుభాశుభగతిప్రద మగు ధ్యానము చతుర్విధము. అనిష్టము సంభవించి నపు డది పోవుటకుఁ దగినవిచారము చేయుట చేతను హితవియోగము సంభవించి నపుడది పోవుటకుఁ దగినయుపాయ మాలోచించుట చేతను రోగాదులవలనఁ బుట్టిన వేదన మాటిమాటికిఁ దలఁచుకొనుటచేతను రోగాదులచేతను నార్తి పొడముచున్నది. హింసానృత స్తేయ విషయ ప్రతిపాలనములచేత రౌద్రము పొడమును. విపాకము, విచయము, నపాయవిచయము, సంస్థానవిచయమునని ధర్మధ్యానము చతుర్విధము. పృథక్త్వము మొదలు వితర్కము వఱకుఁ బ్రథమ శుక్ల మనియు, నేకత్వము మొదలు వితర్కమువఱకు ద్వితీయశుక్ల

మనియుఁ జెప్పఁబడును. ఇఁక మోక్షతత్త్వమునకు వ్యాఖ్యానముఁ జేసెదము.

సమస్తకర్మక్షయమే మోక్ష మనఁబడును. అందులకు జ్ఞానము, సద్దృష్టి, సచ్చారిత్రము నను నీమూఁడే కారణములు.సద్దృష్టియనఁ దత్త్వము లన్నియుఁ దెలిసికొనుట. చారిత్ర మనఁ బాపారంభములు చేయకుండుట సంసారధ్వంసము చేయుట కీమూఁడును దప్ప నితరములయిన మందులు లేవు. ఏకాంగవికలమగు నౌషధము రోగంబును బోఁగొట్టని పగిదిఁ జరిత్రదర్శనములు లేని జ్ఞానము మోక్షమునకు సాధనము కానేరదు. సమ్యగనుష్ఠిత మగు మందు రోగముం బోనడంచిన పగిది సమ్యక్పరిశీలితము లగుతత్త్వములే సంసారము నడంపఁగలవు. కర్మములకుఁ బ్రతిపక్షము లయినవి. కావున జ్ఞానదర్శన చరిత్రములు ముక్తికిఁ గారణములు. జ్ఞానాదులు పెరిఁగినకొలఁది రాగాదులు నశించుట వలనను, రాగాదులు నశించిన కొలఁదిఁ గర్మక్షయ మగుట చేతను గర్మక్షయము ద్వారమున జ్ఞానాదిత్రయము ముక్తికిఁగారణము.స్వదేహకృతమగు క్షీణకర్మముఁ జేయుచు జీవుఁ డూర్ధ్వముగా వహ్నిజ్వాలవలె సహజధర్మము చేతనే పోవును. అట్లుపోయి లోకాగ్రమును బొంది యచట స్థిరముగా వసించును.'' అను తత్త్వోపదేశమున సభనంతయును స్వవశము గావించుకొనియెను.

నిఃఖేదత్వము మొదలగు సహజములగు పదిగుణములచేతను నా మహానుభావుని శరీరము భాస్కరకాంతిని మించి ప్రకాశించెను. ఈపగిది నెచ్చట నెచ్చట నామహానుభావుఁ డుపదేశింపసాగెనో యా దేశమంతయు సుభిక్షమై యీతిబాధలకు దూరమయ్యెను. రెండువందలయామడలదూరము వఱకునున్న ప్రజలందఱును నాయనయెడల నొక్కవిధమైన ప్రేమకలవారు కాసాగిరి. ఆ జినేంద్రుని యాకాశగమన మందఱ కానందజనకమయ్యెను. అయ్యనఘుని క్షుత్పిపాసలు రెండును నించుకయు స్పృశింపలేక

పోయినవి. శరీరము సంపూర్ణచంద్రునివలెఁ గనువారి కందోయికిఁ జల్లనై యుండెను. తెప్పపాటులేని యాయనయొక్క నేత్రములు నీలోత్పలముల వలెఁ బ్రకాశించెను. సర్వవిద్యానాథుఁడగు నామహాత్ముని మూర్తి రజో విముక్తమై ముక్తిసంగమనోత్సుకమైయుండెను. సర్వతత్త్వములుబోధించు నతని మాగధీభాష సర్వభాషాత్మికయై వినువారికెల్లరకు స్వభాషయై వినిపించెను. ఆయన దేశాటనము చేయునపుడు పోయినచోట నెల్ల సర్వర్తు సంపద తులదూఁగు చుండెను. ఏవమాది సర్వగుణోపేతుఁడగు నాజినేంద్రుఁ సర్వజగదైశ్వర్యబోధకము లగు వచనములచే సభనంతను స్వసమాన గుణవంతముగాఁ జేయసాగెను. ఎనిమిదివేల నన్మార్గరుశిష్యులతనివలె నుపదేశింపఁదగినవారు బయలు దేఱిరి. పదివేలమంది ముక్తిం బొందిరి. ఆఱువేలమంది ప్రతివాదు లోడింపఁబడిరి. వరుణుఁడు మొదలగు నార్యులు లక్షయెనుబదివేలు శుద్ధచేతస్కులైరి. ఈప్రకారం బుగ దేశమంతయు విహరించి గుణవంతులగు మునిబృందములచే సేవింపఁబడుచు ధర్మోపదేశజలముచే భవ్యసస్యములు పండించుచుఁ బ్రమోద శైలాగ్రము నధిష్ఠించి యుండెను. భాద్రపద శుద్ధ సప్తమినాఁడు దశ లక్షపరిణామముగల యాయుస్సు సమాప్తిజెందుడు శుక్లధ్యానముచే నిరస్తమైన సమస్తకలుషములుగల యాజినేంద్రుఁడు పరమసిద్ధి నాశ్రయించెను. పెక్కు చైత్యాలయములచేఁ బ్రకాశించుచు జినేంద్రుని పరమపదప్రాప్తికిఁ గారణమైన యచ్చోట దేవతలు నూటయేఁబది చాపముల నిడుపు గల తచ్ఛరీరమును అగురు చందనప్రముఖములగు సుగంధద్రవ్యములచే సంస్కరించి పంచమ కళ్యాణము నాచరించి తమతమ నివాసము లకుఁ జనిరి.

ఇది యష్టాదశ సర్గము

## గ్రంథకర్తృ ప్రశస్తి.



భవ్యులను పద్మములకు సూర్యుండును మునీంద్రులకుఁ బ్రభువును గణభృత్తుతో సమానుఁడును సత్పురుషులలో నగ్రగణ్యుండును సర్వగుణాకరుఁడు నగు గుణనందియను మహానుభావుఁ డొకఁడు కలఁడు.

గుణగ్రామమున కంభోధియు మిత్రతేజములకు స్థానము నగు విబుధగణ నందియను ప్రసిద్ధపురుషుఁ డా శ్రీగుణనందికిఁ బ్రథమ శిష్యుఁడయ్యెను. ఈ మహానుభావునిశాసనము మహీభర్త శాసనమువలె నందఱును శిరసావహించుచుండిరి. ఆవిబుధగుణనందికి మునిజననుత పాదుఁడును సకలగుణసమృద్ధుఁడును నస్తంగత మిథ్యాప్రవాదుఁడునగు సభయనంది శిష్యుఁడై జైనధర్మాభినందియై స్వకీయ మహిమానిర్జిత సింధువై సమస్తలోకబంధువై ప్రసిద్ధివహించె. ఆగుణనిధికి శిష్యుఁడై వీరనంది భవ్యాంభోజములు వికసింపఁజేయుటకు దినకరుఁడై ముల్లోకములు నిండిన కీర్తి సంపాదించి కుతర్కగజముల కంకుశమైన వాగ్విభవము చేకొని జినేంద్రుఁడగు చంద్రప్రభుని చరిత్రము శబ్దార్థసుందరముగా రచించెను.

మొదట సౌధర్మ కల్పంబున వీరవర్మనృపతియై పిదప నజితసేన నృపాలుండై తరువాత నచ్యుతేంద్రుఁడై సప్తమభవంబునఁ దీర్థకరుండై చంద్రప్రభుండను పేర జినేంద్రుఁడైన మహాత్ముండు మమ్ము రక్షించుఁగాత!

— గద్య —

ఇది శ్రీకింకకవీంద్ర ఘటాపంచానన - విద్వత్కవి బాలకళానిధి
బాలసరస్వతి మహాకవి చక్రవర్తి కళాప్రపూర్ణ శతావధానీ
త్యాది - బిరుదాంచితులగు - తిరుపతి వేంకటేశ్వరు
లచే-ఆంధ్రీకరింపఁబడిన వీరనందికవి కృతంబైన
చంద్రప్రభ చరిత్రమునందు పర్వమ్మును
స మా ప్త ము. ఓ మి తి శి వ మ్.
శ్రీమత్పర దేవతార్పణమస్తు!



# * ముఖ్యమైన సవరణలు

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 8 | బులు | బుల |
| 5 | 23 | చ్చని | చ్చిన |
| 6 | 11 | శబ్ధ | శబ్ద |
| 7 | 20 | లునుగ్గై | లనుగ్గై |
|  | „ | వశ | వస |
| 8 | 24 | యెక | యొక |
| 14 | 3 | త్మము | త్మను |
| 14 | 24 | కము | కుమము |
| 15 | 27 | టింబి | టుంబి |
| 16 | 5 | మస్థ | మస్త |
| 34 | 20 | డగు | డనగు |
| 34 | 24 | తిమి | తివి |
| 38 | 16 | జిఱ | జిర |
| 40 | 19 | కుటి | కుమటి |
| 40 | 22 | మును | మను |
| 42 | 6 | రలు | రల |
| 43 | 24 | మత్యు | మృత్యు |
| 51 | 13 | తేం | తేవిం |
| 54 | 1 | గలంగల | గల |
| 55 | 20 | రుచుల | రుల |
| 56 | 6 | దాశ్య | దాస్య |
| 56 | 26 | గడు | గండు |

| పేజీ | పంక్తి | తప్పు |
|---|---|---|
| 64 | 2 | బిద్ధి |
| 64 | 3 | చంద్ర |
| 66 | 3 | మునకు |
| 68 | 2 | లగ్ర |
| 68 | 25 | యెడ |
| 72 | 14 | డున |
| 72 | 19 | ఖిం |
| 72 | 21 | ఖిం |
| 72 | 25 | స్తలి |
| 77 | 3 | మధాం |
| 82 | 13 | ధనస్సు |
| 86 | 6 | ద్ర |
| 90 | 25 | రంగా |
| 95 | 12 | దంబు |
| 95 | 24 | తయ |
| 99 | 11 | గగుం |
| 102 | 27 | నంద |
| 104 | 6 | ముగ్తా |
| 106 | 11 | రంబు |
| 108 | 14 | డుయే |
| 110 | 16 | నమ |
| 111 | 15 | వారణ |

## తిరుపతి వేంకటకవులొనర్చిన తెనుఁగు గ్రంధములు

### చాటువులు

| | | | |
|---|---|---|---|
| 44 | నానారాజ సందర్శనము | 4 | 0 |
| 45 | శతావధానసారము | 2 | 0 |
| 46 | కలగూరగంప | 1 | 8 |

### వచనములు

| | | | |
|---|---|---|---|
| 47 | కథలు – గాథలు (1-2-3-4. సంపుటములు) | 5 | 0 |
| 48 | హర్ష చరిత్రము | 1 | 0 |
| 49 | చంద్రప్రభ చరిత్రము | 1 | 8 |
| 50 | విక్రమాంకదేవ చరిత్రము | 1 | 8 |
| 51 | కాశీయాత్ర | 0 | 12 |
| 52 | సారస్వత విమర్శలు | 10 | 0 |
| 53 | భారత వీరులు | 0 | 6 |
| 54 | విక్రమ చెళ్ళపిళ్ళ | 0 | 8 |
| 55 | షష్టిపూర్తి | 0 | 8 |
| 56 | దివాకరాస్తమయము | 0 | 12 |

### సంస్కృత గ్రంధములు

| | | | |
|---|---|---|---|
| 57 | కాశీసహస్రమ్ | 0 | 12 |
| 58 | ధాతురత్నాకరమ్ | 2 | 0 |
| 59 | శృంగార శృంగాటకమ్ | 1 | 0 |
| 60 | క్షమాపణమ్ | 1 | 8 |
| 61 | పిష్టపేషణమ్ | 0 | 4 |
| 62 | శలభాలభనమ్ | 0 | 4 |

### లఘుకావ్యములు

| | | | |
|---|---|---|---|
| 63 | వ్రతకథలు | 2 | 0 |
| 64 | పురాణగాథలు | 2 | 0 |
| 65 | రసికానందము | 0 | 3 |
| 66 | శనిగ్రహము | 0 | 3 |
| 67 | గ్రామసింహము | 0 | 4 |
| 68 | బిడాలోపాఖ్యానము | 0 | 4 |
| 69 | వ్యాసనిష్కాసనము | 0 | 4 |
| 70 | దైవతంత్రము | 0 | 6 |
| 71 | వైరాగ్యశతకము | 0 | 4 |
| 72 | శుకరంభా సంవాదము | 0 | 8 |
| 73 | శివశంకర విజ్ఞప్తి | 0 | 8 |
| 74 | రాసభకుమారుఁడు | 0 | 8 |
| 75 | దివ్యతిరుపతి | 0 | 8 |

### శతకములు–స్తవములు

| | | | |
|---|---|---|---|
| 76 | కాళికాది స్తోత్రమాల | 1 | 4 |
| 77 | కామేశ్వరీ శతకము | 0 | 4 |
| 78 | ఆరోగ్య కామేశ్వరి | 0 | 4 |
| 79 | ఆరోగ్య భాస్కర స్తవము | 0 | 4 |
| 80 | మృత్యుంజయ స్తవము | 0 | 4 |
| 81 | నమశ్శివాయ స్తోత్రము | 0 | 8 |
| 82 | శివ స్తవము | 0 | 12 |
| 83 | సౌభాగ్యకామేశ్వరి (1-2-3- భాగములు) | 3 | 0 |

వలయువారు

**చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు**

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం P. O. తూ॥ గో॥ జిల్లా

అనివార్యుడు